సమన్వయ గ్రంథమాల. ౧.

# జీవన వేదము.

శ్రీమదాచార్యకేశవచంద్రుని నిజానుభవనిరూపితస్వకీయజీవనతత్త్వము.)

కవుకొండల సాంబశివరావుచే

వంగభాషనుండి యాంధ్రీకరింపఁబడి,

శ్రీ సుజనరంజనీముద్రాక్షరశాలయందు

పోతాప్రగడ బ్రహ్మానందరావుగారిచేఁ

ముద్రితమై

యనువాదకునిచేఁ బ్రకటింపఁబడియె.

కాకినాడ.

1911.

# విషయసూచిక.





# ఉద్బోధన.

హా! జీవనవేదమా! నీకు నమస్కారము. మదీయహృదయా
నందమా! నీకు నమస్కారము. తిరిగి నిన్ను నాకపుత్తలికముఁ
జేతునే! ఛీ! ఛీ! తిరిగి యాచర్వితచర్వణమార్గమునందుఁ బడను.
అయినను నీకు నమస్కరింతు. మదీయనవజీవనంబునకుఁ గారణంబ
వీవ. ఏమని చెప్పుదు, తల్లీ! నాఁడు నిన్ను నమ్ముకొనుటఁ బట్టిరయే,
యింటనుండి బయల్వెడలనడఁచి, యరణ్యముల పాల్చేసితివి! కాని
యీశ్వరప్రసాదముచేఁ దిరిగి గృహముఁ జేరితిని. అప్పటినుండియు
నెన్ని చెరువుల నీరుఁ ద్రాగించితివి. ఇఁకను ద్రాగుచున్నాను. ఇంకెల్లకాల
మును ద్రాగుదును. తల్లీ! నిజముగ నీవు జీవనమునకు వేదంబవు. భవ
దీయశక్త్యావేశమునఁ బడి, మత్తుఁడై, యీతుచ్ఛమానవుండు నీకాంధ్ర
భాషానూతనవసనంబును ధరియింపనిచ్చె. నీవీనూతనవస్త్రధారణము
నం దెల్లకాలము విలసిల్లుచుందుము. ఈ యొక జీవనము నే కాక యింకను
నాంధ్రదేశమందలి నానామానవుల ప్రాణములను గలనరపెట్టుము.
దేశంబంతయుఁ ద్వదీయవజ్రఘాతమునఁ బడి నవజీవనధారి యగుఁ
గాక! వంగదేశములో నెంతెంతమంది జీవనముల నీవు దద్దఱిలఁ
జేయుచున్నావు. ఇంకను జేయును. దీర్ఘాయుష్మంతురాలవై చిరకా
లము వర్ధిల్లుము. భగవానుఁడు నిన్నాశీర్వదించును గాక!!

హా! కేశవచంద్రా! హా! బ్రహ్మానందా! హా! మదీయాచా
ర్యోత్తమా! నీకు నమస్కరింతు. నన్నే నాఁడు పట్టితివో కాని. నీవు గట్టిగఁ
బట్టితివి. ఇఁక వదలునట్లు లేవు. నాకును వదలించుకొన నిష్టము లేదు.
చిరకాలము పట్టియుందుము. నీ వెన్ని సత్యములఁ దెల్పితివి. ఎన్నిటికర్థ
మును జెప్పితివి! ఎన్ని సమస్యలఁ దెగఁగొట్టితివి! ఎన్ని తత్త్వముల

బోధించితివి! ఎంతమంది సాధుసాధకుల, యాచార్యుల, ధర్మప్రవర్తకుల దివ్యదర్శనంబునకు మూలసూత్రంబులఁ దెలియఁబఱచితివి! నీకు నమస్కారము. నేఁడేలోకమున నున్నావో నేనెఱుంగ. ఎక్కడ నున్న నేమి దీర్ఘాయుష్మంతుఁడవై వెలుంగుము. నీబంధుగులగు నీశామోశాలును (Jesus and Moses), బుద్ధసాక్రెటీసులును, మహమ్మదుచైతన్యులును, ఋషిప్రవరాదులును జిరకాలము నీతోడ వర్ధిల్లుదురుగాక !

హా! భగవానుఁడా! నీకు నమస్కారము. నన్నుఁ జిరకాలము నీక్రీతదాసుఁడుగఁ జేసియుంచుకొనుము. నేనెన్నఁడును జెడత్రోవలఁ బోకుందునుగాక! నీకును నాకును మధ్య నేదియు నడ్డము రాకుండునుగాక! తండ్రీ! నన్నింకెన్నఁడును వదలకుము. వదలకుము. తండ్రీ! వదలకుము. ముమ్మాటికిని వదలకుము. ఎల్లకాలము నీక్రోడమందుంచుకొని జోకొట్టుము. నాఁడు మహారణ్యములోఁబడి పలుసంశయములకుఁ బాలై, త్రోవఁగానకున్న పుఁడీజీవనవేదంబును జేతఁబట్టించితివి. ఏనాఁడు పట్టించితివో కానియిది వదలకున్నది. ఎన్నఁడును వదలనీకుము. తండ్రీ! నేఁడీకార్యంబును నీకీర్తిపరునిచేఁ జేయించుకొంటివి. వీఁడును గృతార్థుఁడయ్యెను. ఈగ్రంథరాజంబును జదివి యందఱును గృతార్థులగుదురుగాక !

నవవిధానమా! నీకు నమస్కారము! నిన్నాశ్రయించితి. ఆశ్రయించినవారిని వదలుట న్యాయమా! అట్లైన నాకన్యాయముఁ జేయక సదా యాశ్రయమిమ్ము. బ్రహ్మసమాజమా! నీకును నమస్కారము. బ్రాహ్మభ్రాతలార! మీకును నమస్కారము. ఎల్లకాలము మీకు దాసుఁడను. మనుష్యమాత్రుండను. ఈదాసుని నాశీర్వదించి, వీని సేవల గ్రహింపుఁడు. ఇతఁడును గృతార్థుఁడగును; మీకును నుపకారంబగు. మన

యాంధ్రదేశపు బ్రహ్మసమాజములందింకను నూతనజీవన సంచారం బగుచుండుటలేదు ఇకార్యంబునకై యీదాసుఁడుచేయు యత్నము లందుఁదోడ్పడుఁడు. ఈగ్రంథమును జదివి నవజీవనవస్త్రధారుల రగుఁడు. ఈషోడశోపదేశంబులును భారతవర్షీయ బ్రాహ్మసమాజంబున నచ్చటి వేదినుండి ప్రోక్తంబులయ్యె. అందుమొదటిది బెంగాలీ. శ. ౧౮౦౪. సll శ్రావణము. ౨వ తేదీకి (దాదాపు) సరియైన క్రీ. శ. ౧౮౮౨. సll జూలై. ౨౩వ తేదీనాఁడారబ్ధమయ్యె. ప్రథమాధ్యాయం బుఁజదివితిరేని స్వాభావికప్రార్థనయెట్టిదో యెఱుంగఁగల్గుదురు. ప్రార్థనాశీలురరగుదురు. ద్వితీయాధ్యాయంబు జీవనమునందలి నానా పాపములఁ బ్రదర్శింపఁజేసి మిమ్ములఁ జక్కజాగరూకులనుగాఁజేయును. మీరిచ్చటనుండ బయలుదేరి, తృతీయఘట్టంబునకుఁబోయి చేరితిరేని యక్కడ నగ్నిమండుచుండును; అక్కడనే జాగ్రత్తతో మెలంగ వలయును. అనేకులాప్రజ్వలితాగ్నిలోఁబడిపోదురు. కాని తిన్నఁగఁ జుక్కానిని ద్రిప్పుకొనఁగలిగితిరేని, మీయోడ భద్రంబైయుండు. మీరగ్నిమయోత్సాహమును దాల్చియుందురు. అక్కడనుండి మెల్ల మెల్లన జరిగిపోతిరేని, చతుర్థస్థానంబునకుఁబోయిచేరుదురు. ఇక్కడ వైరాగ్యంబున కర్థంబు తెలియును. ఇది వైరాగ్యపర్వంబు. ఇంకను బోండు. పంచమాధ్యాయంబున నొకవైపున నధీనమునుండియు, మఱియొకవైపున స్వేచ్ఛాచారమునుండియుఁ దప్పించుకొని యథార్థ స్వాధీనపక్షులై విహరింతురు. షష్ఠాధ్యాయమున వివేకంబును బట్టు కొందురు. దీనియాథార్థ్యమును జక్కఁగఁ గ్రహింపుఁడి. దీనిని గొంద ఱాత్మసాక్షి యందురు. దీని నిజానిజములు తెలియవేని బలుమోసం బునఁ బడుదురు. కాన నీయధ్యాయంబును పలుమాఱు పఠింపుఁడి. ఈవివేకంబునే మీరుపట్టుకొనఁ గల్గితిరేనిమీనావకెన్నండును భయమును

మాటలేదు. సప్తమాధ్యాయంబున యథార్థ భక్తినిజూతురు. అష్ట మాధ్యాయంబున వాస్తవిక లజ్జాభయంబుల వికృతిని జూడనగును. నవమాధ్యాయం బతిమధురంబు. దానిని దిన్నగాఁ జదివితిరేని మీకు బ్రహ్మదర్శనంబగును. త్వరపడుఁడు. దశమాధ్యాయంబద్భుతంబు. ఇదిమీకుఁ బట్టెనేని మీరిఁకఁ బార్థివగణనంబును మానుదురు. ఏవిష యమునందును భావనకు నందీయరు. పరిపూర్ణవిశ్వాసులరగుదురు. ఏకాదశాధ్యాయంబు మీజీవనములందు జీర్ణితంబయ్యేనేని మీరిఁక సకలసద్విషయములందును జయమునేపొందుచుందురు. ద్వాదశాధ్యా యంబు నవవిధానమునకుఁ గొంతవఱకర్థంబుఁ దెల్పు. త్రయోదశా ధ్యాయంబు ధర్మజీవనంబునఁ గ్రమముగఁ బరిపక్వంబగు భావ త్రయంబుఁజూపు. చతుర్దశాధ్యాయంబు మీమీజాతుల నిర్ణయించు. పంచదశాధ్యాయంబుమిమ్ములవినీతులఁజేసి సకలజడజీవపదార్థముల యొద్ద శిక్షఁగఱువఁజేయు. షోడశాధ్యాయంబు జీవనవేదంబు యొక్క మర్మంబుఁదెల్పు. ఈగ్రంథరాజంబుయొక్క వాస్తవంబిది. దీనిచే మీరు ధన్యులరగుదురుగాక!

హా! ప్రతాపచంద్రా! ఈసందర్భంబున నిన్నును దేవలసి యున్నది. శ్రీకేశవచంద్రుఁడు నీకుసఖుండనియు, నాచార్యుండని యు, నేతయనియు, నీవేకదా చెప్పితివి. అప్పాని జీవనమునందనేకము లగు వింతవింత ఘటనములు ఘటిల్లెఁగదా! ఎన్నెన్ని గందరగోళ ములు జరుగలేదు! ఒక్కొకతఱి రొట్టినమనుష్యులుద్భవింపలేమ! ఆ యన జీవనమునఁనేకులు గ్రహింపఁజాలరైరి. పలువురు పలువిధములు గఁ బల్కిరి. ఎవరికేదితోఁచెనో వారద్దాని నుడివిరి. కేశవచంద్రుఁ డిదంతయుఁజూచి కడువిలపించినదియు నీవెఱుంగవే! నీవుమాత్రమా యన జీవనమును జక్కఁగ గ్రహింపఁగల్గితివా! ఆయన యంత్య

కాలమునకొక సంవత్సరమున్నరకుఁ బూర్వమాయన డార్జిలింగులో వాయుపరివర్తనార్థమై యుండు సమయమున నొక్కనాఁడు నీవా మహాపురుషుని చెంతఁజేరి, "ఆచార్యా! మీజీవనసోపాయమెట్లు జరుగుచున్న" దని (అనఁగా మీయిల్లెట్లు గడచుచున్నదని) యడిగితివి కదా! ఆమాటలువిని బ్రహ్మనందుఁడు తనజీవనములోని సామాన్య విషయములగురించియుఁ దనయాప్తమిత్రులకుఁగూడఁ దెలియకుండుటకుఁజింతిల్లి, యిప్పటికినీతో మాత్ర మావిషయమై శ్రీకాంతిచంద్రునికిఁ దప్పయింకెవరికిని దెలియదనియు, నాతఁడే యాసంగతుల గుఱించి యించుక తెలుపఁగలుగుననియుఁ, దక్కిన వారు చెప్పఁబూనుట యనుచితమనియుఁ జెప్పుచుఁ, దాను లోలోపలఁ దనజీవనమిదివఱకే నానావిధములగు మిథ్యాకల్పనలతో నింపఁబడినదనియుఁ దానే త్వరలో నాత్మజీవనసూత్రములను వ్యక్తీకరింపనిచో వెడల నింకనుహానివాటిల్లుననియు గ్రహించి, ఆయనకుండు స్వభావరీతి నీనానావిషయముల నీశ్వరసాన్నిధ్యమునఁ బెట్టి, యాసందర్భంబున నెట్లుమెలంగవలయునో తెలిసికొనుటకై యెంతయో ప్రార్థించి, తనమనోవేదనల వెలిపుచ్చెను. ప్రతాపచంద్రా! ఈవేదనల యొక్కఫలమే కదా యీమనజీవనవేదము. కావున దీనికి నిమిత్త కారణుండవైన నీకును ధన్యవాదముల నర్పింతు.

హా! నాగేంద్రచంద్రమిత్రా! నీకును నమస్కారము. "నూతన వార్తా" లేఖకుండగు నాప్యారీమోహన్ యాజీవనతత్త్వోపదేశ దినములలో నెడనుండెనో కాని నీవాసమయమున కాదుకొని, యీ షోడశోపదేశంబులను లిఖించియుండవైతివేని మాగతియేమి కావలసి యుండెనో! ఈదుర్భగుని గతియేమగునదో! కావున నీకును నమస్కారము. ఈమానవుఁడు నిన్నెపుడును స్మరించు! ఈగ్రంథమును గొనియాడు నెల్లవారును నిన్నును నాశీర్వదింతురుగాక!

ఇఁక నందఱకు నావందనములనర్పించెద. శ్రీ కేశవచంద్రునిఁ గన్నతల్లీ! నావందనములు. నాకునవవిధాన ధర్మసమస్యలకర్థముల సూచించినయార్యులార! నావందనములు. నాకీవంగభాషఁగఱపిన మిత్రులార! నావందనములు. నన్నుసంవత్సరత్రయంబు నవకాశీ ఘట్టంబుననుండఁగఁజేసినపెద్దలార! నావందనములు. దీనిని వెలిఁగింప నిమిత్తకారణుండవైన నామిత్రమా! నావందనములు. దీనిని సంస్కరించినపూజ్యులార! నావందనములు. దీనిని ముద్రింపనుత్సాహపఱచిన స్నేహితులార! నావందనములు. దీనిని ముద్రింపించినముద్రాధిపతీ! నావందనములు. అందలియచ్చుఁదప్పులను సంశోధించినమాన్యులార! నావందనములు. ఈముద్రణభారమును వహించిన బంధునా! నావందనములు. ఈపొత్తముఁజదువు పాఠకులార! నావందనములు. ఇఁకనెంతెంతమందిని వదలివేసితినో యామీకందఱకు నావందనములు. ఇంకను ననేకవిధములుగ నీకార్యమునందుఁదోడ్పడిన జడములని పిలువఁబడు నా పదార్థములార! మీకును నాసంపూర్ణవందనములు. అన్నిటిని ఘటిల్లఁజేయు నాయీశ్వరా! నీకు మదీయ మనఃపూర్వక వినత వందనంబు!!!

బ్రాహ్మప్రచారాశ్రమము.<br>
మచిలీపట్నము.<br>
౧౦ వ సెప్టెంబరు, ౧౯౧౧.

ఇట్లను వాదకుఁడు.

# జీవన వేదము

## ప్రథమాధ్యాయము.

---

### ప్రార్థన.

భానువారము ౮ శ్రావణము-౧౮౦౪ శకము.

ఈ వేది నుండి జీవన గ్రంథము యొక్క మహిమను వర్ణించి యనేక దినము లయినది. సకల గ్రంథముల కంటె శ్రేష్ఠ గ్రంథము జీవనము. విశ్వాసి జీవనము, సాధకుని జీవనము, సర్వ శ్రేష్ఠము. సకల వస్తువుల కంటె నాదరణీయము స్వకీయ జీవనము. బ్రహ్మాండపతి మనుష్య జీవనమునే కనుక వేద వేదాంతముల కంటె శ్రేష్ఠముగా రచన చేసి యున్న యెడల నాత్మ జీవనమును భక్త మండలిలో వ్యక్తీకరించుట యెల్ల విశ్వాస పరులకును గర్తవ్యము. అందుచేతనే పరమేశ్వరుని యాదేశము వలన నీవ్యక్తి యొక్క జీవ చరిత్రము నుల్లేఖింపఁ బూనుచున్నాను. ఆలోకేశుఁడు గణేశుఁడు, పరేశుఁడు, మహేశుఁడు, ఎవ్వఁడో వానిని స్మరించి ఆయన శ్రీ పాద పద్మములకుఁ బలుమారు ప్రణమిల్లి యీ సుమిష్ట మధుమయ కార్యము నందు దిగుచున్నాను.

నా జీవన వేదము యొక్క ప్రథమ విషయము ప్రార్థన. ఎవరును సహాయము చేయనప్పుడు, ఏ ధర్మ సమాజము నందును సభ్యుఁడుగాఁ బ్రవేశింపనపుడు, నానా ధర్మములన్ను బరిశీలించి యేదో యొక ధర్మమును స్వీకరింపనపుడు, సాధు సాధకుల శ్రేణిలోఁ జేరనపుడు, ధర్మ జీవనము యొక్క యా ఉషఃకాలమున “ప్రార్థన చేయుము. ప్రార్థన చేయుము” అను నీ భావము, అను నీ శబ్దము అంతరంగమున నావిర్భవించెను. ధర్మమననేమో యెఱుఁగను; ధర్మ సమాజ మెక్కడనో యెవ్వరును జూప లేదు; గురు వెవ్వరో

యెవ్వరును జెప్ప లేదు. విపత్సంకటముల త్రోవలో నండగా నుండ నెవ్వారును సాహసింప రైరి. నా జీవనములో నట్టి సమయము నందు దివ్యాలోకనము యొక్క ప్రథమాభాసస్వరూపమైన, "ప్రార్థన చేయుము. ప్రార్థన కంటె వేఱు గతి లేదు" అను నీ శబ్దము వినంబడుచుండెను. ఏల ప్రార్థన చేయ వలెనో, దేని నిమిత్తము ప్రార్థన చేయ వలెనో, యదియును జక్కఁగా నెఱుఁగ నైతి; తర్కించు సమయమును అప్పటికి రాలేదు. ప్రార్థన యెందులకుఁ జేయ వలయునో జిజ్ఞాస చేయఁ దగినట్టి పురుషు లెవ్వరును గనఁ బడ లేదు. ఎవరు ప్రార్థన చేయు చున్నవారు? దీనిని గుఱించియు నెవ్వరిని నడుగ లేదు. భ్రాంతి కావచ్చునను సందేహమును గలుగ లేదు. ప్రార్థన చేసితిని. శంకు స్థాపన కాలమున మందిర సౌందర్యము నెవరు చింతింతురు? కిటికీల కేరఁగు వేయింతు నని మనుష్యుఁ డప్పు డాలోచించునా? అప్పుడు నిశ్చల భావముతోఁ గేవలము పునాదినే వేయవలెను. "ప్రార్థన చేయుము; బ్రతుకుదువు; పరివర్తన చక్ర నగును; సర్వార్థములును సమకూఱును." అను నీ వాగ్ఝరియే జీవనము యొక్క పూర్వ దిక్కు నుండి పశ్చిమ దిక్కునకును, ఉత్తర దిక్కు నుండి దక్షిణ దిక్కునకును బ్రవహించుచుండెను. ఈ భావనలో నిరంతరము మునింగి యుంటిని; ఈ కర్మములోనే మగ్నుఁడ నైతిని. ప్రార్థన గురువు; అసహాయ జనులకు నపార సహాయము. ఈ యొక్కనినే యెఱిఁగి యుంటిని; ఈ యొక్కనిలోనే పరిచయము కలిగినది; ఇంకెవరి నెఱుఁగ నైతిని. ధర్మ బంధు లెవరును లేరు.' ఆకసము వైపునకుఁ జూచు వాఁడను గాని, ఏ విధానమును గూర్చియు విను వాఁడను గాను, ఎట్టి ధర్మ తత్త్వమును గ్రహింపఁ గలవాఁడను గాను. చర్చికి* వెళ్ళనా, లేక మసీదునకు వెళ్ళనా, 'దేవాలయమునకు వెళ్ళనా,

* క్రైస్తవుల దేవాలయము.

లేక బౌద్ధుల దర్శనములఁ గలసి పోనా, యను నట్టి దేనినిగుఱించియు వాలోచించువాఁడను గాను. ప్రథమమునన్నే, వేద వేదాంతముల కంటె కొరా౯* పురాణముల కంటె, శ్రేష్ఠమైన యే ప్రార్థన కలదో దానినే యవలంబించితిని. నేను విశ్వాసిని, తర్కింతును; దానిపై నింకను విశ్వసింతును. ఒకమాఱు విశ్వసించిన యెడ, నిఁకఁ దిరుగను. చూచి యొక్క క్షణములో తత్త్వము గ్రహించితిని. కాని దానిలోఁతు అందినదా? విచారణలో నీప్రశ్న పుట్టెను. "అందినది; ఇంకను నదు." అను నీప్రత్యుత్తరము దొరకెను. ఉదయమున నొకటియు, రాత్రి మఱియొకటియు వ్రాసి ప్రార్థన సాధన చేయుట కారంభించితిని. క్రమముగా నుషఃకాలము నుండి ప్రాతఃకాలమునకుఁ జేరితిని; కష్టమునఁ బ్రొద్దెక్క నారంభించెను. నలుదిక్కులు నంధకారమున నాచ్ఛన్నమై యుండెను; ఇపుడు తెల తెల నాయెను. ఇల్లు, వాకిలి, దొడ్డి, తోవ, సమస్తము దృశ్యమయ్యెను. ఈప్రార్థనఁ జేయఁ జేయ సింగపు బలమును, దుర్జయ బలమును, మేర మీఱిన బలమును పొంద నారంభించితిని. ఇప్పు డున్న దా శరీరము కాదు. ఆ భావ మిప్పుడు లేదు. మాటలలో నెట్టి పటుత్వము! ప్రతిజ్ఞలో నెట్టి బలము! అనుటయే చాలు! ప్రతిజ్ఞ చేయుటయే చాలు! పాపమునకుఁ బిడికిలి చూపు వాఁడను; పిమ్మటఁ బ్రార్థన చేయువాఁడను. సందేహము, అవిశ్వాసము, పాపము, ప్రలోభనము—వీనిని భయంకరమగు సంకల్ప మూర్తిచే జడిపించువాఁడను. ప్రార్థన చేయుదు నన్నంత మాత్రననే అన్నియు భయపడునవి. ఈశ్వరుని పదతలమునఁ బెనఁకువతోఁ గూర్చుండి నట్లుగానే ఏదోకొంత లభించినది. కొంత కావలెను; ఇచ్చువా రెవరు? ఎక్కడకు వెళ్లవలెను? ఎవరు మార్గముఁ జూపుదురు? పాపము నెవరు దూరము చేయుదురు,-

* మహమ్మదీయుల వేదము.

అన్ని విషయములలోను సహాయము ప్రార్థన. అప్పుడు కేవలము ప్రార్థనా ధనమే నాకుండెను; కేవలము దాని మీఁదనే యాధారపడి యుండువాఁడను. సుఖము కావలెనన్నఁ బ్రార్థన యొద్దకే వెళ్ళువాఁడను. సాయము కావలసియున్నఁ బ్రార్థన యండనే చేరువాఁడను. ప్రార్థన నాకు "మాకున్న ధనమంతయు నాకొక్క నీలమణి రయే" యని లోకులు సామెతగఁ జెప్పుకొను నట్లుండెను. మీ యాప్తుఁడు కేవల మీ యొక్క పరమ సహాయమునే కలిగియుండెను. ఏ పుస్తకము చదువ వలయునో దేనిని గూర్చి యాలోచింపవలెనో, ఎవరి యొద్దకు వెళ్ళవలయునో, ఏమియు నెఱుఁగను. అట్టి యవస్థలో పడియుండని యెడలఁ, బ్రార్థన మీఁద నింత విశ్వాసము జనియించి యుండునని తలంపను. ఎవరు దాని యేమైనను అన్నియెడల నిమీలిత నేత్రుఁడనై "ప్రార్థనా! ఎక్కడ నున్నావు? విపత్కాలమందు దగ్గఱకు రా!" యనువాఁడను. భాషాబద్ధముగఁ బ్రార్థన చేయుదమన్న బాంగాళమునఁ* బాండిత్య ముండునది కాదు. అయినను భావము నాఁపుకోలేక కిటికీ యందు మీఁదఁ గూర్చుండి నేత్రములను తెఱచి యేదో ఒక్క మాట నుడువువాఁడను. అంతకే యానందము అమితము. ఒక్క నిమిషములో మహామూల్యరత్న లాభము. రత్నము దొరకుటచే నెవరి కీయను? ఎవరి వద్దకు వెళ్ళి చెప్పను? అప్పుడు ఈప్రకారముగనే కాలము గడచెను. ఇందుచేతనే ప్రార్థన నింతగాఁ బ్రేమింతును. మీ కెట్టి బంధువులో ప్రార్థన నాకంతకంటె నధిక బంధువు. అదృశ్యుఁడైనప్పటికిని నే నాయనను నాబంధువుగనే యెంతును. ప్రార్థన తక్క మఱి యెవరును లేనట్టి సమయమును నాకుండెను; అందుచేతనే నేను మీ యందఱకంటెఁ బ్రార్థనకే యెక్కువ

* వంగభాష.

ఋణబద్ధుఁడ ననుకొనరాదు. ప్రార్థన చేయఁగనే యుత్తరమును విన నగునని నేనెఱుఁగుదును. ఈశ్వరాదేశ మత మీవిధముగఁ బ్రథమము నుండియు హృదయమున నిహితమై యున్నది. ఏధర్మ మవలంబింప వలెనో, ఉద్యోగమును వదలుకో వలయునో, వదలుకో రాదో, ధర్మ ప్రచారకుఁడను కావలయునో, కారాదో, ప్రార్థనయే సూచించునది. భార్యతో నెట్టి సంపర్క ముండవలయునో, ప్రార్థనయే నిర్ధారణ చేయునది. ధనముతో నెట్టి సంబంధమో, ప్రార్థనయే నిరూపించునది. ఆదేశ విషయము నప్పుడు విశేషముగఁ దలంచు వాఁడను కాను. ప్రార్థన చేసినఁ బ్రత్యుత్తరము వచ్చుననియుఁ, జూడఁ దలఁచినఁ జూడ నగు ననియు, వినఁ దలఁచిన విన నగు ననియు మాత్ర మెఱుఁగుదును. ప్రార్థన చేయఁ జేయఁ బది సంవత్సరములు పాఠశాలలో న్యాయశాస్త్రము, విజ్ఞానశాస్త్రము, మొదలైన కఠినములగు శాస్త్రములను సమస్తము నధ్యయనము చేసినట్లు బుద్ధి వికసించెను. "నీకుఁ బుస్తకము లక్కఱలేదు; మఱి యేమియు నక్కఱలేదు; నీవు కేవలము ప్రార్థనయే చేయుమోయి!" అని నాతో నీశ్వరుఁ డనువాఁడు. ప్రార్థన చేసి యాదేశము కొఱకుఁ బ్రతీక్షించువాఁడను. "ఏది? ఉద్యోగము వదల వలయునో లేదో యింకను జెప్పలేదే? అదెట్లు సమకూడునో సూచింపలేదే?" అని మఱేమియు లేక యీప్రకారమే చేయుచుండువాఁడను. కాలక్రమమున బ్రాహ్మసమాజమునఁ జేరితిని, సాధకుఁడ నైతిని, ప్రచారకుఁడ నైతిని, ఉపదేశించుట కారంభించితిని, అన్నియు నయినవి. జీవన మిప్పు డున్నట్లుగా నున్నది ప్రార్థనమును పాటించుట చేతనే. మిత్రుల యవస్థ మందముగా నున్నట్లు నాకుఁ గన్పట్టుచున్నది కూడఁ బ్రార్థనమును మన్నించుటను బట్టియే. ప్రార్థన విషయమైన మోసమును మన మండలి నుండి పాఱఁదోల

వలయును. ప్రార్థన చేసి, ఎవఁడు ఆ దేశము కొఱకు నిరీక్షింపఁడో, అతఁడు వంచకుఁడు. అంతర్బాహ్యము లెవనికి సమానావస్థలో లేవో, ఎవఁడు బహుభాషియో, ఎవఁడు తన మనస్సును ప్రార్థన సమయము నుందుంపవలసిన రీతి నుంపఁడో, అతఁడు వంచకుఁడు. ప్రార్థనావస్థ మహా కఠినావస్థ. ఎవఁడు బహు భాషాప్రవాహములోఁ బడి పోవునో అతఁడు వంచకుఁడు. ఉదయమునఁ బ్రార్థించిన విషయమును సాయంసమయమునకు జ్ఞాపక ముంచుకో లేనివాఁడు, భానువారమునఁ బ్రార్థించినది మంగళవారమున నెవరైన నడిగిన రెండలఁ జెప్పలేని వాఁడు వంచకుఁడు. మానధనముల కొఱకు, సంసారము కొఱకు, లేక పదునాల్గు వీసములు ధర్మమును, రెండు వీసములు సంసారము కొఱకు, అథవా పదునేను వీసములు ఐహిక పారత్రిక సద్గతి కొఱకును, అఱవీసము సంసారము కొఱకు, ఎవఁడభిలషించునో ప్రార్థన విషయమున నతఁడు వంచకుఁడు. ఒక్క దమ్మిడీ యైన సంసారమునకుఁ గాను ఎవఁడుఁ గోరునో వాని సమస్త ప్రార్థనయు విఫలమని యనుభవమార్గమునఁ దెలిసి కొంటిని. కావున ప్రార్థన నతి విమలముగా నుంపుము. అట్లయిన, చివరకు ఇహ లోకమునకుఁ బరలోకమునకు సమస్త పృథివికి నధికారి వగుదువు. ఒకటి, రెండు, మూఁడు, నాలుగు అని చక్కఁగ లెక్కపెట్టి, గుణించి, మొత్తమెంతైనదో తప్పి పోకుండునట్లుగఁ జెప్పనైనరీతిని ప్రార్థనాసత్యములను అట్లే తెలుపనగును. ఇది దాఁకుండినది గాదు, ఇదిగో! ఇప్పుడు లభ్యమైనది; నే నిదివఱ కెక్కడ నుండు వాఁడను గాను, ఇదిగో! ఇప్పుడు వచ్చి చేరితిని. ఈహేతువుఁ బట్టియే ఎవ్వరి యింట వ్యాధి మూలమునఁ గాని, విపత్తు చేతఁ గాని లేమిడి వలనఁ గాని కష్టము కలుగుచున్నదో, వారి కదే ప్రార్థన చేయ మిక్కిలి మంచి సమయమని పలుమాఱు

బంధుజనులకుఁ దెలుపుచుందును. విపత్సమయమునఁ బ్రార్థన మహా గభీరముగ నగును. ఎవ్వఁడైనను ఏయాపద యందైన నున్నపుడు, నవ్వుచు నవ్వుచుఁ బోయి యీశ్వరుని సమీపించి, "నాకీ దుఃఖ మేల? ఈయవస్థలో నాకు వైరాగ్యమును గఱపుము" అని మనస్సు విప్పి చెప్పిన వక్షమున వానికి వెంటనే యిహ పర సుఖములు చేకుఱును. పారత్రిక మంగళమునే కాక్షింపుము. నీవు కాంక్షించునది యదొకటియే నైనను దాని మూలముననే యన్నియు సమకూరఁ గలవు. గృహములయందు వివాదములు గాని, మతవిషయికమైన కలహములు గాని పొడమి నప్పుడు ఈశ్వర సంతాన సముదయము కేవలము ప్రార్థనయే చేయవలయును. ప్రార్థన చేయుము శాంతి వెంటనే స్థాపితమగును. ఇందులకే మిత్రుల కెప్పుడును ప్రార్థన చేయుఁడని చెప్పుదును. వారు చేయరు; అందుచేతనే యంత కష్టముల పాలగుచున్నారు. ఈజీవనము యొక్క ప్రాథమి కాంశము వర్ణించితిని: ప్రార్థన యెట్టి వస్తువో గుర్తెఱిఁగి దాని నాచరించితిని. దార పుత్త్రుల కంటె నదియే ప్రియమైనదని, యదియే యుత్కృష్ట ధర్మగ్రంథమని, సకల ధార్మిక విషయముల లోను, సర్వ సాంసారిక సంబంధములలోను, అయ్యదియే సార వస్తువని గ్రహించి యీ ప్రార్థన నందఱును గారవింతురు గాక.



# ద్వితీయాధ్యాయము.

## పాపబోధము.

భానువారము ౧౪ శ్రావణము-౧౮౦౪ శకము.



అనంతర కథ యేమని భక్తమండలి జిజ్ఞాస చేసెను. ప్రథమమునఁ బ్రార్థన; జీవన గ్రంథము యొక్క ద్వితీయాంశ మేమి? భక్త బృందమా! వినుము. ద్వితీయ విషయమును గురుతర విషయమే. ఈ విషయమునఁ గూడ నాకును నితరులకును విశేషానైక్య మున్నట్లు చూడ నగును. పాప బోధము నా యందు మహా ప్రబలము; పలు జీవనము లందింత ప్రబలము కాదు. పాపమున నేమి? ఏమి చేసినఁ బాప మగును? ఇదంతయు విచారింపఁగా నాకుఁ బాప బోధము కలుగ లేదు. పాప దర్శనము వలనఁ బాప బోధ మైనది. అప్ప పాటు కాలములోఁ బాపమును సహజముగఁ జూచితిని. పూర్వోక్తావస్థలో నెవరును గురువై వచ్చి పాప బోధమును కలిగించి యుండలేదు; నాపాపము యొక్క ప్రబలతమ సాక్షిని నేనే యైతిని. "పాపోహమ్, పాపోహ" మ్మని మనస్సెప్పుడును ఇట్లే పలుకునది. ప్రాతఃకాలమున నిద్ర నుండి మేల్కొని, హృదయ మేమాట నైనఁ జెప్పుచుండిన యెడల నది యింకేమియుఁ గాదు. "పాపోహ" మ్మనునది యొక్కటే. ప్రాతఃకాలమునఁ, బూర్వాహ్ణమున, నపరాహ్ణమున, అష్టప్రహరములును, ఎంత వఱకు జాగ్రదవస్థలో నున్న నంతసేపును,— పాప బోధమే. చోరత్వమునకు, బందిపోటుతనమునకు, పరద్రవ్య హరణమునకు సామాన్యముగా నిఘంటువులందుఁ బాపమనఁబడును. ఎవ్వాఁడు మీసమక్షమున నిప్పుడు మాటలాడుచున్నవాఁడో, అట్టి యాతని నిఘంటువులోఁ బాపమనఁగా గ్లాని; పాపమనఁగా వ్యాధి; పాప

మనఁగా నస్వాస్థావస్థ; పాపమనఁగా దౌర్బల్యము; పాపమనఁగాఁ బాపము చేయునట్టి శీలము. నేను కేవలము పాపమునే పాపమని యెంచి నిశ్చింతతో నుండలేదు; పాపశీలము నెక్కువ భయముతోఁ జూచితిని. ఈ శబ్దార్థమును నేను స్వయముగాఁ జేయలేదు; వివేకము యొక్క దీప్తి హృదయమునఁ బడినపుడు చిన్న చిన్న వస్తువులు వేనవేలున్నవని కనిపెట్టితిని. స్థూల సూక్ష్మములైన వస్తువు లనేకము లున్నవి. జడత్వము, దౌర్బల్యము, ఆసక్తి, ఎన్నెన్ని హృదయములో నున్నవి? ఆత్మ యొక్క మధ్యస్థానము నందవన్నియు నెంత ప్రచ్ఛన్నముగా నున్న వన్న, వివేకము యొక్క దీప్తి జ్వలించి యుండని యెడల నేదియు నగపడనిదే. ఒకొక్క దినము సుందరము నందలి గ్యాసు దీప మేవిధమున గప్పు గప్పుమని మండునో వివేకము యొక్క దీప్తి ఆవిధముగనే హృదయములో మండెను. చూచితిని; అంతయుఁ బాపమే! శరీర మున్నపుడు, కామ క్రోధముల మూలము నున్నది. ఇట్లనుట చేతఁ బాపమే మనుష్యుని భావిజన్మమును నిర్ధారణ చేయునను మతమును మాత్రము నమ్మించు వాఁడను గాను. పాపము చేయునట్టి శీలముతో జన్మ కలుగునని మాత్రము నమ్మింతును. శారీరక ప్రవృత్తు లెప్పుడున్నవో, అపుడు పాపము యొక్క మూలమును అచటనే యున్నది. నేను పాపము చేయఁగలను; ఏమి చేయఁగలను? మిథ్యావచనము పలుకఁగలను; దొంగతనము చేయఁగలను. దొంగతనము చేయఁగలనా? అదెట్లు? ఎవరి యైశ్వర్యము నైనఁ జూచి హరింపఁ గోరిన యెడల, "అది నాదగును గాక! అతనికి లేకుండును గాక!" అను నీ భావ మొక్క నిమేష మైనను గలిగిన యెడల, నప్పుడే దొంగతన మైనది. మిథ్యావచనమును జెప్పఁగలుగు నదెట్లు? ఎన్నఁడైనఁ బ్రాణ సంకటమునఁ బడినపుడు, అసలు సంగతి సరిగా నెఱుఁగకున్నను మిథ్యావచనము జెప్పినను

జెప్పవచ్చును. కేవల మిథ్యను జెప్పక పోయినను, శ్రోత యొక్క మనస్సున మిథ్యా భావమును బుట్టించు నట్టి యస్పష్టపు మిథ్యను దేనినైనను జెప్పినఁ జెప్పవచ్చును. మిథ్యను పలుకఁ గలుగున దెట్లు? మాటలలోఁ గాదు, మనసులో. ఇంతకును నేను జోరుఁడనా? హస్తమునఁ గాదు, హృదయమున. ఏ నిక్లేస్థితియం దున్నానో యంతకంటె నధికుఁడ ననుకొనిన యెడల నప్పుడే యహంకార పాపమైనది. " చదువను, వ్రాయను నీకుఁ దెలిసినది తక్కువ. నాకుఁ దెలిసినది యెక్కువ! " అను నిట్టి తలంపు పుట్టిననే పాపము మనసులో నన్నధికముగాఁ బ్రేమించుకొన్న యెడను, నన్యులను బ్రేమించుట తక్కువై, ఆత్మ సుఖము మీఁద దృష్టి యధికముగాఁ బడినయెడను, స్వార్థపరత్వ పాపములో నప్పుడే పాపుఁడ నైతిని. లోపల నరక కీటములు నిక్కముగా జలజలలాడుచున్న వేమో యన్నట్లు పెద్ద పెద్ద దీర్ఘాతి దీర్ఘములైన పాపాకృతులను గంటిని; ప్రత్యహము నాక నూఱు పాపములకుఁ దక్కువ చేయుచుండనని యిప్పుడు తెలిసి కొంటిని. ఈజీవనములో నెంత పాపము చేసితినో గణించితి నేని, ఈ నలుఁబది నాలుగు వత్సరములలోఁ బది లక్షల పాపములు చేసితి నన్నను నత్యుక్తి గాదు. మనస్సునఁ బాప బోధ మెంత యధికమున్న చిన్ని చిన్ని పాపములను నహింత మది ధప్పుమని పట్టివేయుచుండును. ఆపాపబోధము కష్టమును గలిగించుచున్నది. పరుల పాపములను గణించు నిమిత్త మెవరో నామనసును నియోగించి నట్లున్నది. ఉదయము నుండి యపరాహ్ణము వఱకును గేవలము పాపమునే గణించుచున్నాను. ఇదిగో! స్వార్థపరత్వమునఁ బడితిని. దాని తరువాత నిదిగో! అభిమానము కలిగినది; దాని తరువాతఁ బరద్రవ్యము మీఁద నాసక్తి పుట్టినది; దాని తరువాత మిథ్యను వచింప నిచ్ఛ గలిగినది; దాని తరువాత డబ్బు మీఁదను బిచ్చ

పుట్టినది; దాని తరువాత మఱి నలుగురికి సౌఖ్యము కలిగించు ప్రయత్నము కన్న నాత్మ సుఖమ్ము కొఱకైన యత్నమె యెక్కువైనది. ఈలాగున గణింప గణింప సంధ్యయైనది; రాత్రియైనది; ఇంక నంతము కాలేదు; ఈ పాపగణనము బుద్ధిగతము కాదు, హృదయ గణనము. దీనిచే హృదయ జ్వాల పుట్టును. "ఇంత యహంకారము కూడదు; ఇంత స్వార్థ పరత్వ మన్యాయము," అని బుద్ధి బోధించు నది యనుకొందువేమో! అది కాదు. హేతువాదుల మాటలు నావద్ద దుర్బలములు. ప్రకృత విషయమేమి? పాపబోధ మైనట్లుగానే కష్టము, జ్వాల. ఏవిధమున సాలెపురుగు యొక్క విస్తీర్ణమైన జాలమున నీఁగ యేవైపునఁ బడినను సాలెపురుగు దానిని కనిపెట్టి యుఱికి పట్టునో, ఆవిధముననే ఆత్మికస్నాయువను పదార్థమే యున్నయెడ దాని జాలమునఁ బాపము పడినంతనే మనస్సు కనిపెట్టి పట్టుకొనఁ గలదు. జీవనములో నెక్కడ నే యాందోళనము జరుగుచున్నదో, ఎక్కడ నే కర్తవ్యము చేయఁబడ లేదో, యొనర్ప నుచితమై యుండిన దేది యింకను నకృతమై యున్నదో, ఎక్కడ ధర్మము తృణీకరింపఁ బడినదో, జీవనము యొక్క యే స్థానమందు దుర్బలత్వమో, చైతన్య శీలమైన మనస్సు చప్పున చూడఁగలదు; చూచినట్లుగనే, "ఆహా! అంధకారములో నివన్నియు నున్నవి! అట్లయిన బందిపోటు దొంగను గూడఁ గావచ్చునే! పది వేల రూప్యములను జూచినతోనే లోభమా? పరద్రవ్యమున నింత లాలసయా?" అనుకొనును. ఈపాపము నింకను ఎంత దూరము విస్తరింపఁ జేయఁ గలను. గంగ వలె;— సముద్రము వలె;— మహా సముద్రము వలె;— పెక్కు లేల? నేను చేయలేని పాపము లేదు. అసాధు శీలము పోని యెడలఁ బాప ముండనే యున్నది. ఇదిగో! నేను శీఘ్రముగఁ బరుని సాధువని యెంచ లేనే. ఇందు చేతనే నేటి వఱకును

నన్నెవ్వరు పాపివని లజ్జితునిఁ జేయ లేక పోయిరి; ఇఁక ముందైనఁ జేయఁ గలుగుదు రనుటయు నల్పమే. అంతరంగమున నెవఁడు పది వేల పాపములను స్వయముగా గణించెనో, ఎవఁడు పేరుపెట్టి యానకల పాపములను జెప్పఁ గలఁడో వాని నెట్లు లజ్జితునిఁ జేయ నగును? ఎవఁడు బందిపోటు దొంగతనము చేసి వచ్చెనో వానిని ఒక పైస దొంగిలించి నట్లు నిందించిన నేమగును? బందిపోటు దొంగకు నొక పైస దొంగిలించిన దోష మిడిన పక్షమున వాఁడు, "ఎంత సామాన్యపుఁ బాపము మాట చెప్పినాఁడోసి!" అనును. ఎవని పాపబోధము జీవనము నందంతట నోతప్రోత భావమునఁ బాపమును దర్శించు చున్నదో యట్టి వానినిఁ బాపి వనుట కఠోరము గాని, తీక్ష్ణ దుర్వాక్యము గాని కాదు. నన్నుఁ బాపి వందువేని యది శిక్షఁ కొఱకుఁ గావచ్చును. నా వివేకము కడు వాఁడి. దీని యొక్క కోఁతశక్తి భయానకము. తీక్ష్ణముగాఁ బాపమును గ్రహింపఁ గలదు. గ్రహించి నంతనే కోయ నుద్యమించును. ఇదిగో! ఒక పాప మైనది. వెంటనే వివేకము దానినిఁ బట్టుకొనినది. ఎవరి మీఁద నైన దయఁ జూపఁ బోయి యొక్కింత న్యాయ విధి నతిక్రమించితి నేని అహోరాత్రము లిఁక నాకు శాంతి లేదు. న్యాయపరత్వము పదునాఱు పాళ్లును మేలుకొని కూర్చుండి యున్నది. భృత్యునకు జీతమిచ్చుట యొక్క దినము విలంబ మయ్యె నేని, "అరే! పాపీ! అన్యాయ వ్యవహారమా?" అని వివేకము వెంటనే అనును. "ఈదినము ఇయ్య లేనైతి; రేపిత్తును" అని యంటినేని, "నీ వీదినమున దింటి వేవిధమున? నీవు ధనికుఁడవై కడుపార భుజించు చున్నావు; దరిద్ర భృత్యునకు వేతన మియ్య వైతివిగా? ఎంత యన్యాయము!" అని వివేకమనును. కలకత్తా వదలి బేల్లూరియా * నెళ్లినను, స్థలము

* కలకత్తాయొక్క శివారు.

వదలి నౌక మీఁదఁ దిరిగినను—ఏమి చేసినను వివేకము వదలదు. ప్రత్యుత్తరము చెప్పవలెను. ప్రత్యుత్తరము చెప్పలేకున్నాను. చిన్న విచారణాలయము హృదయ మధ్యమునఁ దెఱవఁబడియే యున్నది. పాప మూలమున నేను గురు భారాక్రాంతుఁడను. "నీవింత పాపమును జేయుదువా! నవవిధాన వాదివయ్యు హృదయమున నింత పాపమా?" అని మీ రనవచ్చును. చూడుఁడు! మఱి మీరిట్టి మనుజుని గౌరవింతురు! ఇదంతయు మీరు చూడలేదు. మీరెఱుఁగరు. ఇదిగో! జ్వాలయు కష్టమును; ఈశ్వరుఁడు ధన్యుఁడగుఁగాక! పృథివి మీఁద నిట్టి సుఖియుఁ గడు నరుదే. నా నరక కీటములా జలజలమనుచున్నవి; నాలుకలోఁ బాపము; కర్ణములోఁ బాపము; కంటియందుఁ బాపము; కాని దీనివల్ల నగుచున్న దేమి? అగుచున్నది ఉపకారము. పాపబోధమే లేకుండిన యెడ నిక్కడ నుండువాఁడను గాను. ఇచటికి రాఁగలిగి యుండను. నా జాగ్రన్నరకము జాగ్రత్స్వర్గమునకుఁ గారణము. అస్వస్థ శరీరములో నేభాగమున నేరోగమో, ఎక్కడ వేదనయో, ఏమి బాధయో సులభముగాఁ దెలియదు. సహజముగా వ్యాధిని గనుఁగొన వీలులేదు; కాని స్వస్థశరీరములో నెక్కడ నేమాత్రము చెదరినను వెంటనే తెలియ నగును. ఇది మంగళ చిహ్నమే. ఏలయన;— దీని నేను వెంటనే ప్రార్థనచేయుటకును, యోగములో దిగుటకును కోరిక కలుగును. కేవలము పదిమార్లు పాపము చేయు స్వభావమే యుండియున్నఁ, బది పాప కారణములే యుండియున్న వాని నతిక్రమించిన తోడనే జగత్తులో నావంటి సాధువు లేఁడనుకొనువాఁడను. సాధువు నైతి ననుకొంటిని. అదియే నిజమైన పక్షమున నాజీవనము సమాప్తిం జెందునదియే; కాని ప్రతి మాసమును, ప్రతి దినమును వివేకము ఆత్మోన్నతి యొక్క నూతన పథమును బ్రదర్శించును. కేవలము పాప బోధమును బుట్టించును.

శరీరము యొక్క జ్వాలచే నే మనుజుఁడైనను గోల్డీఘి * నుండి లాల్డీఘి * కిని, లాల్డీఘి నుండి గోల్డీఘికినిఁ గేవలము పరుగిడిన యెడ వానియవస్థ యెట్లుండునో ఈ వీని యవస్థయు నట్లే యున్నది. అనుదినమును జ్వాలచే నిట్లు కొట్టుకొన వలసి వచ్చుచున్నది. ఒక వైపునఁ బాపము; అందు మీఁద మఱల నవిశ్వాసము. "భగవంతుఁ డిక్కడ నున్నాఁడా? జీసను సజీవుఁడై యున్నాఁడా? చైతన్యునిఁ జూడ నగునా?" ఈలాగున ననుకొనిన తోడనే, "ఆరే! అపరాధీ! చైతన్యునిఁ జూడలేవు? గౌరాంగుఁడై యెవఁడు నాట్యము చేయుచున్నాఁడో, ఆయనను జూడలేవా? జీసను లేఁడుగా?" అని యెవరో యందురు. ఆ మాత్రము చేతనే యీ ద్రోహికి దుఃఖము! ఈశ్వరుఁడు వదలలేదు. ఈ పట్టణము నుండి యా పట్టణమునకు, ఆ పట్టణము నుండి యీ పట్టణమును—ఇట్లు చూచుచుండఁగనే, శాంతిపురినిఁ బ్రవేశించి, శాంతాగారమున నానందము నొందితిఁ. జ్వాల శాంతించిన దంటిని. రోగి కాని యెడల స్వస్థత యొక్క సుఖము నెవరైన గ్రహింపఁ గలరా? దారిద్ర్యము ననుభవింపని యెడల సంపద యొక్క సౌఖ్య మెట్టిదో యెఱుఁగ నగునా? జ్వాల నివృత్తమైన నెట్టి సుఖమో దానినిఁ గంటిని. గడియారము యొక్క ముండ్లేవిధముగ "టక్కు, టక్కు" మని కొట్టు కొనునో, అట్లే "నీకు సాధన ఏ మాత్రమును గాలేదు; ఏమాత్రమును గాలేదు; లేశ మాత్రమును గాలేదు." అని మాటిమాటికి నెవరో యనుచుందురు. గుఱ్ఱమును కొరడాతోఁ గొట్టినట్లే నన్నును నీ యంతరంగ వాక్కులు కొరడాతోఁ గొట్టుచుండును. కాని యాశ్చర్యమిది! నేను ఏడ్తును!

* ఈ రెండును కలకత్తా యందలి విహారస్థానములు. వీని మధ్య చిన్న జలాశయ మొక్కొకటి యుండును.

తిరిగి నవ్వుదును! ఎంత యేడ్తునో యంత నవ్వుదును. కడు నేడ్తును. కడు నవ్వుదును. ఔషధమును బుచ్చుకొనుటచే శరీరము స్వస్థతఁ జెందెనేని దాని నెవరు సేవింపరు? ఇందుచేతనే నే నెపుడును బంధుజను లందఱితోను "ఏమోయి! నీవు పాపివి. నీవు అలసుఁడవు. నీవు అపరాధివి" అనియే చెప్పుచుందును. కాని యీ నామాట యొక్కములు చదివినట్లున్నది. ఎవరును వినరు. మీరు పాపులని మీ రెఱుఁగరా? నేనందును భయానక పాపమని; మీరందురు పాపమని. నేనందును మహా పాపమని; మీరందురు దోషమని. నేనందును దోషమని; మీరందురు కూడని పనియని. పాప జనిత జ్వాల లేదని నేను ముఖముఁ జూచి తెలిసికొనుచున్నాను. ఎవనిలో జ్వాల యున్నదో వాఁడుపేక్షగా నుండలేఁడు. అతఁడు నిర్యత్నుఁడై యెట్లులుండఁగలుగును? "పాపినై యుంటిని; ఇపుడు పాపిని గాను, సాధువు నైతిని." అని మీ రనుకొనుచున్నారు. నవవిధానము వైపు మీకు దృష్టిలేదు. క్రీస్తు వాదుల యర్థమున, బుద్ధ వాదుల యర్థమున, ఇంక ననేకుల యథార్థమునఁ బరిత్రాణమన్న నేమియో మీ యథార్థమునను నంతె యగుచున్నది. హరి పాదసన్నిధిని నాకింకను ముక్తి లాభము కలుగనేలేదు. బ్రాహ్మ సమాజములో మహాపాపి, ఈ పాతకి, ఈ వేదిస్థితవ్యక్తి. అలంకారము కాదు; పద్యము కాదు; యథార్థము. నా యొక్క మనస్సే యిందులకు సాక్ష్యమిచ్చుచున్నది. పృథివి మీఁద నిట్టి యపరాధుల సంఖ్య యత్యల్పము. నాలో నంతయుఁ బాపమే. అన్యుల కేది యొక్క పాపమో నా కది నైదు పాపములు. ఇతరుల యర్థమున నేది పాపమే కాదో, అది నా యర్థమునఁ బాపము. ఇతరుల నేవిధముగ విచారణ చేయుదురో యావిధముగా నన్ను విచారణ చేయుటకు వీలు లేదు. ఇందుచేతనే విశ్వన్యాయాధికారి యొక్క మాట జ్ఞప్తికి వచ్చినతోడనే సర్వ

శరీరము కంపింప నారంభించును. మాటలు ఏమాత్రము మృదువుగా నుండక పోయినను, వెంటనే న్యాయాధికారి మదీయ హృదయాంతరాళమున "నీ మాట లేల మృదువుగా లేవు ! అందఱితోను నమ్రత వాక్కుల నేల పలుకవు ?" అనును. ఏమాటనైనను గొంచెము మృదువు తప్పి పలికితినేని వెంటనే తాపము కలుగ నారంభించును. రాత్రియంతయుఁ దాపమే. నాలుగైదు దినముల వఱకుఁ, బది దినముల వఱకుఁ గూడఁ దాపమే. కేవలము సత్యవాదినైనఁ జాలదు; అమృత భాషివి కూడఁ గావలయునని యాత్మ శాసించును. కొంచె మెవరినైన నసంతోష దృష్టితోఁ జూచి యుంటినేని వెంటనే పరితాపము కలుగ నారంభించును. కొంచెము కన్నెత్తి చూచితినని కూడ దోషమే ? నవవిధాన వాది పక్షమున నిది మహాదోషము. దోషమును ఖండింపుఁడని నవవిధానములోని యున్నత పదధారుల కందఱకుఁ జెప్పుదును. వ్యభిచారము దోషమని మీరందురు; కాని, ఎవరైన స్త్రీజాతివిషయమునఁ గొంచె మాసక్తిఁ జూపినఁ, గొంచె మెక్కువ సేపు స్త్రీల సమక్షమున నుండఁ గోరిన, ఏమి ఘోరమని నేనందును. చోరత్వము పాపమని నీవందువు; ఇది మోటా నాటి మాటయని నేనందును. నీవు డబ్బు గిబ్బు విషయమై అధికముగ మననము చేసి యింకను ధనార్జనము చేయుచున్నావుగా ? ఎట్టి ఘోరము ! నీ వింకను నుద్యోగము చేయుచున్నావా ? నీ విట్టి పామర విషయములను గుఱించి భావించుచున్నావా ? ధ్యానము చేయునట్టి యా యైదు నిముసములలోఁ గూడ రెండు నిమిషములను దొంగిలించి నీవు పిల్లల నెట్లు పోషింతునా యని భావించుచున్నావా ? డబ్బు ఎక్కడ నుండి వచ్చునని వ్యాకులపడుచున్నావా ? మఱునటి దినము కొఱకుఁ జింతించుచున్నావా ? పాప జ్ఞానము మనలో బాగుగ వర్ధిల్లుఁ గాక ! పాపము కంటె బుణ్య ముత్కృష్ట

వస్తువని మీ రెఱిఁగినదియే. పాపజ్ఞాన ముదయించినఁ గలుగు దుఃఖము, తాపము, జ్వాలయు మనకు సంప్రాప్త మగుఁ గాక! మన తల్లి యతి దయావంతురాలగుట చేతనే కష్టము తరువాత సుఖము నుంచినది. చేతిలో కొయినా (క్వినైన్) యున్నపుడు, ఔషధమున్నపుడు జ్వరము వచ్చిన రానిమ్ము! పాపజ్ఞానము తాపమును గలిగించనేని యది సుఖమునకుఁ గారణమగును. యోగీశ్వరు నెపుడెఱుఁగుదుమో, యోగానంద మెపుడాస్వాదనము చేసితిమో, అపుడు కష్టమేమున్నది? సుఖము రానున్నపుడు దుఃఖ మన్న భయమేమి? ఇందుచేతనే హరి గొప్పయో, యముఁడు గొప్పయో నే నిపుడు జిజ్ఞాస చేయుట లేదు. హస్తమున లక్షపాపములు నున్నవి; కోటి యౌషధములు. నున్నవి. లక్ష లక్ష సైతానులను ఇప్పుడే నాశనము చేయుదును. ఎవఁడు విశ్వమాతకుఁ బ్రాణమును సమర్పించెనో వానికిఁ బాపమన్న భయమేమి? సైతానునకు బలమెక్కడిది! బంధుజనులారా! అంధకారమును గుఱించి చెప్పినట్లే యాలోకనమును గుఱించి కూడఁ జెప్పితిని. పాపము చేసినపుడెల్ల మీ ప్రాణము తట తట కొట్టుకొనుఁగాక! తటతట కొట్టుకొన్నట్లుగానే శాంతిదేవి మిమ్ములను సమీపించి మీకు శాంతిని ప్రసాదించును!



# తృతీయాధ్యాయము.

---

## అగ్నిమంత్రదీక్ష.

భానువారము ౨౨ శ్రావణము-౧౮౦౪ శకము.

జీవన భాగవతము యొక్క తృతీయ పరిచ్ఛేదము, అగ్నిమంత్రదీక్ష. "హే! ఆత్మా! ధర్మజీవనము యొక్క బాల్యకాలము నందు నీ వేమంత్రమున దీక్షితుఁడ వైతివి?" అని జిజ్ఞాస చేయుదునేని "అగ్నిమంత్రమున" అని యాత్మ యుత్తర మిచ్చును. బాల్యకాలము నుండియు నేను అగ్నిమంత్రము యొక్క ఉపాసకుఁడను; అగ్నిమంత్రముయొక్క పక్షపాతిని. అగ్నిలో మనికియే, పరిత్రాణోపాయ మని నా యనుభవము. అగ్ని మంత్రమనే నేమి? శీతలత్వ మన నేమియో తెలిసికొనఁ దలఁచిన ఉత్తాప మన నేమియో తెలిసికొనవలయును. సత్య మంత్రమన నేమియో యెఱుఁగ దలఁచిన నగ్ని మంత్ర మననేమియో యెఱుఁగ వలయును. నే నెఱుఁగుదును; కొందఱ జీవనములో శీతలత్వ ముండును, అగ్ని యుండదు; మఱి కొందఱి జీవనములో నగ్ని యుండును, శీతలత్వ ముండదు. అనేకులది శీతల స్వభావము; మనస్సులోఁ గేవలము శాంతి. వారు కార్య విహీనులు; వారి పనులు శైత్య మయములు. గతి మృదువు; మాటలు అగ్ని విహీనము; హృదయమునఁ దేజము అల్పము; చక్షువులు కోమలములు — ఈ లక్షణము లన్నియు నుండిన శైత్య ప్రధాన జీవనమని నిర్ధారణ చేయుదును. శీతలత్వమునే వ్రతముగఁ జేసికొని సాధన చేయువారు ఈ పృథివి మీఁద ననేకు లున్నారు. వారు నడతురు శీతల భావమున; కార్యములను చేయుదురు శీతలభావమున; సాధన ముగింప వలసి వచ్చిన

ముగించుదురు శీతల భావమున. వారు శీతల ప్రదేశమునే అన్వేషింతురు; శీతల ప్రదేశముననే, నాసము చేయుదురు. వారు శీతల యోగమును సాధనఁ జేయఁ జూతురు; శీతల ముక్తిని పొంద నభిలషింతురు. స్వర్గమున కేగి యక్కడఁ గూడ శీతల స్థానమున శీతల భావమున నుండుట కాశపడుదురు. పృథివి మీఁద వారి ముందు అగ్నిని జలమును ఉంచిన యెడల, వారు అగ్నిని వదలి జలమునఁ బ్రవేశింతురు. స్వర్గీయాగ్నిని, జలమును వారికిఁ జూపిన యెడ, ఆశతోను, ఉత్సాహములోను, వారు జలము వైపునకే దృష్టి నిడుదురు. ఎప్పు డాజలము దొరకునా యని యెదురు చూచుచుందురు. శీతలత్వమే ప్రధాన భావమైనయెడ, అది మానవుని స్వభావమును తేజోహీనముఁ జేయును. స్వభావ బంధనములను శిథిలముఁజేయును. ఉన్న తేజము నిస్తేజ మగును; శక్తి హీన మగును; వీర్యోద్యమములు అవసన్నతఁ జెందును. జలము వచ్చి సమస్తాగ్నిని జల్లార్చును; పిఱికితనము వచ్చి సాహసమును మ్రింగివేయును; సహిష్ణుతయు, స్థిరత్వమును వచ్చి, ఉద్యమ మని ఉత్సాహ మని ఏ నాల్గు ఉత్తేజన భావము లున్నవో వాని నన్నిఁటిని గ్రమక్రమమున నిర్వాసితముఁ జేయును. ఎవరు శీతలత్వము వినా మఱి దేనిని గోరరో వారు ధార్మిక క్రియలను బరిత్యజించి శయ్యాశయనులు కాఁ జూతురు. శైత్య ప్రధాన జీవనము నిష్క్రియోపాసన యొక్కయు, విశ్రామము యొక్కయుఁ బక్షపాతియై క్రమక్రమముగ నవసాన దశ నొంద సాగును. దుఃఖ మేదిక్కుననో ఆ దిక్కునకు వారు వెళ్ళరు; ఏకడ శాంతియో, నిర్భయమో అక్కడికి వెళ్ళి దాఁగి యుందురు. ఈ సముదయము యొక్క విరుద్ధ భావ మంతయు నగ్ని. ఈ విరుద్ధ భావ మంతయు నగ్ని ప్రధాన జీవనములోఁ జూడనగును. ఈ వ్యక్తి యొక్క

జీవనములో మొదటి నుండి యింత వఱకును. ఈ యుత్సాహాగ్ని క్రమాగతముగ జ్వలించుచున్నది. ఇది తాత్కాలిక వీరత్వ భావము కాదు. మధ్య మధ్యఁ బొడసూపు నదియును గాదు. ఉత్తాప మన జీవన మనియును, ఉత్తాపమునకు వ్యతిరేకము మృత్యువనియు, ధర్మము యొక్క నిఘంటువు నందు వ్రాయఁబడి యున్నది. శరీరము సంపూర్ణముగా శీతల మయ్యెనేని చికిత్సకులు మృత్యు వని సిద్ధాంతము చేయుదురు. ఏ మాత్రమైన నుష్ణముగాని, ఉత్తాపము గాని లేనట్లు చూచిరేని ప్రాణాగ్ని చల్లాఱిన దందురు. ధర్మ జీవనములో సైతము ఉత్తాపము లేనియెడ మృత్యువు. ఇందుచేతనే నేను బాల్యకాలము నుండియు నగ్ని యొక్క పక్షపాతిని; అగ్ని మంత్రముననే నా దీక్ష. కొంచమేని శీతల భావమును జూచిన హృదయము దడ దడ కొట్టుకొనును. శరీరము మీఁదఁ జేయి నుంచినంతనే, లోపల జీవ మున్నది, లేక మృత్యువు సంభవించినది తెలియ నగును. ఆవిధముగానే చూచిన మాత్రననే, ఆత్మ కూడ జీవించి యున్నది లేక మృత్యువు పాలఁ బడినది తెలియ నగును. నేను పాపి నైనది, కానిది తెలిసి కొనుటకుఁ గొంత కాలము పట్టవచ్చును గాని ప్రాణమున్నది, లేనిది యతి సులభముగానే తెలిసికొనవచ్చును. ఎట్లు? ఉష్ణమున్నదో లేక శైత్యము గ్రమ్మినదో ముందు తెలిన పక్షమునఁ దర్వాత నది తేలును. ఈ కారణము చేతనే ఏ మూలముననైన ఆత్మ ఉత్తాప యుక్తమై సతేజమై యుండుఁ గాక యని సాధన ప్రార్థనలఁ జేయుచుందును. అగ్ని లోపల జీవ ముండునని యే నే నగ్నిని వరింతును; ఆలింగనము చేయుదును; మిక్కిలిగాఁ ప్రేమింతును. ఉత్తాపమును చూడఁగనే యాశ పుట్టును; ఆనంద ముద్భవించును; ఉత్సాహము కలుగును. అగ్ని యొక్క తేజము

తగ్గుచున్నట్లు కాన్పించెనేని, ఈమాటిజీవి గంగలో మునిఁగి ప్రాణనాశము చేసికొను నని యప్పుడే తెలిసికొందును. ఎవరైనను ఐదు సంవత్సరముల వఱకుఁ గూడ నుత్సాహముగా నుండి తిరిగి చల్లఁ బడుచున్నట్లు కనఁబడిన యెడల నీమాటిజీవి పాపముల పాల్పడుననియు, మృత్యువు వచ్చి కంఠము బంధించుననియు ముందే గ్రహింతును. ఇందువలననే ఉత్తాపము లేని యవస్థ యపవిత్రావస్థ యని యనుకొనువాఁడను. ప్రాతఃకాలమున ముందుగా నగ్నిమంత్రములో దీక్షితుఁడను గాక శయ్యాత్యాగముఁ జేసిన దినమున ఆహా! మృత్యువు పాలఁ బడుదుఁగదా యని పరితపించువాఁడను. నరకమును శీతల భావమును నేను సమానముగాఁ జూచితిని. మనస్సునందును, ముండలి నలుదిక్కులను సంతతము ఉత్సాహాగ్నిని జ్వలింపఁ జేసి యుంచువాఁడను. ఒక దళమునకు సేవఁ జేసితిని, ఇంకొక దళమెప్పుడగునాయని; పది దళములను సిద్ధము జేసితిని, ఇంకను బది దళములనెప్పుడు సిద్ధము జేయుదునా యని; ఆత్రముగా నుండువాఁడను. ఒక విభాగమునఁ గార్యముల సమకూర్చితిని, మఱియొక విభాగమున నెప్పు డొనర్తునా యని; కొంతమందితో సల్లాపములను జరపితిని, ఇంకను గొంతమందితో నెప్పుడు జరపుదునా యని; కొన్ని శాస్త్రములను సమ్మేళనము జేసి సత్యమును సంగ్రహించితిని,—ఆ నాలుగు సత్యములతోను తృప్తిపొంది యూరకున్న నవి పురాతనముగునేమో యను భయమున,— ఇంకను మఱికొన్ని శాస్త్రములను జదివి సత్యము నెప్పుడు సంగ్రహింతునా యని, చూచుచుండువాఁడను. ఇదియే ఉత్తాపము యొక్క యవస్థ. ఎల్లప్పుడును నూతన భావములను సంగ్రహించుటకు, నూతనానందము ననుభవించుటకుఁ, గోరిక. ఈ మనుష్యుఁడు నిరంతరమును నూతన మన్న దిక్కునకే

పరుగిడుచున్నవాఁడు. నూతనమే, ఉత్సాహ విశిష్టము; పురాతన మన్ననే శీతలము. ఎంతమంది బ్రహ్మ పరాయణ బ్రాహ్మలను జూచితిని! ఉద్యోగము పాఁతగిలి పోయెను; పఠనము, అధ్యయనము పురాతనము లయ్యెను; మంచి మంచి యువ జనుల మరణ మయ్యెను. ఎట్టి యుత్సాహ పురుషు లుండిరి! పాపము చేసి రోయుఁగరు, నరహత్య చేసి రోయుఁగరు; కట్టకడకు నీళ్ళలోఁ బడి మునిఁగి గతించి పోయిరి! ఎంతమంది బ్రాహ్మలు అనేక దినములు వైరాగ్యమును సాధన చేసిరి! తుట్టతుదకు వారి జీవనము శీతలమైనకొలఁదిని సంసారము వారికి మఱింత కాంక్షను పెంచుటకే హేతువయ్యెను. ధన లోభమునఁ జివరకుఁ జావ వలసిన వారైరి! సోత్సాహులైన యువజనులను బల్వురను జూచితిని! వారిప్పుడెక్కడ దాఁగి యున్నారో—ఈ విభాగ మందో ఆ విభాగమందో, ఈదళమందో ఆదళ మందో, ఈ గ్రామ మందో ఆగ్రామ మందో—తెలియరాదు. ఒకప్పు డెట్టి యుత్సాహ వీరుల వలె నుండెడివారు! ఇప్పుడు దగ్గఱగూర్చున్నను వేఁడియనిపించకుండునంత చల్లఁబడినారు. సాధారణపుఁ జల్లఁదనమా యది? దానిచే వారొక్కరే మృతినొందుట కాదు; వారి జీవనము నుండి యితరుల జీవనముల లోనికి జలము ప్రవేశించుచున్నది. అందువలన నెందఱెందఱు మృత్యువు పాలగుచున్నారు! చివరకుఁగాలు సేతుల శీతలము క్రమ్మునేమో యని, చివరకు నేత్రములు చల్లబడునేమో యని, చివరకు హృదయము ఉద్యమ విహీన మగునేమో యని నేను సర్వదా జాగరూకుఁడనై యుందును. కొంచెము శైత్యభావమును గాని, పురాతన భావమును గాని చూచినవాఁడు, “ఓహో! పనిపాటలు పాఁతగిలుచున్నవి! ఉపాసన చప్పఁబడుచున్నది! ఏమి చేయుదును?” అని

పరితపించుచు నీశ్వరుని జేరి, "దయామయా! ఈ విపత్తు నుండి నీ తనయుని రక్షింపుము!" అని ప్రార్థించి, వెంటనే హోమమునకు సామగ్రుల నమకూర్చి, అగ్ని యందు ఘృతమును బోయ నారంభించితిని. అగ్ని స్వరూపుఁడైన యీశ్వరుని యామంత్రిణము చేయుచుఁ జేయుచు నట్టె చూడఁగా,— నదీ సముద్రముల మీఁద అగ్ని భాసిల్లుచుండెను; పర్వతము లందు అగ్ని జ్వలించుచుండెను; జీవ శరీరము లందుఁ గూడ నగ్నియే యగపడెను. వెంటనే నూతన నూతన సత్యములు ఈ దిక్కున నుండి ఆ దిక్కున నుండి ప్రకాశమయ్యెను. మిథ్యను వచించినపుడే నేను పాపినా? అపుడే కాదు. ఉపాసనలో శైత్యభావ మగపడిన, నా మాటలు విని శ్రోతలు భీరులైన, ఉత్సాహ హీనులైన, అపుడు కూడ నేను ఘోర పాపినే. ఏలయన, పృథివి మీఁద శైత్య విషమును జల్లుటకుఁ గాదు నన్నీశ్వరుఁడు పంపినది. అతి మందుఁడను గాని, అతి నిశ్చేష్టితుఁడను గాని అయితినేని కేవలము నా నాశమే కాదు; ఇంకఁ బదిమంది నాశము గూడ నగును. ఉత్తాపము సర్వదా యుండదేని సర్వనాశము కావచ్చును. ఇందుచేతనే ఆశాసమూహములను తేజముతో నుంతును; విశ్వాసమును తేజముతో నుంతును; ఉద్యమమును తేజముతో నింపుదును. శీతల భావము రాఁబోవుచున్నదని తోఁచిన తోడనే కామము, ధూర్తత, కపటము మొదలైన వన్నియు వెంబడించియే వచ్చుచున్నవని తెలిసికొందును; పాపశయ్య మీఁద శయనించితి ననుకొందును. ఉపాసనా కుటీరము నందుఁ బ్రవేశించినపుడు కేవలము శీతల జలమే యని చూచితి నేని, నేఁటి యుపాసన నన్ను మృత్యువు పాలు చేయును గదా యని గ్రహింతును. ధ్యానము చేయుట కిష్టము లేనపుడు, మాటలు ఒకటి తరువాత నొకటి మెల్ల

మెల్లగా వచ్చుచున్నపుడు, వానిని తేజముతో నుడువ లేనపుడు, "ఆహా! ఉత్తాపము లేదు! ఇదంతయు మృత్యువు యొక్క పని గదా!" యనుకొందును. కార్యాలయములోఁ గూర్చుండి పని చేయునపుడు ఉత్తాపము ఉండదేని, "నేను ప్రభువు యొక్క కృత్యము చేయుట లేదు; మృత్యుదేవత యొక్క కృత్యమును జేయుచున్నా" నని తెలిసికోవలయును. అందునకనియే నేను ప్రథమము నుండియు నగ్ని మంత్రము నాదరించుచున్నాను. విశ్వాసపరులందు శాంత భావముండుట వాస్తవమే. కాని దోషము కానిండు, గుణము కానిండు నే నెప్పుడును ఉత్తాప ప్రియుఁడను. నేను నిష్క్రియుఁడై యుండలేను. దళము వదలి యొకమూల నొదిగి యుండుట నా పక్షమున దాదాపుగ నసంభవము. ఆపాదమస్తకము అగ్నితో నింపితిని. ఈ భావముతో సేవఁ జేసితిని; పరిశ్రమఁ జేసితిని; ధ్యాన సాధనలఁ జేసితిని. ఏకాంతమున బ్రహ్మదర్శన మెట్టిదో దానిని సహితము అనుభవించితిని; నానా వ్యవసాయములలోఁ బ్రవృత్తుఁడ నైతిని; కాని, శీతలత్వమను కూపమునఁ బడి ప్రాణమును పోఁగొట్టుకొనలేదు; ఈ సౌభాగ్యము నాకున్నట్లు లోలోపల తోఁచుచున్నది. ఎవరు శైత్య ప్రధానులో వారు భీరులు; పది పదునాకండు వత్సరములు సాధన చేసి పలాయితులగుదురు. శీతలత్వము కడు చెడ్డది; అది అగ్నిని పూర్తిగాఁ జల్లార్చి వేయును. మీలో నుష్ణమున్నది, కోమలత్వమున్నది, ఉద్యమింప నిచ్ఛయుఁ, గ్రియాశీలురగుట కుత్సాహమును మీలో నున్నది లేనిది, పరీక్షించి చూచికొనుఁడి! బాగుగ నుద్యమించుటకు నిచ్ఛయుఁ, బని చేయుటకు నేవిధమైన యామోదమును, బదిమందితోఁ గలసి సంకీర్తనము చేయుట కుత్సాహమును లేనట్లు తోఁచెనేని, వెంటనే చికిత్సకుని

బిలుపుండు; మీరు చావ నున్నారని తెలిసికొనుండి! మీరు బ్రహ్మభక్తులు! మీ ధ్యానములో నుద్యమోత్సాహము లుండవా! మీ ధర్మకార్యములలో నుత్తాపము ఉండదా? అట్లుండుట సరి కాదు. నిరాశ యొక్క చల్లని మాటల నెపుడును మీనోళ్ళలోనికి రానీయవలదు. కాలుసేతులు వెచ్చగా నుండిన శరీరములోఁ బ్రాణమున్నట్లు ఏలాగున స్థిరమగునో, ఆలాగుననే కార్యము, భావన, ఆశ, విశ్వాసము, మాటలు, వర్తనము—ఈ యన్నింటిలోను ఉత్తాపమున్నచో ధర్మజీవనము యొక్క లక్షణము ప్రకాశ మగును. ముట్టుకొన్నంతనే నీ యంగుళి నుండి నా యంగుళి లోనికి వేడిమి సంచలితము కాఁ గలిగినంత యుత్తాపము నీ యింగుళియం దురితవలెను. ఎనుఁబది వత్సరముల వృద్ధున కెంత తేజ మనఁగా నాలుక నుండి మాటలు బయటికి వచ్చి రాఁగానే లక్ష లక్ష మంది ఉత్తేజితు లగుచున్నారు. సమీపించుతోడనే,—ఎనుఁబది యేండ్లు వచ్చినవి; ఉత్సాహ మింకను తగ్గలేదే?—యందురు. ఇట్టి తేజము, ఉత్సాహము, ఉత్తాపము, అగ్ని ప్రతివానికిని ఉండునట్లు చూచుకొన వలయును. ఉత్సాహదాత, ప్రాణదాత, ఎవరో ఆయననే ప్రార్థింతును; ఉత్సాహముతో నగ్నిస్వరూపుని బ్రార్థింతును. "అగ్ని, అగ్ని, అగ్ని" యని నాలుక కేవలము దీనినే యుచ్చరించును గాక! హృదయము సర్వదా యీ మంత్రమునే సాధన చేయునుగాక!

ఓ దయాసింధూ! ఓ అగ్ని స్వరూప బ్రహ్మమా! ఈ పృథివి మీఁద సంసారము అనేక కూపములను నిర్మించుకొని కూర్చున్నది. దాని సమయము దొరకఁగనే మనుష్యుని పట్టుకొని అందులోఁ బడవేయును; వినాశము చేయును. జననీ! ఆత్మలో నెన్నెన్ని త్తాపముండునో అన్నిట్నిను మేము నీవారము. సంసారము తన కూప

జలమ్ములోఁ బడవేసిన యెడల నిఁక నుత్తాప ముండదు; ఇఁక ధర్మ సాధన చేయలేము; శైత్యము వచ్చి నాశము చేయుచుండును. ఓ ప్రేమస్వరూపా! అకాలమున శీతలత్వ రూపమైన మృత్యువు యొక్క నోటఁ బడకుండునట్లు, వాక్కులోను, కార్యములోను, చింతలోను, ఇంకను తేజమిమ్ము. ఇప్పటికిని "అమ్మా!" యని పిలువఁ గలుగుచున్నాను. ఇంకను ఇరు పార్శ్వములను పెద్ద పెద్ద యగ్ని కుండములు జ్వలించు చున్నవి ఇదియే నా పరమ సౌభాగ్యము. ఆ బాల్యమునందు అగ్ని మంత్రమున దీక్షితుఁడ నగుట చేతనే రోగ సంతాపముల యందును, ఆపత్సంకటముల యందును నీ పవిత్ర చరణములను బూజించుచున్నాను; ఇంకను బంధు మిత్రులతోఁ జేరి నృత్యము చేయుచున్నాను; నీ నామ గానము చేయుచున్నాను. ఎంత మంది వచ్చిరి! ఏమేమి మాటలు చెప్పిరి! వారిలో ననేకులు పలాయితులైరి. అగ్ని మంత్రములో నన్ను దీక్షితుని జేసి యుండని యెడల నిన్నుఁ బురాతన మను వాఁడను; నవ విధాన మను వాఁడను గాను. నీవుత్సాహము నిచ్చి బ్రతికించితివి. అంతయుఁ బ్రాఁతగిల్లుచున్నట్లు నీవు చూచినతోడనే నవవిధాన ప్రకాండమును పంపించితివి. సమస్త దీపకాంతియు నిర్వాణ ప్రాయము గావచ్చినప్పుడు మహోజ్జ్వలమైన జ్ఞానదీపమును వెలిఁగించితివి. తోడనే సమస్త సాధక బృందమ్ములును, "ఈశ్వరుఁడు ధన్యుఁడు ధన్యుఁ" డని జేజేలు పెట్టసాగిరి. వారి యాయువు మఱి నూఱు వత్సరములు వృద్ధి యయ్యెను. సమస్త నిరాశయు, భయమును సమసిపోయెను. విధాన నేతవగు నో శ్రీహరీ! ఒక వాద్యమునకు బదులు శత వాద్యములను గూర్చుకొని నీ నామమును గానము చేయుట కారంభించితిమి. దేశము లోని నానా మార్గములు,

ఘట్టములు శాంతము కాఁ జొచ్చెను; యువ సంప్రదాయము నిస్తేజము, నిరుద్యమము, నిస్తబ్ధము కాసాఁగెను; అనేక సోదర బ్రాహ్మ బ్రాహ్మికలు విగతోత్సాహులై ధర్మ పథమును విడిచి సంసారములోఁ బడుచుండిరి;— అట్టి సమయము నందు ఓ కరుణాసింధూ! ఉత్సాహదాతా! నీ ధర్మమును రక్షింప నుద్దేశించి, సకల దురవస్థల నడుమ పథములను, ఘట్టములను, సమస్తమును అగ్ని మయములఁ జేసితివి. అణఁగి మణఁగి యున్న రసన నెంత యుత్తేజితము చేసితివి! తత్క్షణమే ఆ యవసన్న రసన అగ్ని వలె సంభాషింపఁ దొడఁగెను గదా! వృక్ష లతల యందుఁ దిరిగి నిన్ను సందర్శించితిని; సంసారము నందు మరల నిన్ను సందర్శించితిని. జలము నందు గ్రమ్మఱ నిన్ను దర్శించితిని. అగ్నిలో మాట చెప్ప నక్కఱయే లేదు. పోయి పోయి నని తిరిగి బ్రతికితిని. నీవు పురాతనము కానియ్యలేదు. నవీనోద్యమోత్సాహములను పొంది బ్రతికిపోతిని. పాపము చేయకుండినను నాకు మరణము ప్రాపించియే యుండును. నితాంతము మిథ్యావాదని, శఠుఁడను గాక పోయినను, కేవలము సంసారము యొక్క యొడి యందుఁ బడి మృతి నొందియే యుండును. నేఁటి వఱకును నగరకీర్తనము అగుచున్న చోట నెల్ల ఎట్టి ప్రమత్త విరాగుల మత్తతను జూచుచున్నాను! ధన్యుఁడవు! నీవు ధన్యుఁడవు! ఎవ్వరి యుత్సాహమును నింక క్షీణింప వీలు లేనట్టి శాశ్వత నవీన ధర్మము నిచ్చినాఁడవు. దీనిని స్వీకరించిన తరువాత నెవరైనను, ఎన్నఁడైనను బలహీనులై, ఉత్సాహ హీనులై గతింప వచ్చునని నమ్మఁజాలను. నవ విధానములో మరణ మనునది లేదు. శీతలత్వము లేనే లేదు. ఇది నా ప్రజ్ఞ వలనఁ గాదు; భ్రాతృవరుల ప్రజ్ఞ వలనఁ గాదు; నీ ప్రజ్ఞవలన. ఉత్సాహ మిఁక తగ్గదు. మఱి

యెడతెగని నృత్యమును చేయుదును. నిన్ను, "అమ్మా! అమ్మా!" అని పిలుచుచున్నానే యీ పిలుపున కింక నంతము ఉండదు. శరీరము శ్మశానములోఁ దగులఁ బడి పోవును; అగ్ని చల్లారి పోవును; కాని మనస్సు నందలి యగ్ని మాత్రము ఏమి చేసినను చల్లారదు. ఎవరైనను మనశ్శరీరములను బ్రహ్మాగ్నితో నింపఁ గలిగిన యెడల నా యగ్ని చల్లారునది కాదని వారికిఁ దెలియఁ గలదు. హా! ఎట్టి యగ్నిని జ్వలింపఁ జేసినాఁడవు! భక్తి యొక్క అగ్నిని, విశ్వాసము యొక్క అగ్నిని, ప్రేమ యొక్క అగ్నిని, జ్వలింపఁ జేసినాఁడవు! ఈ యగ్నిలో మాత్ర మెవ్వరును తృప్తి నొందరు. ఈ యగ్నిని సదా చేపట్టియే యుందును. ఈ సుఖములోనే జీవనమును వెళ్ళబుత్తును. ఆశీర్వదింపుము! ఎవ్విధముననైనను నిర్వాణమును జెందని అక్షయ వ్రతము నిమ్ము! అక్షయోత్సాహము నిమ్ము! అగ్ని భావములో నుత్సాహితులఁ జేయుము! ఆ భావములో నృత్యము చేయనిమ్ము! ఏ నృత్యము ఆఁగునది కాదో యా నృత్యములో నాట్యము చేయనిమ్ము! ఏ యగ్ని నిర్వాణముఁ జెందదో యా యగ్నిని జ్వలింపఁ జేయుము! నీ శ్రీచరణములఁ బ్రార్థన చేయుదుము; ఓ దయామయా! మా కీభిక్ష నిమ్ము.



# చతుర్థాధ్యాయము.

## అరణ్యావాసము : వైరాగ్యము.

భానువారము ౨౯ శ్రావణము-౧౮౦౭ శకము.

చతుర్థాధ్యాయము, "అరణ్యావాసము : వైరాగ్యము." సంసారమునఁ బ్రవేశించు కాలము నా పక్షమున శ్మశానమునఁ బ్రవేశించు కాల మయ్యెను. సుఖోద్యాన మార్గము నా పక్షమున మృత్యు వని, ఈశ్వరుఁడు స్థిర పఱిచెను; అంతియు ఘటిల్లెను. ఎవ్వఁడు నా చరిత్ర పటమును వ్రాసెనో, ఆ పరమ నిపుణ చిత్రకారుఁడు మొదటఁ గారు రంగు నలువుతో నలుదిక్కులను అతి ఘోరమైన నల్లని ఛాయ వేసెను; అట్లది అత్యంత కాలవర్ణము కాఁగా దానిమీఁద నానా ప్రకారములైన యుజ్జ్వల వర్ణములు గల రూపములను వ్రాయ నారంభించెను; ఈ దినమును ఆవిధముననే వ్రాయుచున్నవాఁడు. నల్లని ప్రదేశము పైని పటము యొక్క శోభ ప్రకాశమానమై యింకను నుజ్జ్వలమైనది. శోకము, సంతాపము, వైరాగ్యము, నా ధర్మ జీవనమునకు నారంభము లయ్యెను. వైరాగ్యమేఘము ప్రథమము నుండియుఁ గనవచ్చుచుండెనని విధాత యెఱుఁగును. పదునెనిమిదేండ్ల ప్రాయమున ధర్మజీవనము కొంచెము కొంచెము తలయెత్తెను. కాని పదునాల్గవ వత్సరముననే మత్స్యభక్షణమును పరిత్యజించితిని. ఎవరు బోధించిరి? ఆమిషభక్షణము నిషిద్ధమని ఎవరు చెప్పిరి? ఒక్క గురువునే యెఱిఁగియుంటిని; ఆయననే మన్నించి యుంటిని; ఆయనను "వివేక"మంటిని. ఆవివేకము బాలకునితో నొక్క వాణిని బలికెను! బాలకుఁడు పరిత్యజించెను. చతుర్దశ వత్సరముననే వైరాగ్యము

పరిపక్వతమమునఁ బ్రాదుర్భవించెను. ఎపుడు ధర్మభావము వృద్ధి కా రారంభించెనో, ఉపాసన ఎప్పు డారంభమయ్యెనో, ఈశ్వరుని పదతలమున నెప్పు డాశ్రయించితినో, ధర్మోత్తాప మెప్పు డుద్దీప్తము కాఁ జొచ్చెనో, అప్పుడు ప్రార్థన చేయుట కారంభించితిని; అప్పుడు, ఆ పూర్వ మేఘము,— ఏది తొల్తొల్త నంగుష్ఠ మాత్రమై జీవనాకాశమునః బొడకట్టెనో, ఏది కేవలము మత్స్యభక్షణలోనే పరివ్యాప్తముగను, పరిసమాప్తముగ నుండెనో, —ఆ మేఘము ఘనీభవించెను. సామాన్య ఘనీభావము కాదు! దాని మూలమున ముఖము మలిన మయ్యెను; హృదయము విషాద పూర్ణ మయ్యెను; అంతియు కాదు! పగలు శాంతి దొరక కుండెను; రాత్రి శయన సమయమునఁ గూడ నది శాంతి ప్రదము కాదాయెను! యౌవనమున నెన్ని విధములైన సుఖభోగము లుండునో, యౌవనోదయముల నన్నింటిని విషతుల్యములుగఁ జూచి పరిత్యజించితిని. "నీవు సైతానవు; నీవు పాప"మని యామోదము నంటిని. "నీవు నరకమవు; నీ యాశ్రయమును గ్రహించిన వాఁడెల్ల మృత్యుగ్రాసమునఁ బడు"నని విలాసము నంటిని. "నీవు నరకమునకుఁ ద్రోవ; నీవు మృత్యుముఖమునఁ బడవేయుదువు; నిన్ను శాసింతు"నని శరీరము నంటిని. అపుడు ధర్మము నెఱుఁగను. సంసారి యగుట పాపమని, కాంతాసక్తుఁడ నగుట పాపమని మాత్ర మెఱుంగుదును. పృథివి మీఁద నెవ్వరు మృత్యు వక్త్రమునఁ బడిరో, వారి విషయము జ్ఞప్తికి వచ్చెను. సంసారము యొక్క విలాసముననే అనేకులు చచ్చిరి. శ్రద్ధను సారముగానే, "అరే! నీవు సంసారివి కావలదు సుమా! సంసారమునకుఁ దలను విక్రయింపవలదు సుమా! కళంకము, పాపము, ఇవన్నియు భయానక విషయములు. మున్ముందు ఆమోదమును విష

ర్జింపుము; ఆమోదము యొక్క సూత్రమునఁ బడియే యనేకులు నరకమునఁ బ్రవేశింతురు.'' అని యంతర్వాణి వినవచ్చెను. సంసారమున భయము పుట్టెను; సంసారము మాట జ్ఞప్తికి వచ్చిన తోడనే నరక దూత వచ్చె ననుకొనువాఁడను. సంసారము యొక్క యాకృతి భీషణముగాఁ గనఁబడునది; భార్యయని యే పదార్థమున్నదో దానిని జూచినభయము. సంసారమును నిక్కమైన విష పాత్రముగా నెంచితిని. బయటికిఁ జూచుటకు సుందరము; లోపల భయానకము. ఎక్కడఁ గాలు పడునో యక్కడనే కంటక మున్నదని, రక్కసి యున్నదని, భయానక జ్వరరోగము దాఁగియున్నదని, తోఁచునది; సర్వదా భయమగునది; సందేహము కలుగునది. నగుమోము కాంతి దప్పెను. ''నీవు హసియించినఁ బాపి వగుదువు. హసియింపఁ బాప మగును.'' అని మనస్సు వక్కాణించెను. నవ్వు నావద్దనుండి సెలవు పుచ్చుకొనెను. బంధుజనులు కొందఱు కొందఱు చూచిరి గాని గ్రహింప లేక పోయిరి. దేని మూలమున నవ్వు వచ్చునో, దానిని గోరనని, ఏ పుస్తకమును జదివిన, నే స్నేహితుని వద్దకు నెళ్ళిన నవ్వుద్రిక్త మగునన్న భయము కలదో, ఆపుస్తము నుండి, ఆ స్నేహితుని నుండి, దూరదూరమున నుందునని హృదయమున సంకల్పము చేసికొంటిని. క్రమమున మౌని నైతిని; మితభాషి నైతిని. సుఖ సంపదల వైపుఁ గన్నెత్తియైనఁ జూచువాఁడను గాను; వనము లేదు; వనమున కరుగ లేదు. కాషాయ వస్త్రము మాట తలంపలేదు; దానిని ధరింపనులేదు. శరీరమున కేవిధమైన బాధను గలిగించుటకును, అస్వాభావికములైన యే యుపాయములను గాని యవలంబింపలేదు; అవలంబింప నిచ్ఛయును గలుగలేదు. ఏవిధమైన బాహ్యలక్షణముల మాటయుఁ దలంపునకు రాలేదు. ఏ

యింటియం దుంటినో ఆ యింటిని, ఏ గదియం దుంటినో ఆగదిని, శ్మశానము వలె, వనము వలెఁ జేసితిని. గృహవాస్తవ్యులయొక్క కోలాహలమే బెబ్బులుల బొబ్బరింత లనుకొంటిని. ఎక్కడ నెక్కడ నీచమైన యాచార వ్యవహారములను జూచువాఁడనో, అక్కడనెల్ల మృత్యువు చిందులు ద్రొక్కుచున్న దనుకొనువాఁడను. నా వనము నిజమైన వనము కానిమాట వాస్తవమే యైనను సంసారమే నాకు వనమయ్యెను. సంసారము యొక్క యైశ్వర్యము మధ్య నుండికూడ, నేను సామాన్య వస్త్రమును ధరించి ప్రొద్దు పుచ్చువాఁడను. ఏడ్చువాఁడను గాను ; కాని హాసవిహీనమైన ముఖములోనే యుండువాఁడను. ఈ వైఖరినే యుదయమున పడక నుండి లేచువాఁడను; ఈ చందముననే రాత్రులందుఁ బక్కమీఁదఁ బరుండువాఁడను. సూర్యుఁడు నన్ను హసింపఁ జేయఁ జాలకుండెను; చంద్రుఁడును నాకు నవ్వన్న మాట కలిగింప నేరకుండెను. ఆకాలపుఁ బ్రధాన బంధు వెవరో మీ రెఱుంగుదురా? ఇంగ్లీషు కవులలో నెతఁడీ భావమును బాగుగ వర్ణింపఁ గలిగి యుండెనో ఆయన. ఆయన యొక్క "రాత్రి చింతలు" చదువువాఁడను. అపుడు, ఆమోదము నేమాత్రమైనఁ బొందియుంటినేని, దాని నా పుస్తకము చదువుట వల్లనే పొందితిని. ఏ యే యుపాయముల వలన మనసునకు గష్టము తోఁచునో, గాంభీర్యము వృద్ధి యగునో, కుచింతల వైపునకు మనసు తిరుగ కుండునో అట్టి నానా విషయములలో నియుక్తుఁడనై యుండువాఁడను. ఇదంతయు జరగిన దెప్పుడు? పదునెన్మిది, పందొమ్మిది, ఇరువది యవ వత్సరములలో. వివాహము చేసికొని సంసారమునఁ బ్రవేశింప నున్నపుడు, ఎక్కడ సంసారము చేయుదునో ఆ స్థానమే శ్మశాన మయ్యెను. సంసార విషయములను

గూర్చి విశేషముగ తెలిసి యుండనైతిని గాని సంసారము యొక్క భీషణత్వమును మాత్రము బాగుగ సుగ్రహించి యుంటిని. భార్య వచ్చుచున్నది; సంసారము చేయవలెను. "సంసార విలాసములోఁ బడి నీవు సుఖము ననుభవింతువా ? ఎప్పుడును భార్యయొద్దనే పడియుందువా ? సంసార విషయములను గూర్చి నీవు ముచ్చటింతువా ? ఈ సకల విషయములును నీకు సుఖము నిచ్చునా ?" అని నా మనసులో నీ మాటల నన్నియు నెవరో చెప్ప నారంభించిరి. "జీవాత్మ ఉత్కృష్ట పదార్థము; దీనిని నేను భార్య యొక్క యధీనము చేయుదునా ? సంసారమునకు నధీనము చేయుదునా ?" అని తలపోసితిని. ఈ జీవనమున స్త్రైణుఁడను గానని ప్రతిజ్ఞఁ జేసితిని; ఏలయన, భార్య యొక్క యధీనమైన మూలముననే అనేకులు చావఁగాఁ జూచితిని. సంసారము యొక్క వజ్రాఘాతమున ననేకులకు మృత్యువయ్యెను. అందునకనియే, ఈ మానవుని స్వర్గింపకుమని సంసారమునకుఁ జెప్పుదును. అందుచేతనే, ఆదినము నుండి భయము భయముగా సంసారము చేయుదును. ఎప్పుడు సంసారము యొక్క ఆసక్తిచే మృత్యుగ్రాసమునఁ బడుదునోయని, ఎప్పుడు డబ్బు ముట్టుకొని చత్తునో యని, మిక్కిలి భయపడుదును. ఏవిధమునఁ గామక్రోధములను భయానకముగా నెంతునో, ఆవిధముననే భార్యాపుత్త్రులను, సంసారమును విపత్తుగా నెంతును. చివరకు నీసకలమును నీశ్వరునికంటె నెక్కువగాఁ బ్రేమింతునేమో, సంసారమునే ప్రియతరముగా నెంతునేమో యన్న భయ ముండుటచే సంసారము ఘోరరాక్షసి యనిపించునది. చివరకు భక్తి కలుగదేమోయను భయముచే నమావాస్యను బ్రేమింపువాఁడను. ఉద్యానవనమునకు వెళ్ళి యామోదింప నిష్ట ముండునది కాదు.

హృదయమున స్ఫూర్తి లేకుండెను; అంధకార ప్రదేశమునం గదలకుండ మెదలకుండ జడము వలెం బడి యుండువాఁడను. ఒకటి రెండు మనసు వచ్చిన మాటలు మాత్రము ఈశ్వరునకుఁ దెలుపువాఁడను. ఇంకెవరికిఁ దెలుపను? ఈ విధముగ వైరాగ్యమె జీవనము యొక్క మూలమయ్యెను. జీవన వృక్షము యొక్క ఆకారప్రకారము లన్నియు వైరాగ్య ద్వారముననే యయ్యెను. వైరాగ్య మూలకమైన జీవనములో నేది యగుట యావశ్యకమో యది యయ్యెను. దేవాసురయుద్ధములో దేవతలకు జయమయ్యెను. వివేకము, వైరాగ్య మను నిద్దఱు సోదరులును గలసి పాపజీవనమును శాసింప నారభించిరి; తరువాతఁ జూడ సంసారము దగ్గఱకు రాలేక పోయెను. ఆత్మపీడన, భార్యాపీడనముల మూలమున ధర్మజీవన మారంభమయ్యెను. ఎవరు భయమునకుఁ గారణమైరో వారు చివరకు బంధువులైరి. ఏ శ్మశానములో సంసార మారంభమయ్యెనో, ఆ శ్మశానము ఫల పుష్ప శోభితమైన యుద్యానవనము క్రింద మాఱెను. దాని నడుమ హరిసాన్నిధ్యమును బడయఁ జేయు మార్గ మేర్పడెను. శ్మశాన మెన్నఁడు నున్నట్లే తోఁపలేదు. ఆరంభము దుఃఖముతోను, నంతము సుఖముతోను నయ్యెను. ఎవరు నవ్వుచు నవ్వుచు ధర్మజీవనము నారంభింతురో, ఎవరు ఆరంభమునుండియు సౌభాగ్యవంతులో, అట్టివారిలో న న్నొకనిగాఁ బరిగణింపను. ఈ తల మీఁదుగా నెన్ని విపత్తులు గడచి పోయినవి! "శవము క్రిందఁ జేసి వేసిననే కాని దేవత్వము నీకు సిద్ధింపదు" అను నీవిధి నీశ్వరుఁడు నా యెడలఁ జెల్లించెను. ఏడ్చుచు నేడ్చుచు విత్తనము నాఁటితిని; ఇపుడు నవ్వుచు నవ్వుచు సస్యసంచయము సేయుచున్నాను. పరిశ్రమమున నెంత యేడ్చితిని! ఇపుడు హరియొక్క శ్రీపాద

పద్మములను స్పృశించి కేరుచు నవ్వుచున్నాను. ఈవిధి యందఱు విధి యగుటకును వీలు లేదు. ఎవరి పక్షమున నేవిధియో వారు తదనుసారముగనే నడువవలయును. కాని, ఈజీవనము యొక్క యొక విషయము మాత్రము అందఱు పక్షమునను జెల్లవచ్చును. ఏదేని సత్యమును బ్రతిష్ఠింపవలయునేని, ఏదేని కీర్తిని నిలుపుకోవలయునేని, ఏదేని మహావ్యాపారమును బ్రసవింపఁ జేయవలయునేని, ఈ గర్భయాతనను సహించియే తీఱవలెను. ఎవ్వరైన నెద్దియైన కీర్తిని నిలుపుకొనఁ దలఁచిరేని, ఎవ్వరైన ధర్మప్రచారకులు కానెంచిరేని, ఎవ్వరైన నేదైన వ్రతమును బూని లోకోపకారమును జేయఁ జూతురేని కొన్నాళ్ళు ఒక్కమాఱు వనమునకు వెళ్ళియే తీఱవలెను. ద్విజులు కాఁ దలఁచిరేని యొకమాఱు దండధారులై చివరకుఁ గొన్ని యడుగులైనను దిరిగియే రావలయును; హిందువులు చేసియుంచిన యీ యుపనయన సంస్కారవ్యవస్థయొక్క యుపకారమును మనము గ్రహింపవలయును. ద్విజుఁడవు కాఁగోరుదువేని, ఈశ్వరుని కరతలమ్మునఁ దేలియాడఁ జూడ నిచ్ఛగింతువేని, అంతరంగమున నే పశు వున్నదో దానిని పరిహరింప వలయును; చెడు ప్రవృత్తుల నెల్ల తఱిమివేయవలెను. కొలఁది దినములు దుఃఖాశ్రువులు పడును; పట పట మనుచు నీ హృదయపు టెముకలు బ్రద్దలగును; చివరకు నాశ్చర్యమైన భాగవత తనువు నీకు లభించును. బ్రతికి యుండ వలెనని ప్రయాసపడుదువేని యొక మాఱు చావుము; క్రీస్తువలె, బుద్ధునివలె, శ్రీ గౌరాంగునివలె, కష్టబంధనముల మధ్యకుఁ బోయి తిరిగిరమ్ము. కేవలము సామాన్య కార్యముసే చేయఁ జూతువేని, తదనుయాయులగు హిందువులవలె, ముసల్మానులవలె, క్రీస్తువాదుల వలె, కొలఁది దినములు వైరాగ్యమును సాధనచేయుము. కష్టమును

సహింపక ముందు, వైరాగ్యము సాధనచేయకముందు, సంసారమునఁ బ్రవేశింపకుము. సంసారములో నీ విదివఱకే ప్రవేశించితివా? అట్లయ్యేనేని రెండవ పర్యాయము సంసారము చేయఁ బోవునపుడు వైరాగ్యమును స్వీకరింపుము. ఇహలోకమందు స్వీకరింపవేని, పరలోకము నందైన స్వీకరింపవలసి వచ్చును. ఒకమాఱు ఏడ్వని యెడల నిజమైన నవ్వు నవ్వుటకు వీలు లేదు. అమావాస్యయొక్క యంధకారమునఁ బడకున్నఁ బూర్ణిమ యొక్క మహాలోకమును, శోభను గ్రహింపలేవు. దయామయుఁడు ధన్యుఁడు. జీవనోద్యానములో నిపుడు భక్తియొక్క ఆనందపుష్పములు పుష్పించినవి. ఈజీవనములో నాకుఁ గలిగిన దుఃఖకష్టముల నుండి, శోకములో మునిఁగి యుండుట యుచితము కాదని గ్రహించితిని. వెనుక సౌఖ్యము వచ్చుచున్నదని తెలుపుటకునై దూత భావమున విషాదము ముందే తెంచును. సుఖము నిచ్చును గనుకనే వైరాగ్యము స్వాభావికము. మర్కటవైరాగ్యమును నే నొల్లను. ఏ వైరాగ్యమును బ్రయత్నించి పడయవలయునో దానికొఱకు నేను బ్రయాసపడను. నేను శరీరము మీఁద భస్మము పూసికొని వైరాగ్యమును సాధనచేయలేదు; సహజముగా నేది యిష్టమైనదో దానినే చేసితిని. స్వాభావిక వైరాగ్యమునే నేను అవలంబింతును. ఆ వైరాగ్యము నుండియే నాకు మంగళము గలుగును. కాలవర్ణమేఘము లగపడిన వృష్టి యగునని తెలియునగును. జీవనములో వైరాగ్యమేఘము పొడసూపినంతనే ఈ విజ్ఞాన సంగత సత్యము అద్భుతము సిద్ధింపఁ గలదని గ్రహియింతును. వచ్చిన నాక నవవిధానము వచ్చును; ఆయిన నాక నవతత్త్వము ప్రకాశముగును; లేకున్న నాక నూతన సాధన మార్గము తెలియవచ్చును; ఇట్లు కానున్నపుడు

వైరాగ్యభావను ముందుగా హృదయము నధీనముఁ జేసికొనును. ఈ ప్రసవవేదన యెప్పుడగునో అప్పుడు దీని నుండి యొక చక్కని శిశువు జన్మించి తీరునని తెలిసికొనవలయును. స్వయముగా వంటఁ జేసికొనుమని కాని, పాదరక్షలను బరిత్యజింపుమని కాని, లేకున్న రెండు దినములు మఱియొక విశేష స్థానమున వసింపుమని కాని, ఆదేశ మయ్యేనేని, ఇవన్నియు శరీరమును దగ్ధము చేయుటకుఁ గాదని గ్రహింపవలయును. శరీరమును దగ్ధముఁ జేసిన లాభమేమి? ప్రకృత వైరాగ్యమెద్ది? ఎక్కడ వృష్టి లేదో అక్కడ వైరాగ్యమేఘమును లేదు. నలుగురికిని జూపింపనే వైరాగ్యమో, దానిని బరిత్యజింపుము! లోపల వైరాగ్యము నుంచుకొని బయట నమస్త్రమును తీవిగా నుంచిన యెడల నవనాగరికులు దానిని గపటమందురేసి నావలె జన్మసన్యాసు లెవరో వారు దీనినిఁ గొనియాడుదురు. ఈశ్వరాదేశముచే, ధర్మప్రచారార్థము, భద్రత ననుసరించి నేను నవనాగరికులమధ్య వాసము చేయుచున్నాఁడను. మనస్సు విరాగులతో సగోత్ర మైపోయినది. ఆ వంశముయొక్క పితృపితామహులు నాకు లభించిరి. మనలో నేవైరాగ్యమున్నదో యది కష్టము కొఱకుఁ గాదు; అది తనంతనే కలుగుచున్నది. ఇంకను నిలిచి యున్నఁ గొంచెము భద్రభావమును, బాహ్యాశోభయు, భద్రతానుకూలముగాను, పరితరక్షణార్థమును ఇంకను ఉంపఁబడినవి. నవవిధానముయొక్క ఆదేశమున మనస్సు వ్యాఘ్రచర్మమును ధరించినది. బయట వ్యాఘ్రచర్మము యొక్క యగత్యము కలుగలేదు; బయట లేకున్ననే మంచిది. ఓయి భ్రాతృగణములారా! హృదయము వైరాగ్యమును ధరియించునుగాక! ధర్మమునకుఁ గాను వైరాగ్యమును బాగుగ నాదరింపుఁడీ! ఈ బ్రహ్మసమాజమున

వైరాగ్యమూలమున ననేకుల నుపకారమైనది. నవవిధానములో వైరాగ్యముయొక్క సాధన లనేకము ప్రకాశితమై, అవలంబింపఁబడినవి. ఈ వైరాగ్యములో నాత్మ నవజీవనశోభను ధరించును. ప్రథమమునఁ గష్టము కలిగినను, సుఖము కలుగ మొదలుపెట్టెనేని మఱి తగ్గదు. ఈ దినము ఎంత శోకించితినో రేపు అంతకంటె నెన్నోమడుంగు లధికముగా సుఖము కలుగఁగాఁ జూతును. ఆదిని మ్లానముఖ మయ్యేనేని తుదిని హాసము వచ్చి వైరాగ్యమును మహిమాన్వితమును జేయనే చేయును.

ఓ దీనబంధూ! దీనశరణ్యా! ఎవరికి నేవిధేని గల్పించితివో వా రావిధినే పట్టుకొని పోవలయును. ఈ సంసారారంభసమయమున వైరాగ్యమంత్రమున దీక్షితుఁడనైతిని. ఈ జీవనము నెప్పుటను రాలేదు; మధ్య మధ్య విపత్తుల యందుఁ బడవలసి వచ్చునని అప్పుడే గ్రహించితిని. కాని నీవు బాధల పా ల్గానియ్యలేదు; నిగ్రహార్థమై యీ యోటి కుండను బ్రద్దలు కొట్టలేదు; రుగ్ణ శరీర మనస్సులను ఒక్కమాఱుగ నాశనము చేయలేదు. తిక్తౌషధమును దాగింతువు, కేవలము ఋగ్మికించుటకే! మేఘము గ్రమ్మునది ఆకాశమును చిరాంధకారమునఁ గప్పివేయుటకుఁ గాదు! వైరాగ్యాంధకారము కలిగి కలుగని తోడనే ఆకాశము నృత్యము చేయుచుండును; పృథివి నాట్యమాడుచుండును; సస్య, ఫల, పుష్పములతో మేదిని పూర్ణమగును. ఈజీవనములో నెప్పు డెప్పుడు మనోభారము కలిగెనో, దానివెంటనే సుఫలము ఫలింపఁ జూచితిని. రాత్రియొక్క యంధకారము ఉదయము యొక్క దూతయై వచ్చును. దీనబాంధవా! నీ వేమి చేయుదువో అదియే మంగళము! ఇట్టి దుఃఖకష్టములలో నేదియుఁ జిరకాలము నిల్చియుండలేదే!

విషణ్ణత అట్టేయుండ లేదే! దినదినమును, స్వస్థత, పుణ్యము, ధర్మము,— వీని నాస్వాదించుచున్నాను. దర్శనానందమును అనుభవించితిని. ఓయి నాథా! ఈ జీవనములో వైరాగ్యము యొక్క కష్టము నోర్చుటకు నెన్నఁడును వెనుదీయువాఁడను గాకుండుదును గాక! దీనివలనఁ జిత్తము శుద్ధమగును; ఇంద్రియములు నిగ్రహింపఁబడును. హృదయము పవిత్రధారియగును; జీవనము లభ్యమగును. ఓయి దీననాథా! రమ్ము! విరాగులలో నీవు ప్రధానవిరాగివి! నీవే సర్వత్యాగివి! నేను నీ వెనువెంటఁ దిరుగుదును. లోలోపల సన్యాసినై, విరాగులలోఁ బ్రధానుఁ డెవఁడో, ఆయన ననుసరింతును. ఎంత వైరాగ్యము నిచ్చితివో ఇప్పుడు అంత నృత్యాధిక్యము నిచ్చితివి. ఇదివఱకు ఎంత దుఃఖించితినో, ఇపుడు మిత్రబాంధవులను కౌఁగిలించుకొని అంత హసించుచున్నాను; అంత యానందించుచున్నాను. భార్యాపుత్త్రుల నిదివఱకు భీకరముగా నెంచితిని; వారి నిప్పుడు నలుదిక్కులఁ గూర్చుండఁ బెట్టుకొని భవదీయానందములో నెంత యానందించుచున్నాను! ఈ పృథివిమీఁద స్వర్గమును దర్శించుచున్నట్లున్నది! నా యీ చేయు సంసారము సంసారము కాదే! సంసారములోఁ బ్రవేశింపవలసిన యవసరమే లేకుండెను. ఇదివఱకు నొంటిగా మనోవిషాదముచే అట్టె కూర్చుండువాఁడను; అందువలననే ఈ దినము బ్రహ్మమందిరము బంధుజనపూర్ణము కాఁగాఁ జూచితిని. ఎంత మంది బ్రహ్మపరాయణ బంధువుల నిచ్చితివి! ఇపుడు నృత్య మారంభ మయ్యెనేని వీరు రెండు చేతులును పై కెగుర వేసి, ఎంత నృత్యము చేయుదురు! నా సుఖము నితరుల కిచ్చుచున్నాను; అన్యుల నానా సుఖములను నేఁ బుచ్చుకొనుచున్నాను. నా భార్యయు, నాత్మబంధువులును నా

సాయముగుదురని నే నిదివఱకు స్వప్నమందును నెఱుఁగను. శ్మశానములో నిల్లు కట్టుకొంటిని;' ఆ యిల్లు స్వర్గీయసాధువులతో నిట్టి సమ్మేళనస్థాన మగునని నే నెఱిఁగి యుంటినా? ఎంత సుఖము వచ్చినది! ఇంకెంత రానున్నది! వైరాగ్యమునకు నమస్కరింతును! ఓయి సన్యాసధర్మ ప్రవర్తకా! నీకు నమస్కరింతును! ప్రకృతవైరాగ్యపథమున నడపించి మమ్ములను సుఖులను జేయుము! ఇదియే నీ శ్రీచరణములకుఁ బ్రార్థన!



# పంచమాధ్యాయము.



## స్వాధీనత.

భానువారము ౫ భాద్రము ౧౮౦౮ శకము.

నా యిష్టదేవత నాకు నానా మంత్రముల నిచ్చినపుడు స్వాధీనతా మహా మంత్రము తన్మధ్యమునఁ బ్రవిష్టమై యుండెను. "వత్సా! ఎన్నఁడు నెవరి యొక్కయు నధీనుఁడవు కాకుము;"— ఇదియే తత్ప్రధాన సత్పరామర్శము ప్రథమము నుండియు మనోవాక్కాయకర్మములతో నీ మంత్రమును శక్త్యనుసారముగఁ బాలించుకొనియే వచ్చుచున్నాను. ఈ పృథివి మీఁద నధీనత విషము; అధీనత బహుళ నరక బంధనములకు హేతువు. మొదటి నుండియు నధీనత మీఁద నేల యింత విరక్తుఁడ నైతినో తెలియదు. మానవుఁడు కామక్రోధములను తఱుముటకై రిపుల నడంచుటకై యత్నించును; ఉత్సాహముతో వాని వెంబడించును; కాని అధీనుఁడను కాను, అధీనుఁడను కాను, అనుచు నెవ్వరును ఇట్లు ఉన్మత్తులు గారు. నిశ్చయముగా విధాత కేదియో గూఢాభిప్రాయ ముండఁ బట్టియే జీవనను మూలమందు ఈ మంత్రమును బ్రవేశింపఁ జేసెను. అధీనత మీఁద నత్యంతమైన ద్వేషమును పొందుపఱిచెను. అధీనత పాపమనుకొను వాఁడను; దాన నెట్టి ఫలము ఫలించునో భావించువాఁడను గాను. అధీనత పాపము; అధీనత అరిష్టములకు మూలము; అధీనత్వము ఈశ్వరుని మీఁది శత్రుత్వము. మంత్రము యొక్క మాహాత్మ్యమును మొదటి నుండియు స్వీకరింపవలయుఁ గాన, ఫలమును జూడకయే యీ ప్రకారము సిద్ధాంతము చేసితిని. ఇందుచేతనే ఈదినము

వలెకును ఎవరి ముందరను శిరస్సును వంప నేరనైతిని. ఇందుకొఱకై కష్టముల పాలును గావలసి వచ్చినది; అయినను మంత్రమును వదలలేదు; మహీధరమువలె నిశ్చలమైన స్వాధీనతను నేను మెలివేసి పట్టుకొని యున్నాఁడను. ఈ మంత్రము సామాన్య మంత్రము కాదని గ్రహించితిని. “అధీనము కావల” దను నీమంత్రమున నొక్క విశేషార్థ మున్నది. నవవిధానము తరువాత రానై యుండుట చేతను, నానా కుసంస్కార దుర్భ్రములను దూరము చేయవలసి యుండుట చేతను, స్వాధీన భావమున సత్యముయొక్క మహిమను మహత్తరముగఁ జేయవలసి యుండుట చేతను,—ఈ యన్నింటి కొఱకే స్వాధీనత్వ భావము మొదటి నుండియు వర్తిల్లుచుండెను. స్వాధీనత్వమే యాదిమ శబ్దమయ్యెను. “అధీనుఁడ గా” నన్న యీ సంకల్పము గాక ఈ భావము నుండి యింకేమి ఫలములు ఫలింపఁగలవు? ఈ స్వాధీనత నుండియే యనేకములైన మహాకార్యములు ప్రభవించినవి. అధీనతా శృంఖలములో మనశ్శరీరములఁ గట్టువడనియ్యను; దాసత్వమును స్వీకరింపను; ఎవరి యొక్క పదతల మందును బడను; గురుజనులకు నాత్మను విక్రయింపను; గ్రంథవిశేషమునకును గింకరుఁడనై వందనము సేయను; ఏదో యొక మత సంప్రదాయములోఁ బడి దివారాత్రములు దానియొక్క యశోఘోషణమునే చేయుచుండను. ఈ వైపున నీ సకల ప్రతిజ్ఞలవలెనే, ఆ వైపునను, స్వేచ్ఛాచారమున కధీనము కాననియు, నహంకారమున కధీనము కాననియు, ఈశ్వరుని సమక్షమునఁ బూనవలసిన వ్రతమును బరిత్యజింప ననియు, ప్రతిజ్ఞలఁ జేసితిని. స్వాధీనత్వభావము వృద్ధి యైనకొలఁదిని, విగ్రహపూజ, జాతిభేదము మొదలైనవి ప్రభుత్వము చేయుచుండఁ

జూచితిని. చూడఁగనే ఆ సముదయము యొక్క శృంఖలమును భేదించుటకై యత్నించితిని. శతాబ్దములపై శతాబ్దము దేశమును విగ్రహపూజ మొదలగు వాని యొక్క దాసిని జేసి యుంచినవి. ఆ సముదయమును ఖండించుటకు ఖడ్గహస్తుఁడనైతిని. కుసంస్కార దుర్భ్రమలు పితృవర్గమును బాధించి యా వీధి వీధి కంతకు నుపద్రవము కలుగఁజేయుచున్నవని ఎప్పుడు చూచితినో, అప్పుడే యస్త్రమును బయటికిఁ దీసితిని. నేను దాసత్వమును సహింపలేకుండు వాఁడను; ఇప్పుడును సహింపలేను. ఎవరైనను విషయవాసనయొక్క గాని, అరివర్గముయొక్క గాని వశవర్తులగుచుండఁ జూచితేని "ఏమి యన్యాయము" అనిపించునది; ఏవిధమునను సహిష్ణుఁడనై యురితలేకుండువాఁడను. అధీనతను ఛేదించుటకు నా యస్త్ర మెప్పుడు నూఁగాడుచుండెను. అధీనత మూలమున నిన్ని యరిష్టఫలములు ఫలించినవని నేను లెక్కవేసి కనుఁగొనలేదు. నేను చింతించి చింతించి యస్త్రమును హస్తమున ధరింపలేదు. తుట్టతుదకు నీ మహామంత్రముయొక్క, ఈ గురుమంత్రముయొక్క యాశ్చర్య ప్రభావమును దర్శించితిని. ఈ పృథివిమీఁద నేయే విషయములు స్త్రీపురుషులను దాసులనుగఁ జేసి వైచినవో ఆ యన్నింటికిని బ్రతికూలముగా నిలువఁబడవలసివచ్చునని, అధీనతను జూచినంతనే ఉత్తేజితుఁడనై పడునట్లు నాకు నా యిష్టదేవత శిక్షఁ గఱపెను. క్రోధమున కెవ్వేని దాసులు కాఁగాఁ జూచితినేని క్రోధముమీఁదనే క్రోధము పుట్టునను. తండ్రికి దాసుఁడగుట గాని, లేక చివరకుఁ దనయునకు దాసుఁడగుట గాని నాకు సహ్యమగునది కాదు; ధనమునకు దాసుఁడగుచుండఁ గాని, లేక మానమునకు దాసుఁడగుచుండఁ గాని, తుద కేదేని యొక మతశాఖకు

దాసుఁడగుచుండఁ గాని యెవ్వనినైనఁ జూచితినేని రక్తము చంచలమై పోవునది. మనుష్యున కీశ్వరుఁడు స్వాధీనత నిచ్చెను : ఆ మనుష్యుఁ డన్ననో యాస్వాధీనతను బృధివి యను నంగడిలో నమ్మివేసి యైహిక పాపములచేఁ బరాజితుఁడై గీఁపెట్టుచున్నవాఁడు. పలుతరగతుల మనుష్యులు పలుతరగతుల మనుష్యులవద్ద వంగి వంగి పాదముల మీఁదఁ బడి దాసత్వమును స్వీకరింతురు. క్రీతదాసులగుటకు ఇంత యిచ్ఛయా! పది పదునొకండు వత్సరముల నుండి దాసత్వమునే చేయుచున్నారు! ఒక్కొక్క వింత వింత స్త్రీకిఁ జేయు దాసత్వమున కేమందురు! వ్యభిచార మందురు. మనుష్యునకు దాస్యము చేయువాని నేమందురు? దాసజనులమధ్య గణింతురు. ధనమునకు దాసుఁడైన, లోభియందురు. ఈ సమస్తము పాపము; దాసుఁడగుటయే పాపము. ఆసక్తి సంసారమునకు రాజైన మునిఁగి పోవలసినదే. ఏ గ్రామమునకు వెళ్ళినను, ఏ గృహమునఁ బ్రవేశించినను— చూడుము! నా దాసు లెంతమందియో! అని క్రోధ మనును; చూడుము! నా కెంతమంది బంట్లో! నే నెట్టి రాజాధిరాజులను సైతము పట్టి పరిహరించుచున్నానో! యని లోభ మనును. దాసత్వవిధి నలుగురి మధ్యను బ్రవేశించి కేవలము కాల్చుకొని తినుచున్నది. హా! విధాతా! స్వాధీనతయే ముక్తియు, అధీనతయే నరకమును గదా! స్వాధీనతయొక్క జయపతాకను లేవనెత్తి అధీనతయొక్క దుర్గమును చూర్ణచూర్ణము చేయవలయును. ఎవ్విధమైన మతాంతర్భాగ భావములోను బడను. కొందఱు గురువును పాటింపుమందురు; మనను భయమగుచున్నదనును: తల్లిదండ్రులను పాటింపుమందురు; భయమగును: బంధుమిత్రు

లెవరో, ధర్మములో నెవరితో నేకమై పోతినో వారిని మన్నింపుమందురు; మహాభయ మగుచున్న దని యాత్మ యనును: ఎవరు అత్యంతానుగతులో, ధర్మములోను సత్కర్మములోను అనుకూలురో ఆదరముతో వారి యధీనతను స్వీకరింపుమందురు; అధీనమగుటకు నాకు భయమని మానసము వచించెను. ఏమిత్రునియొక్క మాయలోను నేను బద్ధుఁడనుగాను. నేను ప్రేమించుమాట వాస్తవమే యైనను, మాయలో మాత్రము బద్ధుఁడఁగాలేదని నా యాప్తమిత్రు లొక్కరు చూచి గ్రహించిరి. ఇందులకనియే, "ఈతఁడు మమ్ములను ఒడలుమఱచి ప్రేమించునని చెప్పుటకు వీలులేదు. మధ్య మధ్య మఱలఁ దనబుద్ధిని బ్రదర్శింపఁ జేయుచుండును. మేము చెప్పిన దానిని చేయఁ"డని నా మిత్రు లందురు. మిత్రులు దేనిని జేయుమందురో దానిని నేను చేయుటలేదు. ఇతరుల యొక్క మాటమీఁద నేను మంచిపని నైనను జేయఁజాలను; ఈశ్వరుని మాటమీఁదఁ జేయుదును. అన్యుల మాటమీఁద దేనిని చేయ నైతినో, ఈశ్వరుని మాటమీఁద దానిని ఆత్రముతోఁ జేయుదును. ఈశ్వర వాణి యంతవఱకు వినఁబడదో అంతవఱకు నేను ఏకార్యమును ఆరంభింపను. ఇట్టి ప్రతిజ్ఞచే అన్యులకు నష్టము కలుగవచ్చును; కాని నేను సౌభాగ్యశాలిని; నాకు దీని మూలమున నష్టమునకు మాఱు లాభమే కలిగినది. మిత్రులను గష్టపెట్టితిని; గాని స్త్రీ కధీనము కాలేదు; బిడ్డల మాయచేఁ గాని దేశముయొక్క మాయచేఁ గాని బద్ధుఁడను గాలేదు; ఇఁకను గాఁబోవుటయు లేదు. నజీవులై యున్న వారియొక్క గాని, మృతులైనవారియొక్కగాని, ఎవరియొక్కగాని అధీనతాశృంఖలమున నేను బద్ధుఁడ నైనట్టు గాని, ఆథమపశువుము, వారి మాయచేఁ గట్టువడి పోయినట్టు గాని ఎవరును ప్రమాణము

చేయలేరు. స్వాధీనతనే ఎల్లపుడు నేను ఆదరింతును; కాని భక్తివిహీనమైన స్వాధీనత ' నా కాదరణీయము ' గాదు. పృథివియొక్క యంగడిని, అహంకారమూలకమైన స్వేచ్ఛాచారమును నేను దచ్చిచ్చి కొనలేదు. గొప్పవాఁడ నగుటకును, ఉన్నతపదవిని బొందుటకును నేను స్వాధీనతను కక్రియింపలేదు; అట్టి స్వాధీనత నరకముయొక్క స్వేచ్ఛాచారము; నేను దానిని స్వాధీనత యనను. నేను ప్రేమించితిని; కాని మాయాబద్ధుఁడను కాలేదు. ఇదియే యథార్థప్రేమ. మిత్రులను బ్రేమించితిని; కాని, అధీనుఁడను గాలేదు. అధీనుఁడనై లోకుల నాహ్వానము చేసియుంటినేని నేఁడు నా దళమున శతసహస్రములుండెడివారు. మాయలో నందఱను మఱపించి యుంటినేని, దానశ్రేణిలోఁ బేర్వ్రా యుండెనేని, నాదళము జనులతోఁ బూర్ణమై యుండునది. స్వాధీనతను దళపతిని జేసితిని. ఇందుచేత, సదా నాతో నెవరు వర్తిల్లుచున్నారో వారిని నేను మిత్రులందును; నన్ను వారి గురువుగ భావింపను. స్వాధీనత్వమునకే జయము కలుగును. ఇందుచేతనే "సత్యము జయించును గాక! సత్యము జయించును గాక!! సత్యము జయించును గాక!!!" యందును. స్వాధీనతయే జనము నాకర్షించును; ఇందుచే లోకులు వచ్చిన రానిందు; అంతియ కాని, గురుత్వము, గిరుత్వము నెన్నఁడును జేయనొల్లను. అధీనమగుటను మిక్కిలి యసహ్యింతును. నాలో నసహ్యించుకొను దానిని ఇతరులలో నసహ్యింపనా? దళములోని ఏసామాన్యుఁడును గూడ నధీనుఁడై యుండ నేను జూడలేను. ఎవరును ఇతరుల యధీనులగుటను నేను జూడఁజాలను; నా యధీను లెవరైన నైరేని యదియును నా కత్యంతాసహ్యమే. మఱియొక

మనుష్యుఁడు నా యొక్క అధీనము కానా? ఈశ్వరున కేమి సమాధానము చెప్పుదును? నా మతమును మఱియొకని మెడలమీఁద మోప నగునా? నా శాసనముచే నితరులను శాసింపఁ దగ వగునా? మాయ యొక్క మోహినీ మూర్తిని జూపి, ఈ నా దళములోనికి లాగ యత్నింపఁ గూడునా? పరుని నా యధీనము చేసి యుంచుకొన ధర్మమా! నరకము నన్నపుడే నోరు తెఱచికొని హుమ్మని మ్రింగివేయును. స్వర్గముగూడ దండప్రయోగము చేసి వెడలఁగొట్టును. నాకు సంఘము ఏర్పడకున్నను, ఒక్క మనుష్యుఁడైనను దగ్గఱకు రాకున్నను నేను దాసుఁడ నెప్పుడు గానో, అప్పుడు ఇతరులను దాసులఁ జేయను. నే నెప్పుడైన దాసత్వము చేసినట్లు మీలో నెవ్వరైన నెఱుంగుదురా? నే నెవరియొక్క దాసత్వమును జేయనపుడు, మీ రేల దాసత్వము చేయుదురు? తను నెన్నఁడును ఎవరి యొక్కయు దాసుఁడుగాఁ జేసికొనని వాఁడు, ఇతరులను దాసులఁగాఁ జేయ యత్నించెనేని, కనీసము దాసులై యుండఁ జూచి సంతసించెనేని. వాని వంటి పాపియుఁ గపటవర్తనుఁడును మఱెవరు? గురువును నేను గాను; ఇతరులను దాసులను జేయ నేను యత్నింపలేదు. ఎల్లప్పుడు నన్నే నేన, శిక్షించితి; అనఁగా నేను శిక్షార్థిని; ఎల్లప్పుడును శిక్షింప సిద్ధుఁడనై యున్నాఁడను. నా దళమునందు ఏఁబది మంది యున్న నా యేఁబది మందియు నేఁబది ప్రకారములు. సత్యము సాక్షి; సూర్యచంద్రులు సాక్షులు; అధీనత్వ మిక్కడ లేదు. నూఱుమంది ఇక్కడకు వచ్చుచుందురేని, వారిలో నెవరికి వారే ప్రధానులు. ఎల్లవారును నా సమక్షమందు దీనిని స్వీకరించి తీఱవలయును, నేను గతించిపోయినను ఈ విషయము నెల్లవారును స్వీకరింతురు. దళములో నెల్లవాఁడును

స్వాధీనతలోనే జీవించుచున్నవాఁడు గాని, ఎవ్వఁడును అధీనతలో జీవించుటలేదు. నేను ఎవనిని గాని ఏదో యొక దానిలో వేసి మర్దింపఁ గోరను. ఎల్లవారిని స్వాధీనులనుగాఁ జూడ నిచ్ఛగింతును. ఎవరినైనను గురువుగఁ గాని, శాసనకర్తగఁ గాని గణింపుమని చెప్పను; కేవల మీశ్వరుఁడే గురువనియు, శాసనకర్త యనియు నే నెఱుఁగుదును. అధీనతాప్రియులగు వంచకు లెవ్వరైనను ఇక్కడఁ జాటుగఁ బ్రవేశించి యుండిరేని ఆ వంచకులను బయటికిఁ ద్రోలివేయుదును: తోలి తీఱుదును. అధీనుల దశ మిక్కడ లేదు. ఎవని మీఁద దశము యొక్క భార మున్నదో, ఆయన తానే యధీనుఁడు గానపుడు, తానే అధీనతను అనహ్యించునపుడు, దళమందలి యెవ్వరును అధీనులగుట సంభవింపదు. అంతేఅకు నాకొక విశేష భారమున్నది: వ్రతమున్నది. ఏదేని సుమతము నైనను గ్రుడ్డిగా ననుసరించుట నా కిష్టములేదు. నే నంధుఁడనై యంధులను నడుపను. స్వాధీనత్వము మహామంత్రము. స్వాధీనత్వ మింత దనుక వచ్చిన నది దాదాపు స్వేచ్ఛాచార మైనదందురా? స్వాధీనత పూర్ణతఁ జెందును; స్వేచ్ఛాచారము కాదు; ఎట్లన, నాకతల్లి నాకతండ్రిని మన్నించుట చేతనే, తల్లి దండ్రుల యధీనుఁడను గానైతిని. అందుచేతనే ధర్మములో సైతము స్వాధీనతా వ్రతమునే యవలంబించితిని. సంసారము యొక్క మాయను గోసి వేసికొని, కొందఱు తిరిగి బ్రాహ్మసమాజమందలి బంధువర్గమునకు దాసత్వముఁ జేసిరి. ఐహిక కీటకములు కాలేదు; కాని, ధర్మసమాజమునఁ జేరి యీ చిన్ని పుస్తకమును అభ్రాంతముగ భావించి దానికే కొంచె మించు మించుగ సంపూర్ణ దాసులైరి. ఈ నానా మాయల నుండి నేను నన్ను దూరమం దుంచుకొన్నాఁడను. ఒక పుస్తకమును

ఆ భ్రాంతముగ నే నేల తలంపవలయును? ఒక మనుష్యుని నే నేల యనుసరింపవలయును? మహా మాన్యుఁ డగు క్రీస్తు మహా మహిమాన్వితుఁ డగుఁ గాక! శ్రీ గౌరాంగునకును నా యావద్భక్తిని జూపుదును. కాని, వారిని జీవనాదర్శములుగఁ జేయను. అహంకారి వందువేని అనుము. దురాచారి వందువేని అదియును అనుము. కాని, ఏ మనుష్యు నైన జీవనాదర్శమని ఎన్నఁడును అనుకొనలేదు; ఇంక ననుకోను అనుకొనను. మనుష్యుఁడు పూర్ణాదర్శము కానేరఁడు. క్రీస్తుయొక్క ఆలోకనము ఎక్కడను వచ్చి చేరలేదో, ఈశ్వరుఁడు తానే ఆదర్శమై నిజాలోకనముచే నాస్థానమును ప్రకాశింపఁ జేయును. పూర్ణజ్ఞానము నిచ్చునట్టి పుస్తక మేదియును లేదు; ఇందుచేఁ బుస్తకమును ఆదర్శముగా స్వీకరింపలేదు. ఈశ్వర పుత్త్రులను నాకంటె నధికముగఁ బ్రేమించువా రెవ్వరున్నారు? అయినను, వారిని జీవనము యొక్క యాదర్శముగా భావించి ఈశ్వరుని అవమానింప నని నేనే యందును. బైబిలును, పురాణములను బ్రేమింపఁ బోయి నే నీశ్వరుని నవమానింపను. ఈశ్వర సాన్నిధ్యమునందె నే నుందును. స్వర్గములోఁ గాని, పృథివిమీఁదఁ గాని ఎవరియొక్క దాసుఁడను గాను. వ్యాఘ్రచర్మము నాకుఁ బ్రియము. "ఏకతంత్రి"* నాకుఁ బ్రియము. కాని, ఈ రెంటిమీఁద నాకు ఆసక్తి కలిగెనేని, వీనికి నేను దేవతాస్థానము నొసఁగినవాఁడ నగుదును. వీని నీదినమున, ఈదినముయొక్క ప్రయోజనము నిమిత్తమే గ్రహింతును. రేపు మఱల విసర్జింతును. ఈదిన ముపాసనా సమయము నందు వ్యాఘ్రచర్మము నాదరించితిని: రెండు ఘంటల తరువాత దానిని

* ఒకే తంతి గల వాద్యవిశేషము దీనిని సాధారణముగ బైరాగులు వాడుచుందురు.

ద్యజించితిని: అటు మీఁద దాని తలఁపే లేదు. బాహ్యవ్రత సాధనలయొక్క యు దాసుఁడను గాను. ఎంతమంది ధనమాయను వదలి వ్యాఘ్రచర్మపు మాయలోఁ బడిరో ఎవరికిఁ దెలియని విషయము? ఇందునకనియే యాత్మ సతతము జాగరూకమై యున్నది; ఎన్నఁడును ఏవస్తువుయొక్క నధీనము కాదు; ఏవస్తువు మీఁదను ఆసక్తి నుంపదు; పుష్పముల మీఁద నాసక్తి నుంపదు; కాషాయవస్త్రముమీఁద నాసక్తి నుంపదు; వ్యాఘ్రచర్మము మీఁద నాసక్తి నుంపదు. నాకు ఎప్పుడు దేనితోఁ బనియున్నదో, నే నప్పుడాపనిని దానిమూలముగా ముగించుకొని, కడపట మృదంగమా! సెలవిమ్ము; కాషాయవస్త్రమా! సెలవిమ్ము; వ్యాఘ్రచర్మమా! సెలవిమ్ము;— అందును. నాపని ముగిసిపోయినది; ఇంకను దాని నేల పెట్టుకొని కూర్చుందును? నన్నది యేమాత్రమును దాసుని జేయుటకు రాలేదు. అవసరము నాది; దానిది కాదు: అభీష్టమును సిద్ధింపఁజేసికొందును; సిద్ధించెనేని అది యిఁక నుండదు. దేనిమీఁదనైన నాసక్తి యున్నయెడల, వ్రతాదుల మీఁద రవ్వంతైన నాసక్తి యున్నయెడల, నేపరిమాణమున నాసక్తి యుండునో, ఆపరిమాణమున నరకాగ్ని జ్వలించును. నవవిధానములోఁ బ్రతివానికిని సంపూర్ణస్వాధీనతయే. గురువెవరు? బ్రహ్మసమాజమెవరు? నా బ్రహ్మదశ మేది? దేనిమీఁదను ఆసక్తి లేదు. వస్తు వేదో దానిని గ్రహింతును. అవసరము వచ్చినయెడలఁ బేరును సహితము పరిత్యజింపఁగలను; కాని వస్తువును మాత్రము ఎవ్విధమునను బరిత్యజింపఁ జాలను; తక్కిన యేపనినైనను జేయఁ గలుగుదును. ఇందుచేత నెవరితోను నాకుఁ గలయలేదు. దుఃఖముల పాలైతిని; కాని సుఖమును సైతము కావలసినంత యనుభవించితిని. గురుత్వము

గిరుత్సాము చేసితినేని సభ్యుల సంఖ్యను వృద్ధి చేయఁగలను. కాని యాపనిని జేయఁ జాలను. నాయందును, నా భ్రాతృవరుల యందును స్వాధీనతను సంపూర్ణ రూపమున స్థాపింపఁ గలుగునట్లు పరమేశ్వరుఁ డాశీర్వదించును గాక! ఇందువల్లను సభ్యుల సంఖ్య వృద్ధి యగును. కావలసిన దంతయు దీనివల్లనే సమకూడును. స్వర్గము నుండి స్వాధీన జీవగణముల మీఁదఁ బుష్పవర్షము కురియుచుండును; జనకుని సన్నిధానమున నందఱు వసింతురు; స్వేచ్ఛాచారులు కారు. ఒకవైపున నెంతపాపమును, ఎన్ని కుసంస్కార దుర్భ్రమలను అగపడునో, రెండవవైపునను ఎన్నిప్రకారములైన స్వేచ్ఛాచారములు, దంభములు, అహంకారము లున్నవో వాని నన్నిటిని కనుపఱుపుము. చివరకు నీ రెంటిమీఁదను స్వాధీనతాస్త్రమును బ్రయోగింపుము. మనము ఈశ్వరునకు అధీనులము; అందుచేతనే సంపూర్ణస్వాధీనులము.

ఓ దయామయా! ఓ స్వాధీనపురుషా! స్వాధీనత మహామంత్రము. ఎట్టి యాశ్చర్యకర మంత్రము! దయయుంచి నన్నీ మంత్రమున దీక్షితుని జేయుదువేని నా యొక్కయు నా సోదరుల యొక్కయు శుభమునకుఁ గాను మా యందఱిలోను స్వాధీనత్వ భావమును వృద్ధిఁ జెందింపుము! ఒకమూల పాప జ్వాలలోఁ బడిపోవుచుండ, దానిమీఁద దేశాచారము, కురుచి, భ్రమ—ఇవన్నియు నీ తనయుని బంధించి పడవైచెను; అందుపై మఱల నానా ప్రకారములైన యాసక్తులను మెడల మీఁద మోపినవి. హా! ఈశ్వరా! అవి నన్ను గొనిపైచు నేమో యని, క్రీతదాసుని జేసి యుందుకొను నేమో యని దురపిల్లుచున్నాను! అమ్మా! నేను నీ దాసత్వము చేయవలసియుండె! అందుకు మాఱు మఱియొకనిని సేవించుచున్నాను!

సంసారపరిభవము సేవించి సేవించి చచ్చిపోవుచున్నాను. మూఁపు మీఁద, మనస్సుమీఁద దుర్భరమైన దాసత్వ భార మున్నది. అధీనత్వము మనుష్యుని జితుకఁ గొట్టుచున్నది. హా! స్వాధీనతా ప్రదాతా! ఏడ నున్నాఁడవోయి! మనుష్యుఁడు ఇంత కష్టపడుచున్నాఁ డేల? అధీనత్వ భావముతో నాకిప్పుడు యుద్ధ మారంభ మగుఁ గాక! అమ్మా! శక్తిస్వరూపా! హుంకార రవముతో శత్రువులను దఱుమఁ గొట్టుము. ఇఁకఁ బరుని దాసత్వమును జేయను. అమ్మా! ఆనందమయీ! ఇఁకఁ బాప మున్న దిక్కునకు వెళ్ళను; రిపువరతంత్రుఁడ నిఁకఁ గాను. ఏది చేయుమందువో దానినే చేయుదును; ఎక్కడికి వెళ్ళుమందువో, అక్కడికే వెళ్ళుదును; దేనిని భుజింపుమందువో దానినే భుజింతును; దేనిని నిషేధింతువో దాని నెన్నఁడును దినను. ఎట్టి దురభ్యాసమునకును దాసత్వమును జేయను. "ఇంత ప్రేమించు నట్టి యా తల్లి యాదేశమును బాలింప లేదుగా? ఆమె మాటను ద్రోసి వైచితివిగా? ఆమె నవమానించు చున్నావు గా?" అని వివేకము మనస్సును బ్రబోధించునపుడు అతి బాధగా నుండును. అమ్మా! ఇప్పు డిప్పుడు గ్రహించుచున్నాను. అధీనతాదాసత్వము మహానరకము! నీ యీ పాపకి యగు తనయు నుద్ధరింపుము. ఇనుప గొలుసులను ద్రెంపివేయుము. బంధుమిత్రులను గలుపుకొని స్వాధీనపక్షినై రాయెగిరిపోదును. స్వర్గమునందలి వనములో స్వాధీనభావమున విహార మొనర్తును. స్వర్గఫలములను భక్షింతును. ఇఁక నధీనతాపంజరములో నుండకుందునుగాక! ఆకాశవిహారి యగు స్వాధీనపక్షి ఆకాశమున నెగురుఁ గాక! దయామయీ! దయ నలయింపుము. ఆశీర్వదింపుము. నీవు ప్రసాదించిన స్వాధీనతను సద్వినియోగము చేసికొని సుఖింతును గాక! తండ్రీ! నీ సన్నిధి నిదియ నా ప్రార్థన.

# షష్ఠాధ్యాయము.

## వివేకము.

భానువారము ౧౯ భాద్రము ౧౮౦౮ శకము.

అంతరంగమున నెద్దియైనను మాటాడెనేని సాధారణముగ లోకులు దానిని భూతముగ భావింతురు. ఏ పురుషుఁడు ప్రేతగ్రస్తుఁడయ్యెనో, ఆ పురుషుఁడు లోపలను వెలుపలను వాణిని వినుచుండును. ధర్మ జీవనము యొక్క యారంభము నుండి, అంతర్బాహ్యములయం దిట్టి వాణిని, ఇట్టి సంభాషణములను, అనేక పర్యాయములు వింటిని; అయినను దానిని ప్రేతవాణి యని యెన్నండును అనుకోలేదు; ఇఁక ముం దనుకొనఁ బోవుటయును లేదు. ఈ జీవనము నందు ఇది మఱియొక విశేషము. ఒకనిలో మఱియొకఁ డుండుననియు, ఒక జిహ్వలో రెండు జిహ్వ లుండుననియు, భిన్న భిన్నములగు స్వరములను విస్పష్టముగ విననగు ననియు, అనేక పర్యాయములు, అనేక సమయములందు, ధ్రువపడెను. మనుష్యుఁడు ముందు సంభాషించి, యనంతరము విచారమునకుఁ దొడంగును; విచారము చేసి ధర్మజ్ఞానముఁ బడసిన వాఁడగును. నేను ముందు భావన చేసిచేసి ధర్మమార్గమునకు వచ్చియుండలేదని మొట్టమొదటినుండియు వక్కాణించుచునే యున్నాను. కాని, "నేను" "నేను" అను దాని మధ్యమున "నీవు" "నీవు" అని సంబోధించు వాఁడు, నేను గానివాఁడు మఱియొకఁ డున్నాఁడని స్పష్టముగా గ్రహించువాఁడను; అతని మాట మీఁదనే ధర్మకార్యముల ననుష్ఠింపఁ జూతును; మఱియొకఁడు లోలోపల మాటాడుచుండు నను నీ పరీక్షిత సత్యము పలుమాఱు అనుభవమునకు వచ్చినది. కొందఱు కొంద ఱీయంతర్వాణిని వినరని

రముండుదును. దీనిని వినఁగ వినఁగ. కుసంస్కారము కలుగు ననియు, ఇది ప్రేతవాణి యనియు, దీనిఁ బట్టి పోయిన నమంగళ మగుననియు, అనేకు లనుకొనుచుందురు. ఇట్టి వాణిని వినువారిని ఉన్మత్తులలో గణింప వలయు ననువారును గొందఱున్నారు. కేవల మీ దేశములోనే గాక సకల దేశములలోను లోకుల కీయభిప్రాయము కలదు. నేను గాక మఱియొకఁడు నాలో నున్నాఁడని ఎవ్వఁడైనను అనెనేని పదిమంది కలసి సభచేసి అతనిని ఉన్మత్తులలో జమచేయుదురు. ఇది యున్మత్తుని వ్యాపారమైన నే నిట్టి యున్మాద గ్రస్తుఁడ నగుట కెంతయు నభిలషింతును. ఇది ధర్మోన్మత్తత;— పరిత్రాణోన్మత్తత. ఏలయన, దీనిని నేను భ్రాంతవాణి యనక బ్రహ్మవాణి యందును. ఈ వాణి విషయమై యొక యినుమంత యవిశ్వాసమైన నాకు లేదు. ఈ శబ్దమును వినినపుడెల్ల, ఈ యదృశ్య ప్రాణవిశిష్టపురుషుని పలుకులును, స్పష్టములైన స్వరములును, శ్రుతిగోచరమైనపుడెల్ల, ఈ శబ్దము మిత్రుల యొక్క శబ్దము కాదనియు, తల్లిదండ్రుల యొక్క శబ్దము కాదనియు, దార పుత్త్రుల యొక్క శబ్దము కాదనియు, నాది కాదనియు, పుస్తకములో నేర్చిన సత్యము కాదనియు, వెనుకటి మాట యేదియో స్మరణకు వచ్చుటయుఁ గాదనియు, కల్పనాదేవి సొగసైన రంగులతో మనోమధ్యమునఁ జిత్రించె ననుటయుఁ గాదనియు, గ్రహించితిని. ఏదో పాపము నుండి నివృత్తుఁడ నగుటకుఁ గాని, లేక, ఏదో సదనుష్ఠానము ననుష్ఠించుటకుఁ గాని ఆయనయే వశాక్రమించుచున్నాఁడు. ఏదో నూతన కార్యభారమును వహించుటకుఁ గాని, లేక ఏదో నూతన ప్రదేశమునకు వెళ్ళుటకుఁ గాని, ఆయనయే యాదేశించుచున్నాఁడు. ఏదో పాపమును

వినాశముఁ జేయుదుననియు, నేదో దురాచారము మీఁద ఖడ్గహస్తుఁడవు కమ్మనియు, నాయనయే వచించుచున్నాఁడు. ఈ యన్ని విషయముల నాలోచన మీఁద నిరూపణ చేయుచున్నానని కాని, నేను స్వయముగ నీ సకల కార్యములను జేయ యత్నించుచున్నానని కాని, నే నొక్క మాఱు ననుకొనను. తమలో నిట్టి శబ్దము వినఁబడిన లోకుల కేమని తోఁచునో స్వభావమున కిట్టి స్వభావము నిచ్చిన వాఁడే చెప్పఁ గలఁడు. బుద్ధి ప్రయత్నించి, ఎన్నో యుపాయముల నవలంబించి కూడ నీ వాణిని తరుమలేకపోయెను. "నే నొక ప్రధాన వ్యక్తిని; నేను దెలిసికొనుచున్నాను; నేను జేయుచున్నాను; నేను గ్రహించుచున్నాను. కష్టమున్న మార్గమును నేను వదలుచున్నాను; నా సత్కీర్తిని బది వేల మంది చెప్పుకొందురు." అను నిట్టి యాశలును, ఉద్దేశములును, అనేకులకుఁ గలుగుచుండును. కాని "నా విద్యాబుద్ధుల ననుసరించి యనేక కార్యములను జేసితిని; అయిన నీ కార్యములు నా కార్యములు కావు; ఈ భావములు నా భావములు కావు; మనసులో నిం కెవరి మాటలో వినఁబడుచున్నవి." అనియు ననేకులు స్వీకరింతురు. నాకు ఏ విధముగా నొక ప్రకృతియును, గొన్ని భావములును, ఉన్నవో, అలాగుననే ఆయనకును ఉన్నవి. నా కేప్రకారమునఁ గొన్ని సిద్ధాంతము లున్నవో, అదేప్రకారమున నాయనకును ఉన్నవి. ఒకటి జీవాత్మ; ఇంకొకటి పరమాత్మ. రెండును వేర్వేఱు. విశేష్యము ఒకటి; విశేషణములు రెండు. ఆత్మపదార్థములో రెండువిశేషణములును మిళితమైనవి. ఒకటి జీవము; ఇంకొకటి పరమము. ఆత్మలో జీవుఁడు మాటాడును; పరమమైనవాఁడు కూడ

నాత్మలోనె మాటాడును. ఇద్దఱి యొక్క రసనయు రసము నాస్వాదించును. ఇట్టిద్ద ఱున్నారను సంగతి యనేకులకు సాధన మీఁదఁ గాని తెలియదు. సద్వాక్కు లన్నియు నీశ్వరునివి ; ఇఁక మంద వచనములు, కుబుద్ధి, అసత్పరామర్శ, అవిద్య — ఇవన్నియు నావి. బాగుగ యోచించి చూచినఁ గల్యాణ మంతయు నీశ్వరుని దనియు, అమంగళ మంతయు నా దనియును, సుఖస్వస్థతలు ఆయన ప్రసాదములనియు, అసుఖదౌర్బల్యములు నావనియుఁ దేలును. మనోవిజ్ఞానప్రణాలి ననుసరించి యీవిధముగ స్థిరము చేసికొని, సాధనఁ జేసితి నేని, అసత్కార్యములకుఁ గాను లజ్జితుఁడ నగుదును ; సత్కార్యములకుఁ గా నీశ్వరునకు యశోగౌరవముల నర్పింతును. కొందఱి పక్షమున నిది ఉపార్జిత భావము ; ఉపార్జిత జ్ఞానమ్ము ; మఱికొందఱి కిట్టి ప్రకృతి స్వాభావికము. రెండు పక్షులు సదా యొక చెట్టు కొమ్మమీఁదఁ గూర్చుండి యున్నవి. రెండు పక్షుల యొక్క శరీరచ్ఛాయయు దాదాపుగ నొకటియే ; కంఠస్వరమును దగ్గఱ దగ్గఱ సమానమే. సాదృశ్యము నున్నది ; విభిన్నతయు నున్నది. స్వభావసిద్ధముగ నెవరి కీభావము తలఁపునకు వచ్చునో, ఎవరి కిట్టి స్వభావసిద్ధ జ్ఞానమున్నదో వారికి దైవవాణి యధికముగ వినఁబడును. ఇపు డేవిధమున వజ్రధ్వని యగుచున్నదో, ఇట్టి గంభీర రవముతో బ్రహ్మవాణి హృదయమునఁ జిందులు ద్రొక్కును. అనేకుల మనస్సు దుర్బలము ; అందుచే వారి సిద్ధాంతములును దుర్బలములు. ఈ సత్యమును ప్రార్థన చేసినమీఁదఁ బొందితిమని యొకప్పుడనుకొందురు ; పుస్తకములను జదివి, బుద్ధిని వినియోగించి యుపార్జించితి మని మఱియొకప్పు డనుకొందురు. ప్రార్థన చేసినందుచే భగవంతుఁడు

ప్రసాదించె నని యొకప్పు డందురు; దేవుఁడు లేఁడు, గీవుఁడు లేఁడని యింకొకప్పు డందురు. వినయము సాధన మూలమున సంపన్నమై నపుడు, శ్రేష్ఠములైన సత్యములన్నియును బుద్ధివలన నుపార్జితమైనవి కావనియు, ఉత్కృష్టభావము లన్నియును కల్పనాఫలములు కావనియును గ్రహింప నసమర్థుఁడగును. ఎక్కడ విశ్వాస ముజ్జ్వలమై యున్నదో, ఎక్కడ పురుషద్వయము యొక్క స్వరము విస్పష్టమై యున్నదో, అక్కడనే శుభ ఫలము లభింపనగును. "ఇది ఆయనది; ఇది నాది." యని స్పష్టముగాఁ దెలిసికొనుచున్నాను. "మద్యపానము చేయుము; సుఖవిలాసము లనుభవింపుము" అని నా యిచ్ఛ చెప్పుచున్నది; "నా పథము నవలంబింపుము; ఇందులో నీకు ఛిన్నవస్త్రములను ధరింపవలసిన కష్టమును గలుగవచ్చును; లేక సర్వత్యాగివై యుండవలసిన యవసరమును రావచ్చును; కాని నామాటను నమ్ముము; దీనివలననే నీకు మంగళ మగును," అని యింకొకవాణి చెప్పుచున్నది. "వైరాగ్యమున నాహారకష్ట మున్న" దని నా యుక్తి చెప్పుచున్నది. "నీ బుద్ధికిఁ దోఁచినటు వెళ్ళుటకు వీలు లేదు. నేను ఎప్పుడు చెప్పుచున్నానో అప్పుడు అంధకార మార్గమే శ్రేయము. సహస్ర యమదూత లున్నను ఆమార్గముననే వెళ్ళవలె" నని ఇంకొకయుక్తి చెప్పుచున్నది. ఈ యథమని జీవనములో నిట్టి పరీక్షావ్యాపారములు అనేకము లైనవి. ఎక్కడ నా బుద్ధి నిక్కి చూచుచున్నదో, అక్కడ —దైన్యము, నసస్వస్థత, తిరస్కారము, అవమానమును; రెండవవైపుననో "ఏమియు భయము లే" దని కేవల మొక్క పురుషుఁ డనుచున్నాఁడు. మనస్సేక నేమాటను వినలేదు. మనుష్యుని బుద్ధి భవిష్యదంధకారమునఁ బ్రవేశించి "ఇది నాకు శ్రేయోమార్గ" మని ఎట్లు చెప్పఁగలుగును? "నానా బాధలు

అప్పుడే ఆరంభమైనవి. ఇంకను నలుఁబది వత్సరములు బ్రతికి యుండవలయును గాఁబోలు! ఇన్నాళ్ళును 'బ్రతికి అంధకారమార్గమునఁ బ్రేతవాణిని విని నడతునా?" అని నే నేమాత్రమును సందేహింపలేనైతిని. ఎవఁడో యొక సత్పురుషుని యొక్క మాటలు అతి మధురముగను, విశ్వాసయోగ్యముగను అగపడుటచే ఆయననే అనుసరించితిని. నా మాటలను సుమంత్రణములుగఁ దలఁచితిని; సన్మిత్రుల వచనములను గూడఁ ద్రోసివేసితిని. లోపలి మెల్ల మెల్లని వాక్కులను విశ్వసించి "ప్రాణమున్నను, ప్రాణముపోయినను, ఆ నీ పదాశ్రయమునే పొందుదు" నంటిని. పలుమాఱు ఇందువల్లనే నా కుటుంబమును బరిత్యజింపవలసి వచ్చెను; బహుకష్టముల ముఖమునఁ బడవలసి వచ్చెను; ఆత్మీయులను సహ వదలవలసియు వచ్చెను. ఒకమాఱు ఆలోకమగును; అంధకారములోనికి వెళ్ళుమని తిరిగి యీశ్వరుఁడనును. "ఎప్పుడు భూతపు వాణి యందువో, అప్పుడే నీకు మృత్యు" వని యీశ్వరుఁడు భయపెట్టెను; అందుచే, "ఇది ప్రేతవాణి కాదు; ఇవి యదృశ్య భగవానుని వాక్కులు: ఎవఁడు జీవాత్మతో ఏకమై పోయెనో ఆయన మాట" లని విశ్వసించితిని. యోగసాధన చేసినకొలఁదిని, మనోవిజ్ఞాన మాలోచన చేసినకొలఁదిని, జీవుని ప్రాసాదము రెండంతస్తులదని గ్రహించితిని; క్రింద జీవుఁడు; పైన బ్రహ్మము. జీవవృక్షమున రెండు పక్షులున్నవి. చిన్న పక్షి యొకటి, జీవాత్మ; పెద్ద పక్షి యింకొకటి, పరమాత్మ. చిన్నతనము నుండియు దేనిని విశ్వసించుచు వచ్చితినో, అది యధ్యాత్మికము కాదనియు, దేనిని జీవుని జిహ్వ యందురో దానిని గోని చూచిన 'నందు రెండంశములఁ గందుననియు నాకు

ఘ్రీవమయ్యెను. ఒకటి వేదవేదాంతములను జెప్పును; ఇంకొకటి చాపుమాటలను జెప్పను. ఒకటి స్థూలరసన అసారవచనములఁ బలుకును; మఱియొకటి సూక్ష్మరసన "హరి, హరి" యనును. కర్ణమునకు బాధిర్యము గలిగిన "హరి, హరి" యని వినఁబడక "డబ్బు, డబ్బు" అని వినఁబడును. ప్రయత్నము చేయుము; సూక్ష్మరసన యొక్క మధుర వాణిని వింటివు. ఎవరింకను వినలేదో, వారికి విశ్వాస మేమాత్ర మున్నదో చెప్పఁ జాలను. ఈ పథమునఁ గష్టము నొందుచున్న వారికి, కష్టము దూరమగును. నా యీ విశ్వాసము నిప్పుడు హాస్యము చేసి చెదరఁ గొట్ట నెవ్వరి తరమును గాదు; ఇరువది సంవత్సరముల విశ్వాసమును గదల్చు సామర్థ్య మెవరికేని యుండుననని యనుకొనను. ఇద్దఱు పురుషుల స్వరమును మనమునుండి తొలఁగించి వేయ వీలులేదు. "నేను విద్య నభ్యసింతును; నేను ధనము నార్జింతును; నేను ధర్మసిద్ధాంతములు చేయుదును", అని యిట్లనుకొని శ్రేష్ఠులుగా నేరికిఁ గోరికయుండదు! కాని లోపల నింకొకఁ డున్నాఁడు; ఆయన యొద్దకు వెళ్ళఁగనే నేను దాసుఁడ నైపోదును; భృత్యుఁడనైపోదును; ఒక మహాసాగరము ముందు ఒక చిన్న జలాశయము వలె, ఒక చిన్న గుంట వలె నైపోదును; ప్రచండ మార్తాండుని ముందు ఒక చిన్న దీపము నైపోదును; ఒక సువిస్తృతమైన ప్రాసాదము ముందు ఒక చిన్న కుటీరము నైపోదును; నేను శ్రేష్ఠుఁడ నని యెట్లనుకొందును? "నేను గొంచెము ధనార్జనమునకు వెళ్ళుదును" అని ఇట్లనియు ననక ముందే "జాగ్రత్త! వెళ్ళవలదుసుమా!" యని మఱియొకఁడు డనెను. "ఈపని చేయవలదు; మంచివాండ్రు సైతము నిన్నుఁ బరిత్యజింతురు; నీకగు నవమానమునకు హద్దుండదు." అని వేయిమంది చెప్పుచుండిరి.

కాని లోపలి నిశ్శబ్దశాకున్కులు వారి సదోద్బోధను ఒక్కపెట్టున ఖండింపసాగెను. నలుదిక్కుల నుండియు నలుగురును మోహ జాలమును విస్తరింపసాగిరి; మవరాతుర్య యను శిలచే మూఁతవెట్టఁ జూచిరి; కాని, అందువల్లనను, ఆ గుడగుడ శబ్దము ఆఁగలేదు. పక లాశబ్దము వినఁబడసాగెను; రాత్రియందును ఆశబ్దము ఉత్తేజనము కలిగింప సాగెను. లోపలి గంభీర భావము ఇంకను వృద్ధి కాసాగెను. దురవస్థ కడు వృద్ధి యయ్యెను. నేను 'ఎడమ వైపుగా వెళ్ళుద మనుకొన్న నది కుడివైపుగా వెళ్ళుమనును. సుఖసంపదలకొఱకు నేనుఁ జూచుచున్న "అటు వల్లగా"దని యది యనును. నే నాలోకము నిమ్మన్న, నది యంధకారమును జూపును. మాఱు మాఱీ లోపలి పురుషుఁడు మాట్లాడుచుండును. అప్పీలు చేయఁదగు నున్నత న్యాయస్థానము తెలిచిరయే యున్నది; కొంచెమైనను సెలవు లేదు. "లోలోపల దీనినే స్వీకరింప వలయును; లేదేని సప్తశత భూతముల చేఁ జిక్కి నానా జ్వాలల ననుభవింపవలసి వచ్చును," అని భగవానుఁడు పలుకుచున్నాఁడు. సుఖము శాంతియు నాకిఁక దొరకనట్లు తోఁచుచున్నది; భూతములు నలువైపులఁ జేరి పీఁకికొని తినుచున్నంత యమబాధగా నున్నది. ఇట్టి విద్వాంసుఁడనై లోపలి యీ యొక్కని మాటమీఁద నడవనా? ఇట్టి శాస్త్రకారుని మాట వదలిపెట్టి, ఈయన మాట విననా? అంత మహాపండితుఁ డైన సాక్రెటీసు * ఈ భూతము మాట వినువాఁడు. ఆయన వంటి సువిద్వాంసుఁడు తన యాలోచనము వదలివేసి, ఈయన మాటమీఁద నడచుచుండెను. దైవవాణిని స్వబుద్ధివచనము లనుకొనుటకు

* ఈయన గ్రీసుదేశమందలి యాదిమతత్వశాస్త్రజ్ఞుఁడు. క్రీ. శకమునకుఁ బూర్వము నాల్గవశతాబ్దమున నివసించెను.

వీలు లేదు. ఎవ్వరైన నందురేని మోసమునఁ బడుదురు. ఈ విషయమున నా విచారణనిష్పత్తులు ఇంకొక ప్రకారమున నైనవి. సమస్త బ్రహ్మాండము రసాతలమును మీఁద వచ్చి పడినను, ఈ విశ్వాసమును వదలను. ఫలాఫలములను విచారించి విశ్వసింపలేదు; ఫలాఫలముల మీఁద విశ్వాసము ఆధారపడి యుండదు. పదిమంది ఇట్టి మార్గమునఁ బ్రవేశించి దుష్కార్యములఁ జేసిరని నే నీ పథమును వదలఁ జాలను. పదిమంది మోసముఁ జేసిరని నేను ధనమును వదలుదునా? అదెప్పుడు సంభవింపదు. అర్థాన్వేషణము చేయువారు చేయనే చేయుదురు. ఎవరో మృతి నొందిరని బ్రతికియున్న వా రందఱుఁ గూడ నీఁక బ్రతుకఁ బోరా యేమి? ఒకని మాటలలో అవిద్యయు, దుర్నీతియు, నింకొకని మాటలలో నానా శాస్త్రములును —ఇట్లు ప్రకాశిత మగుచున్నప్పుడు, "నేను" "భగవానుఁడు" అను ఇద్దఱు పురుషులను జూచుచున్నప్పుడు, ఆయిద్దఱును ఒకఁడని ఏల భావింతును? ఈశ్వరుని కీర్తిని నే నేల హరింతును? నా దోషము నీశ్వరుని మీఁద నేల యారోపింతును? వీనిచే మనుష్యుఁడు తన వచనములనే ఈశ్వరవాక్యములుగాఁ బ్రచురము చేయునని నీ వనవచ్చును. ఓయి మిత్రమా! "నీకుఁ గడుపార భుజింప నిచ్చ యుండెనేని నీ వీశ్వరముఖము నుండి యట్టి మాటలను వింటినని చాటుదువు. నీ దుష్కార్యములకును, నీ కోరికలకును సరిపోవునట్టుగ నానా వాక్యముల నీశ్వర ముఖమునుండి తెప్పింతువు." అని నీ వనవచ్చును. కాని ఎవఁడో వంచకుఁడు కావచ్చునని నేను ధర్మమును వదలఁజాలను; ఈ ఇరువది వత్సరములలోను ఎన్నిమాఱు లీ వాక్యములు వింటివి? ఎన్ని వాక్యములను వింటిని! ఒకమాఱును నాకు మోసము కలుగలేదు.

ఈ యిరువది వత్సరములలోను అనుతాపముఁ జెందవలసిన యవసరము నా కొకఁ్కమాఱును గలుగలేదు. జీవాత్మయును, బరమాత్మయును ఒకఁ్క పాత్రములో కలగలుపైనట్లు నేను బ్రత్యక్షముగాఁ జూచుచున్నాను. స్రష్టయొకఁ్కఁడును ఆకాశమందనియు, నేను మాత్రము ఒంటరిగాఁ బృథివి మీఁదఁ బడియున్నాననియు, ఎన్నఁడును దలంపను. నా హస్తము లోపల ఆయన హస్తమును, నా రసన లోపలను ఆయన రసనను, నా ప్రాణమధ్యమున అనంత ప్రాణవాయువును దర్శించుచున్నాను. నా విశ్వాస మీప్రకార మైన దగుటచేత, జిహ్వ కదలఁగనే రెండు జిహ్వలు కలసి పోవుచున్నది లేనిది చూతును. పాపుని జిహ్వ కదలుచుండెనేని కోసివేయ నిచ్ఛగింతును. "ఈశ్వర రసనా! నీవు చెప్పునది చెప్పు" మందును. దీనిని కల్పన యనువారి వచనములను పాటింపను. నాకు లేశమాత్రమును సందేహము లేదు; ఏమాత్రము సందేహ మున్నను వేదినుండి, చెప్పువాఁడను గాను. రెండుజిహ్వలు స్పష్టముగాఁ గనఁబడుచున్నపుడు నీ వేమందువు? నీవు జీవుఁడే బ్రహ్మ మందువా? రెండు న్యాయస్థానములును స్పష్టముగ నగుపడుచున్నవి. ఒక న్యాయస్థానపు నిష్పత్తి యడుగడునకు రెండవ న్యాయస్థానమునఁ జాణా మగుచున్నది. నీవు క్రింది న్యాయస్థానపు వాకుఁ్కలను బలుకుచున్నపుడే, ఉన్నత న్యాయస్థానమురొకఁ్క నిష్పత్తి నీ మాటలను జాణా ము చేయుచున్నది. కావున నేను ద్వైతవాదిని; న్యాయమూర్తుల నిద్దఱఁ జూచుచున్నాను. ఒక యాత్మ మఱియొక యాత్మను నడపుచున్నది. నేను మాటలాడినపుడు నామాటలు ఆత్మిక భావమున ఉచ్చారితమగును : జిహ్వ మాంసఖండమున లేదు. అట్లుగనే, ఆయన

మాటలాడినపుడు ఆయన మాటలును ఆత్మిక భావమున ఉచ్చారితమగును: జిహ్వా మాంసఖండమున లేదు. ఆత్మయొక్క వాణి, ఉరుములయొక్క గాని, ఇత్తడిలోహముయొక్క గాని ధ్వనివంటిది కాదు; నదియొక్క దడదడశబ్దము వంటిదియును గాదు; పక్షియొక్క సుస్వరమువంటిదియును గాదు; అయినను, అది యాశ్చర్యకరమును, అత్యంత మధురస్వరమును. ఏకర్ణమునకు నీవ్వడు శక్తి నిచ్చునో, ఆకర్ణము దానిని గుర్తింపఁ గలదు. నాకు బ్రహ్మవాణిలో నింకను విశ్వాసము కుదురును గాక! మీరును ఈ విశ్వాసమార్గము నవలంబించి మీ మీ పారత్రిక మంగళమునకై పాటుపడుదురు గాక!

"ఓయి దీనబంధూ! ఓ యంతరాత్మా! నా జీవనముయొక్క ఏభాగమున నీవు దాఁగియున్నావో నాకుఁ దెలియదు. లోపల నొక వేదము పఠింపఁ బడుచున్నట్లు, ఒక నూతన శాస్త్రపాఠము జరుగుచున్నట్లు చెవికి వినఁబడుచున్నది. చదువుచున్న వా రెవరో నాకుఁ దెలియదు. ఒక న్యాయపతి సర్వప్రధానుఁడై విచారించుచున్నవాఁడు; ఆయన న్యాయస్థాన మెక్కడనో నాకుఁ దెలియదు. నా యస్థులలో వసియించి కేవలము స్వరమూలమునఁ బరిచయము నిచ్చుచున్నావు. అంధకారమయమైన నా యాత్మలోపల నివసించి నీవు శబ్దముచేయుచున్నావు. పాడుపడ్డ యింటిలోఁ జప్పుఁడైన జనులు ఏవిధముగ భీతిల్లుదురో, అనేకసమయములందుఁ బ్రాణమధ్యమున నీ శబ్దమును వినిఅట్లే భీతిల్లవలసి వచ్చును హృదయము యొక్క యొక చీఁకటి సందునందు శబ్దము కాసాగెను; వినినంతనె యది ఏమై యుండునని భావించితిని. రుచి నేనుసరించి పోవ నన్ను నిషేధించుచున్న వా రెవరంటిని. "ఓహో! నా

భగవానుఁడే! ఇంక నెవరునుకా'' రంటిని. మదీశ్వరా! నీవు తరుమధ్యమున, సూర్యచంద్రులమధ్యమున దర్శనము నిచ్చితివి; తిరిగి నీతి విజ్ఞానమునందు దర్శనము నిచ్చియుంటివి. జగత్కౌశలమందు నీ వొక్క పురుషుఁడ వున్నావనియు, నీతివిధులందు నీ వుండి సదా మనుష్యుని జాగ్రదవస్థలో నుంపుదువనియుఁ, జెప్పెడు మనోవిజ్ఞానమును నేను మన్నింతును. ప్రాపంచికవిషయములలోఁ దిన్నఁగఁ బరిశీలింపక యున్నఁడైన నుదాసీనుఁడ నైతినేని, లోపలి వాణి ఇఁక నిద్రఁ బోనియ్యదు. ఏదేని యొక యన్యాయ కర్మములోనికి దిగఁ జూచుచున్నంతనే, ఎవరో వచ్చి యొక్క పెట్టునఁ జఱతురు. గృహములో నున్నను, విహారింపవెళ్ళినను, ఎక్కడకు వెళ్ళినను దైవవాణి చెవి నంటుకొనియే యున్నది. చెవి నూడఁ బెటికి వేసినను ఆశబ్దము వినఁబడును. తనువు భస్మమైనను ఆయగ్ని జ్వలించుచునే యుండును. ఏమి, నీవాణి! వేయి నదుల ధారాప్రవాహములు ఏక ధారలై యొక పర్వతముమీఁదఁ బడుచున్నట్లున్నయది! ఎవ్విధమునను ఆశబ్దమును మఱువఁజాలను. నీవాణిని నావాణిని ఒకటిచేయ నాకేమాత్రమును చేతఁగాదు. నీవాక్యము లెంత మధురములు! నీమాటలు విని నేనెప్పుడును గష్టములపాలు కాలేదే! ఎన్నఁడైనను దుమంత్రణముఁ బోధించి దాసునిచే నసత్కార్యమును జేయించియుంటివని నే నేమాత్రము ననలేను. ఎన్నివాక్యములను వినఁగలిగితినో అందఱి పరిశుద్ధియును అభ్రాంతసత్యదైవవాణియే. బ్రహ్మవాణిని గల్పనముఁ జేసికొని నే నెన్నఁడును భ్రమపడలేదు. ఒక్క దినమైనను అనుతాపము నొందు నవసరము రాలేదు. పట్టినప్పుడే నిన్ను సరిగాఁ

బట్టితిని; బ్రాహ్మణుఁడ నై నిన్నుఁ బొందినపుడు, నీ దర్శనానందమున లోకుల భయ మెక్కడ నున్నది? కల్పనా భయ మెక్కడ? ఇరువది వత్సరములు గా నీ వ్యవసాయమును నడపుచున్నాను; ఈ దాసుఁ డెప్పుడును క్షతిగ్రస్తుఁడు గాలేదు. ప్రతిపర్యాయమును లాభమే కలిగినది. శుభక్షణమున బ్రహ్మవాణిని పాటించితిని; అందువలన నిన్నినాళ్ళలో నింత సంచయము చేయఁగలిగితిని. తల్లీ! ఎంతమంది నీయాశ్రయమును బొందిరో వారందఱును బ్రహ్మవాణి నాశ్రయించునటుల ఆశీర్వదింపుము. అందఱును వదలివేసినను నీవాక్కుల ననుసరించిన నెంత సుఖము కలుగునో, ఎట్టి శాంతిధారలు వక్షమునఁ బడునో, దాని ననుభవించితిని. కాన, నా కుభావమును బరులకుమంత్రణమును విసర్జించి, తల్లీ! నీవు వచించు వాక్కులను విందునుగాక యని హస్తములను జోడించి ప్రార్థన చేయుచున్నాను. జననీ! నీ వేమి వచించుచున్నా వనియే, అందఱును జిజ్ఞాస చేయుదురు గాక! పృథివి యొక్క వేద నిశ్శబ్ద మగుఁ గాక! తల్లీ! నా యంతర్బాహ్యములఁ జేరి గుడగుడఁ బలుకుచుండుము: నీమాటలు నాకుఁ జక్కని యమృతము వలె నుండును; అన్యుల మాటలు విషమువలె నుండును. అడుగడుగునకు మాట్లాడుము. కృపామయీ! నీమాటల ననుసరించి పాపమును వధించునట్లును, శాంతిపుణ్యముల సంచయము చేయునట్లును, దీనుల మగు మ మ్మొక్కమా ఱాశీర్వదింపుము!



# సప్తమాధ్యాయము.

## భక్తిసంచారము.

భానువారము ౨౬ భాద్రము. ౧౮౦౮ శకము.

ఓయి పాఠకా! ఈ జీవనవేదము ఆశావేదము. ఓయి శ్రోతా! ఈ జీవనము యొక్క యనేక విషయములు ఆశా ప్రదములును, ఉత్సాహోత్తేజనములును. ఏలయన, నే నన్నియుఁ జేతఁ బట్టుకొని ఒకటి మాఱుగఁ బృథివిమీఁదికి రాలేదు గదా! సాధనోపార్జితసత్యముల విషయమై వినిన, హరినామము యొక్క గుణముచే నాయాస లబ్ధ సత్యసంబంధములోని పరీక్షిత వ్యాపారములను దెలిసికొనిన, నెవరి హృదయమున నాశ ఉద్దీపనము గాదు? ఈ జీవనము యొక్క దుర్బలవిభాగములును, అభావాంధకారముల యొక్క విభాగములును ఉన్నవి; దానిని వినిన, నతి నిరాశతోఁ గూడిన మనుజుని యంతఃకరణమందుఁ గూడ నాశ సంచరింప సాగును. సావధానచిత్తుఁడవై వినుము. ఈ జీవనమందుఁ బ్రథమమున భక్తి యుండినది గాదు; ప్రేమభావమును విశేషముగా నుండినది గాదు; అనురాగము మాత్రము కొంచె ముండెను. విశ్వాస ముండినది; వివేక ముండినది; వైరాగ్య ముండినది. మూఁటి యొక్కయుఁ బ్రథమాక్షరము "వ": జ్ఞప్తియుంచుకొనుట యతి సులభము, మూఁటిని జేతఁ బట్టుకొని యీ సాధకుఁడు ధర్మక్షేత్రమునఁ జరింప సాగెను. ఇంకను ఏ వేవి ప్రయోజనములో అవన్నియును గ్రమక్రమముగ రా సాగెను, తగిన కాలము నందు ఆనందములో సస్యము సంగ్రహము చేయఁ బడెను. విశ్వాసము, వివేకము, వైరాగ్యము మూఁడును శుష్క కఠోరములు. మూఁడును మంచి పదార్థము లైనమాట వాస్తవమే; ధర్మపు బజారులో నీ

మూఁటి యొక్క విలువను తక్కువ కాదు; అవస్థావిశేషమున నివసన్నయు దుష్ప్రాప్యములు. భాగ్యవశమున నీమూఁడును నాకు మొదటనే యుండెను. సత్ప్రవర్తనుఁడ నగుదును; దృఢమైన విశ్వాసమును గలిగియుందును; కఠోరుఁడనై యింద్రియముల నిగ్రహింతును; ఈశ్వరుని కొఱకై సమస్తమును బరిత్యజింతును; నను నీ సకల భావములును మనోమధ్యమున స్ఫురించుచుండెను. వివేకవైరాగ్యములు చాల పాయముగ నుండెను. వివేకవైరాగ్యములు రెండును సాధనలో సాయము లనుమాట మొదటి నుండియు గ్రహించితిని. ఏ జీవనము యొక్క యారంభ మింత కఠోరమో అక్కడ భక్తిరస మేలాగునఁ బొడకట్టును? అపుడు దాని ప్రత్యాశయు లేకుండెను; భక్తి యత్యంతావశ్యక మనియును అపుడు నాకు తోఁప లేదు. మాతృచరణకమలము లన నేమో నాకుఁ దెలియునది కాదు. వివేకము యొక్క వాని సన్నిధిని ప్రార్థన చేయువాఁడను. బంధులకును, అపరాధులకును, విరాగులకును, తపస్వులకును, ప్రభువగు నీశ్వరుని యొద్ద కాలము గడుపుద మనుకొంటిని. ఒక విశ్వాసి పరబ్రహ్మము మీఁదనే తన యావద్విశ్వాసమును స్థాపించి నను నీ క్రీడనే చూచువాఁడను. భక్తుని కేళిని జూడలేను. అపు డాకసమున సూర్య కిరణములే కాని, చంద్రజ్యోత్స్న కనఁబడ లేదు. వివేక మప్పుడు హృదయమును దగ్ధము చేయుచుండెను. కడుఁ బ్రకాశింపఁ జేయుచుండెను. "పాప మెట్టిదో రానిమ్ము! చూతము" అని పాపము ననువాఁడను. హృదయ మధ్యమునఁ గేవలము ప్రజ్వలితాగ్నియే ప్రకాశించునది. ప్రలోభనమును గూడఁ దృణీకరించువాఁడను. కాని, ఏ యానందము భక్తివల్ల నుత్పన్నమగునో, ఆయానందము హృదయమున నుండినది

కాదు. పుణ్యవంతుఁడనైన, జితేంద్రియుఁడనైన నెట్లుండునో అట్లుండెను. అది సంతోషము, అది తృప్తి, అది ఆనందము కాదు. ఆనందమయియొక్క పూజఁ జేయనిదే యానందము కలుగదు. వివేకముయొక్క రాజునకు భయభయములోఁ బ్రణామము లాచరించిన, సంతోషము కలుగును; భక్తితో నానందమయియగు జననియొక్క పూజ చేసిన నానందము కలుగును. ఇట్టి యవస్థ ఎవనికేని తటస్థించిన, “సోదరా! నిరాశ పడకుము; నిరాశపడకుము” అని ఆతని నుత్సాహపఱుతును. ధర్మము భయముతో నారంభమైన, భక్తిలోను, ఆనందములోను పరిణతమగును. ఈదినము కఠోర పరిశ్రమ చేసి జీవనమును జక్కఁబఱుచుకొనిన యెడ, రేపక్కడ భక్తి కుసుమము పుట్టఁగఁ జూతువు. ఆనందవాదుల మధ్య నే నొకఁడ నగుదు నను నాశ నాకుండినది గాదు. ఒక్కొక్క చోట మాననీయులగు బంధువరుల యొద్ద “బ్రహ్మానందుఁ” డను నామమును బడసితిని గాని, అంతఃకరణము దాని నామోదించునది గాదు; “నీవు దీనికిఁ దగినవాఁడవు గా”వని యంతఃకరణ మనునది. కఠోర భావములోఁ బడి,“ దీని విసర్జింపుము; దాని విసర్జింపుము; విసర్జింపుము; విసర్జింపుము; విసర్జింపుము; కేవలము నింద్రియములను నిగ్రహింపుము; కేవలము పరాక్రమమును బ్రకాశింపఁ జేయుము; విగ్రహార్చన శూన్యమైన ధర్మమును వెల్లడిచేయుము.” అనియే నాకు నేను చెప్పుకొనువాఁడను. శాంతిరసముయొక్క కాని, భక్తిరసముయొక్క కాని యాశ పుట్టలేదు; తల్లివంక నేవిధముగఁ జూడనగునో తెలియునది కాదు. కేవలము తండ్రిపేరఁ బెట్టి పిలుచువాఁడను; తల్లియొక్క యంతఃపురద్వార మప్పటికిఁ దెరువఁ బడి యుండలేదు. ఏమార్గమున

నెళ్ళినఁ దల్లిని సందర్శింప నగునో, ఎవరును జెప్పను లేదు. "జననీ సమాన కరైన పాలన * " అనుదానిని కేవల రూపక జ్ఞానముననే వినువాఁడను. భక్తి యొక్క వికాసము కాలేదు. జననీ యనఁగనే ప్రాణ మప్పు డొక్కమాఱుగ లేచిపోవునది గాదు; కొంచెమే యేడ్చువాఁడను. హృదయమున నప్పుడు కవిత్వధోరణి లేకుండెను. తుష్టితుడకు మాతృమందిరము నేలాగున స్థాపించితినో యాశ్చర్యము. అపుడు వివేక ప్రధానుఁడనే నైయుంటిని. ఆకాలమున బ్రాహ్మ లందఱును దాదాపు వివేక ప్రధానులే. ఒకని చరిత్రము పునరుత్పన్నమై తక్కిన యందఱ చరిత్రములోను ప్రకాశిత మయ్యెను. అయిదుగురు, పదుగురు, నూఱుమంది యువజనులలో విస్తృతమై పోయెను. శ్రీమృదంగము నామము వినఁబడలేదు; శ్రీహరి యని పిల్వ నేర్వలేదు; శ్రీమతి యానందమయిని దర్శింపలేదు. బ్రాహ్మ లప్పటికిని, శ్రీనాథుఁడు, శ్రీపతి యను పేర్ల నీశ్వరున కిడలేదు. అపుడు బ్రహ్మ పితయై యుండెడి వాఁడు; ఆనందమయి యొక్క మందిరము కట్టఁబడలేదు. మృదంగము శబ్దింప లేదు; ఒక్క సంకీర్తనమును అల్లఁబడలేదు. అంతరంగము నుండిన యీ యభావమునకుఁ దగ్గట్టుగనే బాహ్యమందును ఏదియు సాయము దొరకలేదు. అంతర్బాహ్యములను గేవలము వివేక విశ్వాస వైరాగ్య సాధనలే మెఱయుచుండెను; ప్రేమ అల్ప పరిమాణముగ నుండెను. మరుభూమి యందలి యిసుక రేణువులు ఎగురసాగెను; ఇట్లెన్నాళ్ళని గడువఁ గలదు? "ఇది సరికాదు; అనేక దినము లిట్లు గడుపఁ బడినవి. ఇఁకఁ గడువ" దని యపుడు తెలిసికొంటిని.

* ఇది యొక చిన్న కీర్తన. "తల్లిసమానముగఁ బాలించు" నని దీని యర్థము.

మృదంగమును గొనవలయునని తోఁచెను. అంతరంగమున వైష్ణవ భావ మంతగా నుండ నన్ని దినములును, ఈశ్వరుఁడు కేవలము వివేక ద్వారముననే పరిచయము నిచ్చువాఁడు. భక్తి భావ మగపడి యగపడక ముందే ఎవఁడో కాని యంతరము నుండి యత్యాశ్చర్యకరముగ గుప్తభావమున రసవను భక్తి దేవత వైపునకు లాగివేసెను. పరివర్తన మయ్యెను; ఏది యుండదో వానిని సహా పొంద నగునని గ్రహించితిని. ఇపుడు భక్తి యాధికముగ నున్నదో, వివేక మధికముగ నున్నదో, ఆనంద మధికముగ నున్నదో తప స్సధికముగ నున్నదో, సుఖ మధికముగ నున్నదో, ధర్మసాధన యధికముగ నున్నదో, చెప్ప వీలు లేనంత భక్తి పొడమునది. నేను బ్రహ్మ సమాజ ములోనుండి నన్నుఁ గఠోరునిఁ,శుష్కునిఁ జేసికొనలేదు; శాంతిని, ఆనందమును దెచ్చి వివేకము యొక్క పార్శ్వమున నుంచితిని. ఇపుడు తారతమ్యమును నిర్ణయింప నా కశక్యము. భక్తి నాకు స్వాభావిక మనుపించునంతభక్తినాకిపుడు లభించినది. ప్రథమమున శుష్కభావమునఁ గేవలము పుణ్యసాధననే యారంభించితిని. ఎట్లు సచ్చరిత్రుఁడ నగుదునాయని, ఎట్లు చక్కఁగఁ బ్రవర్తింతునా యని, ఎట్లు సర్వత్యాగినై బడుగు సన్యాసి నగుదునాయనియే భావించువాఁడను. భగవానునితో నామోదంప నిచ్ఛ యుండునది కాదు. మౌనావలంబినై కూడ నుండవలని వచ్చె ననియును ఇందునకుఁ బూర్వము చెప్పఁబడెను. "స్వభావమున మున్నదియె పరిణమిల్లును; ఏది యుండదో యది కలుగ వీలు లే"దని యనేక పండితులమతము. "ఉపార్జిత ధర్మము కలలోని వార్త. ఎవరికి భక్తి లేదో వారికి భక్తి కలుగదు. ఎవరికి విశ్వాసము లేదో వారికి విశ్వాసము కలుగదు. ఎవరికి భక్తి స్వాభావికమో వారికే భక్తి

యధికమగును. ఎవరి ధర్మము భయముతోనే యారంభమగునో భయములోనే వారి ధర్మము 'పర్యవసన్నమగును.'' అని అనేకు లందురు. కాని నావిషయమున, “నేను వణఁకుచు వణఁకుచు ధర్మము నారంభించితిని; ఇపు డానందములో మగ్నుఁడనై యున్నా”నని చెప్పవలసి వచ్చినఁ జెప్పుదును. నా విషయమున నెట్లయ్యెనో, ఇట్లందఱ విషయమునను నగును. ప్రథమమున బ్రహ్మమును విశ్వసించి బ్రహ్మజ్ఞాని యను పేరు నందితిని; ఇపుడు లోలోపల సుఖభోగము ననుభవించుచున్నాను. ప్రథమమునఁ గఠోరము; పిమ్మట సుకోమలము. ప్రథమమున పిత; పిమ్మట మాత. బ్రహ్మము యొక్క ప్రస్ఫుటిత భావమును జీవనమందుఁ జూచితిని. నా జీవనములో బ్రహ్మ క్రీడింప సాగెను. మొదట బ్రహ్మనామ మొక్క నామమై యుండెను; ఇపుడు వస్తువు రూపాంతరమును జెంది ఎన్ని నామములను పొందినది! నే నెట్లు నా బ్రహ్మమును సందర్శించితినో, అటులే అందఱును సందర్శింతురు గాత మని కోరుదును. ఒకని విషయమున నసాధ్యము సాధ్యమైన నందఱ విషయముననను నగును గదా! శుష్క కఠోర భావ మధ్యమునఁ బడి ఏడ్చుచున్న నాఁ డిపుడు హసించుచున్నాఁడను సంవాదము నందఱు ఎఱిఁగియుండుట శ్రేయము. అల్పముగ నుండిన యీశ్వరజ్ఞానము అధిక మయ్యెను. హస్తములను జోడించి యీశ్వరు నాహ్వానము చేయుచుండ, నాయనే యాకర్షింప సాగెను. తల్లీ యని పిలుచుట నేర్చితిని. అంతియ కాక, ఆ “తల్లీ'' యను పేరులో నెన్ని రూపములను దర్శించితిని! ఎన్ని భావములఁ దల్లి నాహ్వానముఁ జేసితిని. ఒకప్పుడు శక్తితో సహ ఆనందమును సంయుక్తముఁ జేసితిని; ఒకప్పుడు జ్ఞానముతోఁ గూడఁ బ్రేమ యొక్క యోగమును

దర్శించితిని. జననీరూపములను నానా భావముల జననియే చూపుచున్నది. ఇంకను ఎన్ని భావముల రూపములు మనముందునకు వచ్చుచున్నవి! జననియొక్క సర్వరూపములను దర్శించితి నని ఎవరును అనకుందురు గాక! ఈ భక్తిశాస్త్రము నిపుడె మనము జూడ నారంభించితిమి. ఎంత భక్తుల మగుదుమో, ఆనంద మయి యొక్క రూపములను అంతగఁ జూడఁ గలుగుదుము. మనము స్వాభావికముగ దుర్బలుల మైనను నానా రూపములను దర్శించుటకు సమర్థుల మగుదుము. ఇవి ఉపార్జన దినములు. మనకు నిదివఱ కుండినది ఇపు డధికమయ్యెను; ఏది లేదో ఈ పట్టున దానిని గూడ సాధింపవలయును. ఈ దినము నాఁటి యుపదేశ మీ విషయముననే ఫలప్రద మగుఁగాక! నాకు లేకుండినది ఇపుడు వచ్చినది. ఒకప్పుడు భక్తి భావము లేకుండెను; గానము చేయుట యొకప్పుడు నా యెడ సంపూర్ణాసంభవ మైయుండెను. పది మంది సమక్షమున నేను గానము చేయుదు నని యొకప్పుడును అనుకొన లేదు; ఎన్నఁడైన నీశ్వరుని "అమ్మా" యని పిలుతు ననియును ఎఱుఁగను. జననిని జూచి యిపుడు ఉన్మాదినై పోదునని తోఁచుచున్నది. ఎవరు నా జననిని "జననీ" యని పిలువ లేకున్నారో వారికి బ్రహ్మదర్శనము బాగుగఁ గాలేదు. ఎవరు నా జననిని దర్శింప లేదో వారి కింక నేమియు నొనఁగూడ లేదు. అందఱ గృహములకు నీ జనని వెళ్లును. భారతము నందలి లక్ష లక్ష లోకుల గృహములకు జనని నిశ్చయముగ వెళ్లు నని నే నిపుడు నొక్కి చెప్పఁగలను. ఒకచోట ఘటించినది అన్నిచోట్లను ఘటించియే తీఱును. ప్రేమ లేదా? ఇంగ్లీషు పుస్తకములను జదువుటచే నందఱ మనస్సులును శుష్కములై పోయినవా? ప్రేమ

పుట్టదా? అట్లెప్పటికిని గాదు; నా దుర్దినములు పోయినపుడు మీ దుర్దినములును పోవును. సుదినములు రానే వచ్చును; అభక్తులకును ఆశ యున్నది. నా యాశయు భక్తియు నింకను వృద్ధిఁ జెందును గాక! నేను గొంచెము ఉన్మాది నైతిని; ఇంకను ఉన్మాది నగుదును గాక! పృథివికి అత్యసహ్యమని తోఁచునంత యున్మత్తతయు, భక్తిభావమును నాకుఁ గలుగును గాక! పృథివి యింకను నిందించునట్లు నానాశ్చర్యభావములును నా యం దతి శీఘ్రముగ వర్ధితములగుఁ గాక! వాని నన్నిటి తోను జీవనమును గడపఁ గలిగిన బ్రతుకుదును. ఇట్టి శుష్కత్వమునకుఁ బరివర్తనముగా భక్తి పొడసూపెనా? ఇట్టి జననిని నేను సందర్శించితినా? నా మనసులో భక్తిభావము పుట్టినపుడే, తమ మనసులలో భక్తి పొడకట్టినట్టి భక్తు లుండిరి. కాని వారు మృదంగము నేల తేలేదు? వారు ప్రథమముననే సంకీర్తనము నేల చేయలేదు? జననీ మందరమును వా రేల యలంకరింపలేదు? ఒక యభక్తుఁడు జననిని జూచి నృత్యము చేసిన, గానము చేసిన, లోకుల హృదయములలో శుభబుద్ధియు, జ్ఞానమును చటుక్కున తోఁచును. "ఏమి! ఈయన భక్తిమాట చెప్పుచున్నాఁడా? ఈయన వివేకమును చేతఁ బుచ్చుకొని దేశ దేశములు తిరుగువాఁడు గాని, భక్తిమార్గము నెన్నఁడును బట్టలేదే! ఈయన యేల మృదంగమును సహా వాయించుచున్నాఁడు? అట్లయిన హరియె యవతరించును గాఁబోలు! 'బ్రహ్మకృపాహి కేవల' మను మాట ప్రమాణమగును గాఁబోలు" నని లోకు లందురు. ఈ ప్రకార మందఱును భక్తిమార్గమునకుఁ దిరుగుదు రనియే యిట్లయ్యెను. అంతయు నీశ్వరకేళియని భక్తిలో మునిఁగి చూచితిని. ప్రాచీనభక్తులు కొంచెము సహాయమును జేయఁ గలిగి యుండు వారు

నా కెవరును ఏమియును చెప్పలేదు. ఓ యీశ్వరా! రక్షింపుము; రక్షింపుము. "ఓ భగవానుఁడా! బ్రతికింపు" మనుచుండఁగనే దినములు గడచుచుండెను గాని, శీఘ్రముగ భక్తిమార్గము నావిష్కరింపుమని మాత్రము నా కెవరును జెప్పలేదు. కేవల మొకఁడు మాత్రము చెప్పెను. ఎవరు చెప్పవలయునో ఆయనయే చెప్పెను. "సాహారా *" మధ్యఁ గమల ముద్భవించెను. రాతినేలమీఁదఁ బ్రేమపుష్పము ప్రస్ఫుటితమయ్యెను. ప్రార్థనాబలమున సకలమును కాఁగలదు. అభావమంతయు ముక్తమగును. ఇపుడు నాకు జలము స్థలము నుభయమును నున్నవి. విశ్వాస హిమాలయము నున్నది; భక్తిసరోవరము నున్నది. వైరాగ్యమున్నట్లే ప్రేమయునున్నది. జనని నన్నొక చేతితో వైరాగ్యమును దినిపించును; ఇంకొక చేతితోఁ బ్రేమను దినిపించును. రెండుహస్తములతోను ఊరక తినిపించుచున్నది; శ్రీహరి మహాత్ముఁ డయ్యెను; భక్తిసరోవరమును విస్తీర్ణము చేసి సుఖమును ఆనందమును వృద్ధిచేసెను.

ఓ దీనశరణ్యా! ఓ కృపాసింధూ! నీప్రేమ యపారము. నీ కారుణ్య లీల లద్భుతములు. ప్రథమమున ని న్నేవిధముగఁ గంటిని! అప్పు డెట్టి భయానక రూపమును దర్శించితిని! ఇప్పు డన్నో సుఖపుష్పములు హృదయసరోవరమునఁ దేలియాడుచున్నవి! ఎట్లు నీ విట్టి సుందర రూపమును గనుపఱిచితివి? ఈ రూప మెక్కడ దాఁగియుండెను? ఏమార్గముఁ బట్టి వచ్చెను? మిత్రులకు ఆశానందవాదమును దెలిపితిని. ఇప్పుడు నా కెవ్విధముననైన నీ

---

* ఆఫ్రికాఖండమ్మున భూమధ్యరేఖకు (Equator) పైగా నుండు నాక విస్తీర్ణ మరుభూమి.

యానందమును బొందునట్లు చూడుము. ఏమార్గమును బట్టుకొని, ఏ శుష్కసికతాప్రదేశముల మధ్యగుండ, ఏ కొండయంచుననే ప్రయాణము చేసిచేసి, తుద కీభక్తి సరోవరతీరమునకు వచ్చిచేరితినో సరిగ నిర్ణయించి చెప్పలేను; గ్రామములను గుర్తిందుచు రాలేదు. అందువలననే, "ఈమార్గమున వెళ్ళిన భక్తి యుద్భవించును; మృదంగమును వాయింపుము; లేక ఆమార్గమును బట్టుకొనుము; లేక నృత్యముచేసిన బాగగు"నని ఇవ్విధమున నెవ్వరికిని జెప్పలేకున్నాను. ఏమియును స్మరణలో లేదు; అజ్ఞానమే లేదు. ఒకప్పుడున్నది కాదు; ఇప్పుడు వచ్చినదని మాత్రమే స్మరణ యున్నది. ఒకప్పుడు నిన్ను అమ్మా యని పిల్వలేకుండువాఁడను; ఇప్పుడో ఇట్టి తల్లివి నీ వెచ్చట దాఁగియున్నావనుచున్నాను. బ్రాహ్మలలో నెవరికేని అశాంతి కలుగుచున్న నది నా తల్లివైన నిన్ను దర్శింపకుండుటచేతనే కలుగుచున్నది. నిన్ను దర్శించిన యెడల దుఃఖరజని యంతము నొందెను. ఆనందమయియగు నాతల్లిని ఎవరెవరు చూచిరి? ఎవరు చూచిరో వారిని నా సఖులందును; ఆలింగనముఁ జేయుదును; వారు వారు బంధువులగుదురు; వారు నా కందఱికంటె శ్రేష్ఠులు. అమ్మా! ఇట్టి మిత్రులను నాకిమ్ము! బ్రహ్మ బ్రహ్మయని పెద్దపెట్టున నఱచిన నేమగును? ఇప్పుడొక ముగ్గురకైనఁ గలియుదు; అయిదుగురిలోను మిళనము లేదు. ఇట్టి జననిని అందఱును స్వీకరించిన గభీరప్రేమ యొక్క మిళన మగును. ఇఁక మతశాఖోపశాఖలయొక్క భేదముగాని, వర్ణభేదముగాని యుండదు. ఒక్కతల్లిని దర్శించిన వివాదము లెన్నఁడును కలుగవు; విచ్ఛేద మెప్పుడును గలుగదు. నే నెవరిని "తల్లీ" యందునో మఱియొక్క రట్లనరు; నే నెవరిని "పరిత్రాత" యందునో మఱియొక రాయన యొద్ద పరిత్రాణము

నన్వేషింతురు ; ఇందుచేతనే ఇంతవివాదము ఇంతకష్టము, ఇంతక్లేశము. ఓయీ హరీ! నీ వెపుడును వివాదములఁ బుట్టింపవు. నృత్యము చేయువారిమధ్య వివాదము ఉండదు. తల్లి యుండఁగ వివాదములు ఘటిల్లునా? కరుణామయీ! ఏరాజ్యములో నృత్యమున్నదో, ఆరాజ్యమున వివాదము లుండునా? ఎప్పుడు నృత్యపుదినములు వచ్చును? ఆవార్తను దెలిపితిని; బంధుజనులు దాని సాధనచేయుదురో లేదో తెలియదు. తల్లీ! నిన్ను దర్శింపనన్నాళ్ళును, నాలుగు, ఆఱు, పది శాఖలు కానేయగును. కాని లక్షలక్ష వత్సరముల తరువాత శాఖోపశాఖ లుండనట్టి దినము వచ్చునని యెఱుఁగుదును. ఏమికఠోరము! అన్నాళ్ళు నిరీక్షించి యుండవలయునా? తల్లీ! ఆనందమయీ! ఏకొలఁదిమంది సోదరీసోదరులము ఈనవవిధానమున నిన్నుఁ బూజింప నుద్యమించితిమో, మేము నిన్నే పూజించునట్లును, ఇంకెవరిని బూజింపనట్లును, దయయుంచి గతిహీనుల మైన మా కీవరము నిత్తువు గదా! నే నెండాకులను బోగుచేయుచు పడియుండువాఁడను. నా కెట్టియాశ గలిగినది! ఆహా! జననీ! భక్తిలో మున్నఁడ నైతిని. ఇంకను మగ్నుని జేయుము. భారతము మగ్నమగును గాక! పృథివి మగ్నమగును గాక! భక్తిలో దేశము ఓలలాడుచుండఁ జూచి చత్తును. విగ్రహపూజ పోవుచుండఁ గాని, లేక బ్రహ్మజ్ఞానుల సంఖ్య వృద్ధియగుచుండఁగాని, చూచిన నంత సుఖము నాకుఁ గలుగదు. "అదిగో! జననిని పిలుచుచున్నా"రని వినిన మహాసుఖమగును. జననిని దర్శించి యందఱును నవనృత్యములో నృత్యము చేయుదురని ఆశయగుచున్నది. మేము కొలఁదిమంది సోదరులము ఎట్లుంటిమి? ఏట్లయితిమి? లోకులు పరిహసింతురను లజ్జను విసర్జించితిమి ;

ఈదినము కంపితభక్తి— ప్రగల్భభక్తి— మేరలేనిభక్తి— పిచ్చెత్తించుభక్తి— కలిగినది! ప్రేమమునో రాలుఁగను. నృత్యము ననుసరించిరామ నాటకము. తరువాత నేమగునో యెవరును జెప్పలేరు. తల్లీ! ఒక్కనివైపునకే యందఱ దృష్టియు మరలునుగాక! పంచహారులు మాకవసరము లేదు. అనేక మత దేవతలను, నలుఁబదివేల బ్రహ్మలను బూజించిన జగత్తునకు సుఖము కలుగదు. ఏకజననివైన నీవు మధ్య నిలఁబడుము. సమస్తభారతమును నీనలువైపుల నాట్యము చేయునుగాక! దయాసింధూ! మేము ప్రతిభాన్వితమగు భక్తితో నాట్యము చేసి చేసి ప్రమత్తుల మగుదుముగాక! ఓయి యనాథనాథా! దయనుంచి మాకొకమాఱీ యాశీర్వాదము నిమ్ము!



# అష్టమాధ్యాయము.

## లజ్జ : భయము.

భానువారము ౨ ఆశ్వయుజము ౧౮౦౪ శకము.

దుర్బలత్వము యొక్క పరిచయము నిచ్చినపుడు, జీవనము యొక్క పరస్పరవిరోధభావముల మాటయును చెప్పటుచితము. ఈజీవనములోనుండిన యభావమును గుఱించి చెప్పితిని; ఆయభావ మీశ్వరప్రసాదమువలనఁ దిరోహితమైనసంగతియును మీరువింటిరి. ఈజీవనములో రెండుభావముల యొక్క విరోధము గనబడెను. ఆకర్ణింపుఁడు. ఆవిరోధము యొక్క సమన్వయశాంతిని యథాసమయముగా జీవనమున ననుభవించుచున్నానని తెలిసికొనుఁడు. ఈజీవనమున ననేకదినములనుండి లజ్జాభయములకు దాసుఁడనై యుండవలసి వచ్చినది. తక్కినరిపువులవలెనే లజ్జయుభయమును నుపద్రవమును గలిగించుచున్నవి; ఇంకను నాయుపద్రవము పోలేదు. కావలయునని ఆదరించి నేను లజ్జాభయములను ప్రభువులుగా స్వీకరింపలేదు. లజ్జాభయములు సాధుసజ్జనులకు శత్రువులు. సకలపాశములు ఛిన్నములైనట్లే, ఈపాశములును ఛిన్నములగును. సాధనయొక్క యభావముచేతఁ గానిమ్ము, లేక స్వాభావిక దౌర్బల్యమువలనఁ గానిమ్ము, లజ్జయును భయమును ఇప్పటికిని నాయందున్నవి. ప్రయత్నించికూడ నీరెంటిని వదలలేకున్నాను. అడుగడుగునకు నీరెండును ప్రత్యక్షమగును; వీనియొక్క యధికారములోఁ బడియున్నానని తోఁచుచున్నది. లజ్జాభయములయొక్క క్షేత్రము వేఱు. శ్రీహరి లజ్జాభయములను ధర్మభూమినుండి సెలవిచ్చిపంపించి, వానిని సంసారమునందుంచెను. క్రమముగ

ధర్మప్రతాపమును విస్తరింపఁజేసినకొలఁదిని, వివేకము ప్రబలమైన కొలఁదిని, ఉపాసనాప్రార్థనలవలన హరిభక్తి వృద్ధియైనకొలఁదిని, విశ్వాసతేజములు అధికమైనకొలఁదిని. ధర్మరాజ్యములో నన్ను భయపెట్టఁగలిగిన తావులే నట్లు తోఁచెను. మనుష్యుఁడు వ్యర్థుఁడని ఈశ్వరప్రసాదమువలన జీవనముయొక్క ప్రాతఃకాలముననె గ్రహించితిని. విశ్వాసము వృద్ధియైనకొలఁదిని ధర్మసంబంధమున లజ్జాభయములు, తగ్గెను. జనములో నిప్పుడును లజ్జాభయములున్నవి; కాని అవియున్నది పృథివీతలమున. ఎక్కడ నీశ్వరాదేశము వినఁబడదో, ఎక్కడ నిదినాకర్తవ్యమని గ్రహింపలేనో, అక్కడ పురాతనులైన యీయిద్దఱుప్రభువులును జీవనమును తమవైపునకు లాగివేసి తీసికొనిపోదురు. అట్టి యవస్థయందుఁ బడిన ముఖకాంతి తప్పను; పదిమందిమధ్యకు వెళ్ళుటకుఁగాని, లేక వారితో సంభాషించుటకుఁగాని సిగ్గనిపించును; భయమగును. అనేకసమయములయందు దీమస్తకము సాహసముతో ఉత్థితమై యీశ్వరునినామమును గీర్తనచేయును; కాని యదియె మఱల నతిసామాన్యులగు మనుష్యులముందు వంగిపోవును. పృథివిమీఁదికి స్వాభావికదౌర్బల్యముతోను, లజ్జాస్వభావముతోను వచ్చితినిగాఁబోలును. లజ్జాభయములు పొడకట్టినన్నిమాఱులును లోలోపలఁ గష్టముతోఁచును. ఎవరినిజూచిన నాకుభయము? ఎవరిని హీనులని మూర్ఖులని యందురో, అట్టి త్రోవనుబోవు సామాన్యపుఁ గూలివాండ్రను జూచినను నాకుభయమే. గొప్పగొప్ప విద్వాంసులను జూచిన వారిమధ్యఁ బ్రవేశించుటకు సాహసమురాదు. "విద్వజ్జనులు సన్మానము నందునట్టి, ఇట్టి పెద్దదర్బారులోనికి నీవు రావీలులేదు. ఇక్కడ జ్ఞానముయొక్క విక్రమము. అంధకార మిక్కడకు

రావలనుపడ'' దని మనస్సనును. లోపల నేదేని యిట్టియాదేశమును వినుచుండుటలేదు; కాని విద్వాంసులసభలో వెనువెనుకనె యుండుటకై స్వభావము తనంతనె కోరును. ఎవరు ధనాఢ్యులో, ఎవరు లోకమునఁ గడునాదరము నందుదురో, ఎవరు సంపచ్ఛిఖరమున వసియింతురో, వారిమధ్యఁ బడినను సరిగ నిట్లే యగును. ధనమానములయొక్క యుజ్జ్వలపరిచ్ఛదము నెక్కడఁ జూతునో, అక్కడ స్వభావము తనంతనె సంకుచితమునొందును. ఈ యందఱను జూడ నిచ్ఛగలుగదు. ధనికులును, అభిమానులును, విద్వాంసులును, అగునీ మూఁడు తరగతులవారి యొద్దకును, మనస్సు సహజముగనే వెళ్ళలేదు; సహజముగనే వెళ్ళనిచ్ఛగింపదు. వెళ్ళుమని కర్తవ్యమనును; అందుచే వెళ్ళుదును. ఉపన్యాసము నిమ్మని కర్తవ్యము చెప్పును; అందుచే నిత్తును. ధర్మము నాదేశించునుగానఁ జేయఁగలుగుదును. ఆదేశ మెక్కడ వినరాదో యక్కడ నెంత యాలోచింతును! హస్తములు దుర్బలములగును; పాదములు నిస్తేజములగును; చక్షువులు తమంతనే మూసికొనిపోవును. అట్టివారి మధ్యఁ బడిన, "అహో! ఎక్కడికి వచ్చితిని! నే నీవీరినడుమ నుండుటకుఁ బనికిరానే!'' యనిపించును. మాట్లాడఁబోయిన వ్యాకరణపుదోషములు కలుగునని తోఁచును. శక్తి లేదు; ఎట్లుపోదును? శరీరము కాంతిఁదప్పును; ముఖము మలినమగును; తల వంగిపోవును. "ఎప్పుడు సభముగియునా; ఎప్పుడు సామాన్య మిత్రులయొద్దకు వెళ్ళికూర్చుందునా; ఎప్పుడు నామండలిలోనికి వెళ్ళిపడుదునా; ఎప్పుడు నిజగృహమునకు వెళ్ళి స్వభావముయొక్క స్వచ్ఛందతను పొందుదునా;'' యనియే తోఁచుచుండును. లజ్జ కష్టముకలుగఁజేయును. "వీరును మనుష్యులే; నేనును మనుష్యుఁడనే;

దోషములు వచ్చినప్పటికిని, ధనము, మానము, విద్య యున్న వన్నంత మాత్రమున క్షమింపరా? ప్రాణమును దీయఁగలుగుదురా? అవమానింతురా? మెడమీఁదఁ జేయివేసి యెవరైన నెట్టుదురా?" యని తలపోయుమనసును ఎవరైనఁ దరిమివేసినను వేయవచ్చును. "నీకుఁ జనువంతగా రాదు; విద్వాంసుల సహవాసము చేయుటకు నీవు తగవు. నీవు ధర్మోపదేశము నీయఁగలిగి యుండవచ్చును, గాని, ఎక్కడఁ బాండిత్యమునకుఁ దక్క మఱియొకదానికి నాదరము లేదో, అక్కడికి రా నీకధికారములే"దని. విద్వాంసు లనిన ననుసన్నను. ఇట్టి సకలస్థానములకును వెళ్ళలేదనిగాని, లేక తక్కువ వెళ్లితిననిగాని కాదు. పదిపర్యాయములు వెళ్ళియుంటిని; పదపర్యాయములును గౌరవమునందితిని; అయినను ఈ మాఱు ఏదేని దోషము కలుగవచ్చునుగదా! మహాలజ్జ! మహాభయము! జీవము నిలిచియుండుటకూడ సంశయమేమో యని తోఁచునంతటి భయము. ఎవరేని తోడనుండకుండ నొంటరిగ నింటిలోఁగూడఁ గూర్చుండుటకు సాహసము రాదు. ఒంటరిగ దేశభ్రమణములోఁ బ్రవృత్తుఁడనగుదు ననుచింత యుచితమని తోఁపదు. ఏదేని కార్యమును జేసిన నలుగురితోఁ గలసి చేయఁగోరుదును. ఎక్కడికేని వెళ్లవలసివచ్చినఁ బదిమందితోఁ గలసి వెళ్లఁగోరుదును. "సంసారములో నేకాకివై వెళ్ళవలదు; ధనికులయు, మాన్యులయు, మధ్యకు నొంటరిగ వెళ్ళకుము." ఎవరా మాటను జెప్పువారు? ఎవరువారు? బ్రహ్మవాణియా? కాదు; స్వభావము. "ఇట్టి ప్రకృతిఁగల మనుజుఁడు ఏకాకియై ఎక్కడికిని వెళ్ళఁగూడదు; ఇట్టివాఁడవుఁడు ఒంటరిగ నెక్కడికిని వెళ్ళుటుచితము కాదు." అని స్వభావమనును. స్వభావమునకది పనికిరాదు; తనవారెక్కడనో అక్కడనే

యుండఁజాలదను. విదేశమందుఁగాని, స్వదేశమందుఁగాని, ఏకాకియై పోవుట తటస్థించెనేని, తాను అసహాయుఁడను, నిరాశ్రయుఁడను నైపోతినని యనుకొనును. బంధుమిత్రులు ఏకాకులుగ నెన్నచోట్లకు వెళ్ళఁగఁజూచితిని ; అంధకారములోనికిని వెళ్ళుదురు ; కాని, ఈవ్యక్తి యింతధర్మసాహసము కలవాఁడైకూడఁ గొన్నికొన్ని విపత్తులమధ్యఁ బడిన భయపడును. ఏకాకియై వెళ్ళలేఁడు. ఏవ్యక్తి బ్రహ్మను విశ్వసించునో, అతనికి భయమేమి ? ఇది పృథివియొక్క శూన్యభాగముగదా ! ఈసకలస్థానములందును వ్యాఘ్రముముందు క్షుద్రశిశువులువలె భీతిల్లవలయును. ఇక్కడ నాక్రమణకారులగు శత్రువులు నలుదిక్కుల నున్నారు, మనస్సందుచే భీతిల్లును. ఎక్కడి విషయములలో ధర్మకథలేదో, ధర్మసంబంధములేదో, అక్కడనే, లజ్జయు ; అక్కడనే భయమును. ఉపాసనతో నెక్కడ సంబంధమున్నదో, అక్కడ నదికెట్లధికముగ భయకారణములున్నను, భయము పరుగెత్తిపోవును ; కాని, మఱియొకచోట "దూరమగుము, లజ్జా !" "దూరమగుము, భయమా !" యనినను పోవు. పదిమంది చూడవచ్చుచున్నట్లు కనఁబడఁగనే పలాయనమగుటకుఁ గోరిక పుట్టును. ఎట్లువ్వారలఁగూడ నడుగలేను ; వారిముఖమువైపునకుఁ జూడనులేను. వారు ముందుగమాటాడలేని, భయమెక్కువగును. తత్క్షణమే పరుగెత్తిపోయి, ఏపర్వతగుహలోనో దాఁగికొనఁజూతును. ఎంతెంతమంది గొప్పగొప్పవారు వత్తురు ; ఇక్కడనుండి లేచిపోలేనా యని చింతింతును. ఇంటికి ధర్మాసక్తులు వచ్చినఁగూడ మర్యాద చేయలేను. కొందఱుకొందఱు అహంకారి యనుకొని లేచిపోదురు ; ధార్మికులనై వైరాగ్యాభిమానముచే నుబ్బిపోతినందురు ; కటూక్తుల వచించుట వెనుదీయరు. నన్ను నేను సమర్థించుకొన్న నన్యాయ

మగును; కాని స్వభావమును ఘాతము చేసినను నేమియుఁ గాదు. ఈస్వాభావిక దౌర్బల్యము పోఁధనుకొనియెద. కొంచెము తగ్గినను, ఒక్కమాఱుగాఁ బోవుననుకొనను. "పోయినమాత్రము వచ్చున దేమి? విషయాసక్తులతో నుండలేనుగదా! వారితోఁ గలయుదుగదా! ధర్మసంబంధముగాక యన్యసంబంధమును గోరనుగదా!" యని మధ్యమధ్య యనిపించుచుండును. గర్వితుఁడు, దాంభికుఁడు, అహంకారి, అనుపేర్లను బొంద పడియున్నాను. ఏమి సేయను? పదుమందిలోఁ గూర్చున్నపుడు, ముఖవైఖరిఁ జూచితిరేని వీఁడు పరుగెత్తిపోవఁ జూచుచున్నాఁడని తెలిసికొందురు. బజారుపేరు చెప్పఁగనే పలాయనముగా నిచ్ఛపుట్టును. సంసారము నాముఖము వైపునకుఁ జూచెనేని దేహచ్ఛాయ పరివర్తితమగును. ఓసంసారమా! నీవు దృష్టినిడితివేని నాలోపలికంగుసహా మాఱిపోవును. నీవు నాలుగు మాటలఁ జెప్పుము. ఇఁక నేను నేనుగాను. కేవలము దేహమునుండి ఘర్మము నిర్గతమగును. శరీరము అవసన్నతఁ జెందును. అపుడు, ఇట్లొక్కింత సేపైనచోఁ జచ్చిపోదు ననుకొందును. కూర్చుండినవారు లేచిపోయిన బాగుండునని యనిపించిన యవస్థలలోను బడితిని. ఇఁకఁ జెప్పలేను. లోకులు మధ్యమధ్య నెన్నెన్ని కఠినపుమాటల ననిరి; నేను బాలకునివలెఁ గూర్చుండియున్నాను. నలుగురుదొరలు బంగాళీయునితో మాటాడవచ్చినపుడు దగ్గఱ నెవరైన నుండిన బాగు ఎవనికి లజ్జాభయము లింతయధికమో, అతఁడు పృథివియొక్క పథమున నొంటరిగఁ దిరుగఁగూడదు. ఇందుచే విశ్వసనీయుఁడైన మిత్రుఁడొకఁడు సర్వదా యవసరము; ధాత్రివలె దగ్గఱనుండుట శ్రేయము. ధర్మరాజ్యమున నీశ్వరకోరిక యుండును, సంసారమున ధాత్రియొక్కకాని, లేక మిత్రునియొక్కకాని కోరిక యుండును

ఉండనియెడ జరగదని యీవ్యక్తి బాగుగ గ్రహించెను. ఎవ్వఁడైన నాక్రమితుఁడు సంసారములో నావాఁడై మాట్లాడుచుండిన బాగుండునని యనిపించును. ఒకవైపున నీలజ్జయు, నీభయమును; కాని ఎక్కడధర్మమో యక్కడ సింహమువలెఁ దర్జనగర్జనములు. అక్కడ మనుష్యునకేమాత్రమును భయపడను. ఎన్నఁడును, ఏమనుష్యుని గౌరవమును నిలుపలేదు; నిలుపనులేను. నాధర్మమెక్కడ నిర్లజ్జితునిగాఁ జెప్పుచున్నదో, అక్కడ నృత్యము చేయఁగలను; తక్కిన చోట్లఁ జేయఁబోయినఁ బదివత్సరములు యత్నించికూడఁ జేయలేనని తోఁచుచున్నది. ఎక్కడ నీశ్వరుఁడో, యక్కడఁ బదిమందియును హీనుఁడు, నీచుఁడు అనునట్లు నాట్యము చేయఁగలను. అననిమ్ము; అందుకు సిద్ధము. కడునిర్లజ్జభావముతో ననేక కార్యములను జేసితిని. ఒకటితరువాత నొకటిచొప్పున ననేకములు చేయఁబడినవి. రాజబాటల, ఘట్టముల, సకలస్థలములయందును జేయఁబడెను. జనని ఆజ్ఞయిచ్చినపుడు, లజ్జయేమి? భయమేమి? ఇక్కడ లజ్జాభయములను శత్రువులుగా నెంచి ఖండఖండములుగాఁ జేయవలయును. పదిమందిముందు విరుద్ధసత్యమతమును బ్రచారము చేయవలసివచ్చిన నిర్లజ్జితుఁడనగుదును; భయమును ద్యజింతును. గొప్పగొప్పరాజులును, పెద్దయధికారులును ఉన్నప్పటికిని సత్యప్రచారము చేయుదును. కాని, మఱియొకవిషయమున నేల భయమగునో తెలియదు. ఒకస్థానమున నేదిసింహమో అది మఱియొకస్థానమున మేషశిశువు. సమయవిశేషముచే, స్థానవిశేషముచే భయానకమైన లజ్జయు, అత్యంతమైనభయమును గలుగును; అట్లుగనే మఱల సమయవిశేషముచే, స్థానవిశేషముచే భయానకమైన నిర్లజ్జయు అతిసాహసమును గలుగును.

ఓదీనబంధూ! ఓయపారకరుణాసింధూ! నీ వెవనితో నీక్రీడల సలుపుదువో, అతనిచరిత్రమునే అన్యులు గ్రహింపలేరు; అతఁడు తానే గ్రహింపలేఁడు. నేను లజ్జాభయములమధ్యఁ బడి యొకమాటీదిక్కునకు, నొకమాటాదిక్కునకుఁ జూచుచున్నాను. నేను పృథివినిఁ జూచి యింతభయపడుదునేల? ఎంతోమంది నిందించుచున్నారు; దోషారోపణఁ జేయుచున్నారు! లోకులవలన నీవ్యక్తి దురహంకారియని పరిగణింపఁబడెను. . నీయాశ్రితులకు మానసంభ్రమము నుంపవా? నిన్ను విశ్వసించినవాఁడు అహంకారియయ్యెనా? నీనియం దహంకారాభిమానములు లేవని నీవు చాటుచు సేయుచున్నావు; అది లజ్జాశీలము! పృథివియొక్క లోకులమధ్యఁ బడినపుడు నేనెట్లు సంకటములపాలగుదునో నీ వెఱుఁగుదువు! హృదయమున నెట్టిజడభావము కలుగునో నీ వెఱుఁగుదువు! ఆయవస్థ వర్ణనాతీతము! ఏమాత్రమును సంభాషణచేయలేను; లజ్జాభయములు పొడిచిపొడిచి చంపుచున్నవి. ఈజీవనములో నీ రెండుదుర్బలత్వములు నున్నవని బంధుమిత్రులు గ్రహించిరి. నేను నాపక్షమును సమర్థించుకొనఁబోవుటలేదు. నన్ను మంచివాఁడననిమ్ము; చెడ్డవాఁడననిమ్ము. ఆవైపు లక్ష్యముంచి జీవనవేదమును జెప్పుటలేదు. నాకు భయమున్నది; లజ్జయున్నది. కాని, నీయందాసక్తిగలిగిన హరిభక్తులెవరో, వారిముందు లజ్జయుండదు; ఏమాత్రము భయముకలుగదు. కొంచెముకలిగినను, అక్కడ నంతగాఁ బరిచయము కాలేదనియే. నావాండ్రముందు నేను సాహసినైన సింహమును. వారిముందు మనసువిప్పఁ గోరికపుట్టును. బయటివారు వచ్చినంతనే జిహ్వా జడమువలె యగును. తల్లీ! నాచరిత్రమును నీ వెఱుఁగుదువు. నాకు

సుఖ్యాతియుఁ, ప్రశంసయు నావశ్యకములు కావు. ఇందుచే నాకరిష్టము గలుగుచున్నదని విశ్వసింపను. పృథివి భయానకస్థానము; పృథివియొక్క బాజారులలోను, దుకాణములలోను, నే నెట్లు కార్యముల నానర్తును? కర్తవ్యము గాకున్నయెడల నాయన్నిస్థానములకుఁ బోను. సంసారముయొక్క అగ్నియందు నన్నుఁ బడఁద్రోయకుము. నీపాదపద్మములు నాకు బాగుగనుండును; మఱియు నీయనుగతులగు కొలఁదిమంది బంధుమిత్రులును బాగుగనుందురు. ప్రచారకునిఁ జేసితివి; వేలవేలకుండితో వర్తకసరణిని నడుపవలయును. వెళ్ళవలసినచోట్లకెల్ల బలియివ్వఁబడనున్న మేకవలె వణఁకుచు వణఁకుచు నెళుదును. వీఁడు దక్షుఁడు గాఁడని, నిపుణుఁడు గాఁడని నీ వెఱుఁగుదువు. ప్రతాపము నీదిగా, మహిమ నీదియు, ఇట్టిలజ్జాశీలుని నృత్యములోఁ బ్రవృత్తునిఁ జేసితివి; ధర్మములో సాహసునిఁ జేసితివి. ఎవనిస్వభావము లజ్జాభయములతోఁ గూడినదో, అతఁడుగూడ భీమరవముతో బ్రహ్మనామముఁ గీర్తనచేయుచున్నాఁడు. తల్లీ! నీవు లజ్జాహీనునకు లజ్జఁబుట్టింపఁగలవు; మఱియు, ఎవనికి లజ్జగలదో, అతని లజ్జను దూరముచేయఁగలవు; పృథివియొక్క బలవంతుని నీవు దుర్బలునిగఁ జేయఁగలవు; దుర్బలుని సబలునిఁ జేసి యాంతసింహంకారముతో నితరులను భీతిల్లఁ జేయఁగలవు. ఈదీను నెట్లు చేసితివి? లజ్జాశీలునకుఁ గూడ ధర్మములో లజ్జపోరాదనునది ఒకయాశయొక్క మాటగదా! అందుచే హస్తములను జోడించి, అందఱిసాహసము వృద్ధియగుఁ గాకని ప్రార్థింతును. ధర్మమునకుఁ గాను లజ్జ కలుగకుండును గాక! ధర్మమునకై మొండివాఁడు కావలయును. కాలమైనది. మహిమాన్వితముగు భక్తియొక్క గౌరవార్థమై, త్రోవత్రోవను సంపూర్ణముగ లజ్జాహీనుఁడనై తిరుగుదును. ఇపుడు

శుభసమయము వచ్చినది; ఇపుడు భయపడితినేని సకలవిధాననష్టము వాటిల్లును. నృత్యుచేయు సిద్ధుఁడనైతిని; ఇపుడు తలమీఁదిముసుగును దిగలాగను. లజ్జకుఁగాను ఆదేశము పాలింపమానలేను. మానావమానముల మధ్య సంపూర్ణముగ స్థిరుఁడనై శ్రీపాదపద్మములను సాధింపయత్నింతును. లోకులు లజ్జాశూన్యుఁడ వందురు; హీనుఁడవని యసహ్యించుకొందురు. నేనిపుడు కడుసౌఖ్యము ననుభవించుచున్నాను; అందుచే నిఁక మనుష్యముఖమును జూచి భీతిల్లుదననుకొనను. పృథివిమీఁద బాలకునివలె నసహాయుఁడనై యుండవచ్చునుగాని ధర్మరాజ్యములో సింహమువలె నగుదును. ఓతల్లీ! ఓజననీ! ధర్మరాజ్యములోఁ గిరీటమునిమ్ము. ప్రాణమున్నను, ప్రాణముపోయినను నీనామమును జయపెట్టవలయును. ఆశీర్వదింపుము. భక్తిలో నిర్లజ్జుఁడనగుదును. విశ్వాసములో సాహసికుఁడనగుదును. మఱియొక విషయమున లజ్జాభయములుండిన నంతచింత లేదు. కరుణామయీ! భక్తిలోను, విశ్వాసములోను నిర్లజ్జుఁడనై, సాహసినై, శుద్ధుఁడను, సుఖిని నగునట్లు కరుణయుంచి యాశీర్వదింపుము. తల్లీ! దయనుంచి యీప్రార్థన సఫలముఁజేయుము.



# నవమాధ్యాయము.



## యోగసంచారము.

భానువారము — ఆశ్వయుజము ౧౮౦౪ శకము.

భక్తి నాపక్షమున నెట్లుపార్జితమగునో, యోగమును అట్లే. ధర్మజీవనముయొక్క ఆరంభకాలమున యోగి నైయుండలేదు; యోగముయొక్క నామమును వినువాఁడనుగాను; యోగముసంగతి నెఱిఁగియుండలేదు; యోగముయొక్క లక్షణములను నిష్పన్నముచేయఁగలవాఁడను గాను; యోగపథమున నెప్పటికైన నడువవలసివచ్చునేమో యను నాలోచన కలుగలేదు. కడుపుణ్యవంతుఁడ నగుదును; సచ్చరిత్రుఁడ నగుదును; ఈశ్వరునియొక్క వాంఛితకార్యముల నెరవేర్తును;—ఇదియే ధర్మమనుకొంటిని; ఇదియే నాకర్తవ్యమనుకొంటిని. యోగినేల కావలయునో యోగియెవఁడో, యనునీ సకలచింతలయందును ప్రవృత్తుఁడ నగువాఁడను గాను; ఆవైపునకే వెళ్లువాఁడను గాను. యోగనుమాట యపుడు బ్రహ్మసమాజములోఁ బుట్టలేదు; యోగసాధనము బ్రాహ్మ్యునికిఁ గర్తవ్యమని, ఏపుస్తకములోను గననైతిని. పదిపదునైదుసంవత్సరములు, సత్యమును, ప్రేమను, వైరాగ్యమును సాధనచేయుచుంటిని; ఇందులోనె చాలఁగాల మతివాహితమయ్యెను. ఈశ్వరప్రసాదమువలనఁ దదకు నాహృదయమున భక్తిసంచరింపసాగెను. క్రమమున భక్తి ప్రమత్తతలోనికిఁ బరిణతమయ్యెను. భక్తి వృద్ధిగాసాగినపుడు, భక్తిని స్థిరపఱుచుటకుఁగాను యోగమావశ్యకమని గ్రహించితిని.

క్షణస్థాయియగు ప్రమత్తత జన్మింపవచ్చునుగాని యోగమువినా అది చిరకాలముండదు. ఈశ్వరునియందు విశ్వాసమురిడెనేని, ఈశ్వరునితో నైక్యమగుట యావశ్యకము. రెండుండునేల ? హృదయమెట్లు భక్తునిహృదయమో, నయనమట్లు యోగినయనము కావలయును. భక్తిమీఁదను, యోగముమీఁదను, ఈ యుభయము మీఁదను నాదృష్టి పడెను; సాధనమీఁద నిచ్ఛపుట్టెను. భక్తియోగములువినా బ్రాహ్మజీవనము ఎందునకును గొఱగానిదని తోఁచెను. భక్తియొక్క-రంగు పాడకట్టఁగనే శతసహస్రలోకులు ఆరంగులో అనురంజితులైరి; బ్రాహ్మసమాజమున భక్తియొక్క-రంగు విస్తృతమయ్యెను. భక్తియొక్క- యెఱుపురంగు ఎప్పుడు నాదయ్యెనో, అప్పుడు బంధుమిత్రులును మృదంగమును వాయించి, సంకీర్తనముచేసి ప్రేమాశ్రువులను విసర్జించుచు విసర్జించుచు, భావమున గద్గదులైరి. వారికి భక్తి అత్యంతముగఁ గలిగెను. యోగ మంత శీఘ్రముగఁ గాలేదు. యోగము కొంచెము కఠినము; సాధన కఠినము; మంత్రము కఠినము; స్వయముగ గ్రహించుటయుఁ గఠినము. ఈదినమువఱకును ఇది దుర్లభముగనేయున్నది. ఎవరీదుర్లభయోగమును సాధించిరో, వారు దీని నితరుల కీయలేరు. భక్తి యొక్క-నిదైనచేని, ఇఁకఁ బదిమందిదగును. యోగ మింత శీఘ్రముగ వ్యాపింపదు. ఒక్క- శతాబ్దములో కేవలము ఇద్దఱుముగ్గురుయోగులు మాత్రము కనఁబడుదురు. నేను యోగముయొక్క- పక్షపాతి నైతినిగాని, మనవారందఱును యోగముయొక్క- పక్షపాతులు కాలేదు. నాజీవనములోఁ గొంతలోపము కనఁబడినపుడు, యోగములేకుండ విశ్వాసము నిష్ఫలమనియు, భక్తిప్రేమవైరాగ్యములు ఎందునకుఁ

గా ఉన్నాననియు గ్రహించితిని. బ్రహ్మముతో ఏకమైపోలేని యెడల, మానవజన్మమునకు సఫలత్వము సిద్ధించదు. ఈసత్యమును గ్రహించి యోగమార్గమును త్రొక్కితిని. శాస్త్రములను జదివి ఈమార్గమునకు వచ్చితినా? లేదు. పుస్తకములను జదివియా? లోకుల యుపదేశములను వినియా? కాదు. దేనివలనను గాదు- ఏపుస్తకములలోను నేనప్పుడు యోగము మాటను జూడలేదు. మృదంగాకారమున భక్తిశాస్త్రము నానికటమునకు వచ్చినప్పుడు, మనుష్యులమాటలచే నేను భక్తిలో దీక్షితుఁడను గాలేదు. ఈశ్వరుని యొక్క ప్రసాదవారి భక్త్యాకారమున వచ్చెను. అట్లుగనే ఎక్కడినుండియో ఒక్క మహావాయువు వీచుచు, వీచుచు వచ్చి యోగమును నానికటమునకుఁ దెచ్చెను. ఒక్క దిక్కు వాయువు భక్తి నిచ్చెను; ఇంకొక దిక్కు వాయువు యోగమును దెచ్చెను. ఇవ్విధమున స్వర్గము యొక్క యిరుప్రాంతములనుండి రెండు వాయువులు ప్రసరించినవై, రెండుధనములను దెచ్చెను. హస్తగత మైనపిమ్మట దీనిని భక్తి యందురనియు, దీనిని యోగమందురనియు గ్రహింపఁగలిగితిని. భక్తి యోగమును సుమిష్టముఁ జేయును; యోగము భక్తిని శుద్ధముఁ జేయును. ఒకఁడు సోదరుఁడు; ఇంకొకతె సోదరి. ఒకఁడు పరిచర్యఁ జేసి భక్తిని విశ్వాసభూమిమీఁద దృఢముగఁ బ్రతిష్ఠించెను; ఇంకొకతె పరిచారికయై యోగమును రసయుక్తముగఁ జేసెను. ఒక్క యోగమేయైన నద్వైతవాదములోనికి దింపివేయునది; ఒక్క భక్తియేయైనఁ గుసంస్కారముల నుత్పన్నముఁ జేయునది. కాని యోగమును పర్వతముమీఁద భక్తియను సుద్యానవన మేర్పడెను. ఆవనము స్వప్నవనము గాదు; కల్పనావనము గాదు; ఏలయన నది,

సుద్భూధముగ పర్వతముమీఁదఁ బ్రతిష్ఠింపఁబడియున్నది. యోగము భక్తియోగము నను రెండుయోగములును గలియుటచే మహాయోగమయ్యెను; ఆమహాయోగము ఫలించెను. ఈదేశమున నేను భాగ్యవంతుఁడ ననుకొంటిని ; ఏలయన ననేకులు కఠోరయోగమధ్యమునఁ బడి, భయానకమైన యద్వైతవాదసాగరమునందు మునింగిపోయిరి. భక్తియొక్క యుచ్ఛ్వాసమున మత్తులై యనేకులు కుసంస్కారులపాలైరి. నేను రెండుదిక్కులను బంధించితిని. నాభక్తి యోగమునవలంబించి యుండునది. యోగముచే నయనములు పరిష్కృతములయ్యెను; భక్తిచే హృదయము పొంగెను. ఒకచక్షువు యోగమది; మఱియొకచక్షువు భక్తియది. ఈశ్వరుఁడు నన్ను భాగ్యవంతునిఁజేసెను. రెండుచక్షువులను సంపూర్ణముగాఁ దెఱచి ఒకచక్షువుతో యోగీశ్వరునిఁ జూచితిని; మఱియొకచక్షువుతో భక్తియొక్క యీశ్వరుని దర్శించితిని. కాష్ఠములలోను ఫలములలోను పుష్పములలోను సూర్యచంద్రులలోను వాయ్వగ్నులలోను, జలములోను సారబ్రహ్మవస్తువును దర్శించితిని ; మఱియొకచక్షువుతోఁ గాష్ఠాగ్నులమధ్య నెవ్వనిదర్శించితినో, ఆయనయే హరిగదాయుని, ఆయనయే యత్యంతసుందరాకారు గదాయుని ప్రత్యక్షముగ ననుభవించితిని. ఎవనియొక్క యాగంభము సత్యమో, ఆయనయే సుందరుఁడు. సత్యశివసుందరుఁ డెవఁడో, ఆయనను జూచిన నానందమగునది; ఈదర్శనమువలన జీవనమునఁ బవిత్రత సంచరించునది. రెండును గలసియుండుటచే ననేకములగు పాపములనుండియు, నపరాధములనుండియుఁ దప్పించుకొనఁగలిగితిని. ఇదివఱకుఁ గాష్ఠస్ఫూర్తికలను జూచినచోట నిపుడేఁకఁ గేవలము అంతియచూచుటలేదు. అధికసాధన చేయులేదు.

కన్నులు తెఱచికొని సాధనఁ జేసితిని. నలుదిక్కులను జూడఁ బ్రతివస్తువు మధ్యమునను ఈశ్వరుఁ డనుప్రవిష్టుఁడై వసించుచుండఁగఁ గంటిని ; జలములోపల బ్రహ్మ, పర్వతములోపల బ్రహ్మ, శిలలో బ్రహ్మ. జలము వంకఁ జూడ బ్రహ్మ ప్రత్యక్షముగఁ దేలియాడుచుండెను ; మినుకులు వేయుచుండెను. పుష్పముయొక్క ఱేకుల మధ్య బ్రహ్మ మెదలకుండఁగఁ గూర్చుండెను. పుష్పములలోను, ఫలములలోను బ్రహ్మను జూడఁగంటిని. గుల్మములవైపునకుఁ జూచి చూడకముందే శరీరము కంపించిపోయెను. బ్రహ్మ నేనున్న దిక్కునకుఁ జూచుచుండెను ; నన్నుఁ బిలుచుచుండెను. నికటమునకు వెళ్ళితిని ; " రావోయి ! దగ్గఱకు రావోయి ! " యని మఱల ననెను. అతినికటమునకుఁ బోయితిని ; బ్రహ్మ దొరకెనంటిని. యోగమయ్యెను. యోగ మన నేమి ? అంతరాత్మతోఁ బ్రగాఢసంయోగము ; ప్రతివస్తువును జూడఁగనే తక్షణము ఆచూపుతోడనే యగు బ్రహ్మదర్శనము. కాష్ఠమిఁకఁ గాష్ఠమనిపింపదు; ఆకాశమిఁక నాకాశముగ నుండదు. ఆకాశములోఁ జిదాకాశముగపడును. సర్వత్ర ఒక్క జ్ఞానము చకచకలాడుచున్నట్లు, ఒకశక్తి టమటములాడుచున్నట్లు, అనుభవమగును. జ్ఞానముయొక్క ఉజ్జ్వలప్రభ ఆకాశమంతయు విస్తృతమైయున్నది; ప్రేమానందములు వ్యాప్తమై నలుదిక్కులను శీతలముఁ జేయుచున్నవి ; జీవునకు శాంతినిచ్చుచున్నవి. ఈసకలభావములును పాండిత్యముచే, బుద్ధిచేఁ గలుగవు. ఇదంతయు నాజ్ఞాపించిన సిద్ధించునా ? సాధనవలన సిద్ధించును ; ఈశ్వరకృపవలన సిద్ధించును. ఇది నాకిదివఱ కుండినది కాదు. ఉపాసన సేయువాఁడను ; ప్రార్థన చేయువాఁడను ; పాపమునుండి విముక్తుఁడనగుటకై, పాపశృంఖలమునుండి

యుద్ధారమునందుటకై పతితపావనుని శరణముగొనువాఁడను. యోగమును సాధన చేయువాఁడను గాను. జ్వలించునగ్నివలె నలుదిక్కుల బ్రహ్మాగ్ని ఛటఛటలాడుచున్నట్లు, మహావాయువువలె హూహూయనుచు బ్రహ్మవచ్చి శరీరమును దాఁకుచున్నట్లిదంతయు ననుభవమునకు రానికాలముండెను; క్రమముగ ననుభవమునకు వచ్చెను. ఎప్పుడు అనుభవమునకు వచ్చెనో అప్పుడిఁక వదలిపోవునేల? ఇదిగో! నికటముననే బ్రహ్మ; ఇంకను నికటమునకు వెళ్ళుదును. ఒక మూరెఁడుదూరముననుండి ఆయనను దర్శింపవలెను. ఆయనయొక్క నికటముననే కూర్చుండియున్నట్లు చూచుకొందును. ఈప్రకారమున యోగము గాఢతరమయ్యెను. యోగములోను బరిమాణములున్నవి. అయిదునిమిషములలో యోగము, ఒక్కనిమేషములో యోగము, ఘంటలో యోగము, ఎన్ని మాఱులు కావలయునో అన్ని మాఱులును యోగము. ఈయోగమునకై గురువినా, ఉపదేశము వినా, యత్నింపనారంభించితిని వదలిపెట్టుటయనునది లేదు; చక్షువులున్న యన్ని నాళ్ళును, బ్రహ్మను దర్శింపవలయును; ఎన్ని శబ్దములు విందునో, వానియన్నిటిమధ్యను బ్రహ్మయొక్క శబ్దమును విందును. ఆంతియసిద్ధించెను; ఇదివఱకు నయోగినై యెట్లుంటినాయని యిపుడాశ్చర్యమగును. బ్రహ్మవిద్యుత్తు ఛటాలుమని సమ్ముఖమునఁ బ్రకాశించుచున్నది; లోపల మెఱయుచున్నది. కోరిక పుట్టఁగ, బ్రహ్మను జూడనగును. చకుముకిని గొట్టినపుడు అగ్ని రాలువిధముగనే, ఒక్కనిమేషమున శరీరములోను, హస్తములోను, అంగుళిలోను, రసనలోను బ్రహ్మ ప్రకాశితుఁడగును. బ్రహ్మమా! రమ్ము. ఈహస్తముయొక్క యంగుళినిఁ బ్రకాశింపుమనఁగనే

అంధకారములోను వెలుఁగును జూడనగుననియు గ్రహించితిని. కాష్ఠములోపలినుండి బ్రహ్మను బయటికి లాగవచ్చును; జలమునందును, ఆకాశమునందును ఆయనను జూడవచ్చును. రమ్మని పిలిచి ప్రార్థన చేయఁగనే బ్రహ్మ యగపడును. నేను బూర్వము కష్టపడినట్లిప్పుడు కష్టపడుచున్న బ్రాహ్మలనేకు లుండవచ్చును. "జలమందును, అగ్నియందును బ్రహ్మము నెట్లు చూతుము? ఇది యద్వైతవాద మైనదిగదా!" యనువారును అనేకు లుండవచ్చును. బ్రహ్మను "ఇయూ *" రనుకొని "హాఫీజు *" వలె "ఓ హూ! ఎంతనికటముందున్నావు! పుష్పములలోనున్నావు! హృదయమునం దున్నా" వని యీప్రకారమనుటకు వీలున్నదా? వీలుండుటయే కాదు, ప్రత్యక్షముగ నిటులు చూడఁబడినది. నేనిపుడున్నది లేనిది పదిమందికి సందేహము కలుగవచ్చునుగాని, ఈశ్వరవిశ్వాసములో సందేహము కలుగవీలులేదు. నాతో నీశ్వరుఁడిప్పుడొకటిగా నల్లుకొనిపోయినాఁడు. ఈశ్వరునిఁ జూడలేదా? ఇఁకఁ బ్రమాణము నీయనవసరములేదు. నన్నుఁ జూచిననే చాలును. ఒకపదార్థములో రెండుపదార్థములు కలసిపోయినవి. ఒకదాని నస్వీకరించి యింకొక దానిని స్వీకరింపవీలులేదు, మీరును యోగమును శిక్షింతురు. ఆశావిశేషమునిచ్చితిని. బ్రహ్మను స్పష్టముగ వస్తువవలెఁ జూతురు. పుస్తకములయొక్క యీశ్వరునితో మనకవసరము లేదు; చక్షువులతోఁ జూచినప్పుడే పాటింతుము. మిత్రబాంధవులారా! కల్పనయొక్క యీశ్వరుని, ప్రాణములేని యీశ్వరుని,

---

* "హాఫీజు" అనునాయన యొక పారసీకమహాకవి మహాభక్తుఁడు: ఈయన ఈశ్వరుని "ఇయూ" రను ముద్దుపేరునఁ బిలుచుచుండెను. ఇయూరనఁగాఁ బ్రాణప్రియుఁడని యర్థము.

మన్నింపకుఁడు. యోగులరగుఁడు; భక్తులరగుఁడు; అభావమ్మునకు మోచనమగును. నేను మహాకర్మాసక్తుఁడనై యుంటిని; ఇపుడు యోగపర్వతముమీఁద కెక్కి యుద్యానవనములో విహరించుచున్నాను. నాజీవనములో యోగమధికమో, కర్మమధికమో; వివేకప్రభావమధికమో, కేవలమృదంగమును వాయించి భక్తిలో నానందించుట యధికమో; ఇపుడు నాకుఁ దెలియకున్నది. పదునాఱువీసములు నాకు భక్తియున్నఁ, బదునాఱువీసములు యోగమున్నది. రెండువీసములు యోగమున్న రెండువీసములు కర్మమున్నది. భక్తుఁడనైతినని యోగసాధనలో నశ్రద్ధఁ జేయఁజాలను. ఈజీవనమున యోగమును భక్తియు నేకమైనవి. ఇంతనీచబ్రాహ్ముఁడు యోగశిఖరమునందున్న భక్త్యుద్యానవనములో విహరించుచున్న వాఁడు. ఓబ్రాహ్మలారా! మీరింతనికృష్టజీవనము కాను. నేను నీచుఁడనైకూడ, భక్తియోగముల యొక్క యానందము లభించుననుట, యొకవిచిత్రము కాదు. ఆశ నిచ్చుచున్నాను. ఉత్సాహము నిచ్చుచున్నాను. బ్రహ్మపాదపద్మములను బట్టుకొని యోగులరగుఁడు; భక్తులరగుఁడు.

ఓదీనబంధూ! ఓయోగేశ్వరా! అభావముండుట వాస్తవమే యైనను, అది విముక్తమగునని యీజీవనమునఁ గంటిని. ఇంగ్లీషువిద్యాలయములోఁ జదివి, ఆంగ్లేయమతములను నేర్చుకొని, యోగికావలసియున్నవాఁడని యెవ్వరెఱుఁగుదురు. కాని, నాథా! నీమార్గముఁ బట్టుటచే యోగినిఁ గావలసివచ్చెను. నేను స్వప్నములోను యోగమోమాట తలఁచువాఁడనుగాను; యోగముసంగతియే నాకుఁ దెలియనదికాదు. బ్రాహ్మసమాజములోనికి వచ్చినపుడు “హామ్మ, హరితో యోగమును స్థాపించుకొను”మని ఎవరో ఒకఁడు దఱువు చఱచి

చెప్పిరి. ఓపరమపితా! పలుమాఱు ఇట్టిదెబ్బలను దిని, సంసారముచేఁ బరిత్యక్తుఁడనై, అంతరములోనికిఁ బ్రవేశించితిని. ప్రవేశించి యెట్టి యాశ్చర్యకరరాజ్యమును జూచితిని? బాహ్యమునఁ బురములను, గృహములను, కుటీరములను జూచినట్లే అంతరమునను జూచితిని. ఇక్కడఁగూడ గడునానందమే! అట్లయిన మనుష్యుఁడేల యోగి కాఁడు? లౌకికులయుపదేశములను వినియుంటినేని, నిశ్వాసమును ఆవరోధింపుమని చెప్పెడివారు; కృత్రిమయోగపథమును బట్టుకొనువాఁడను. కాని, తల్లీ! నీవు సుఖినిఁ జేయఁదలంచుకొంటివి; అందుచే భ్రమములనుండి బ్రతికించితివి. బ్రతికితిని; సులభముగ యోగమార్గమును బట్టుకొంటిని. ఉచ్ఛ్వాసనిశ్వాసము లెట్లు సహజమో, నిన్నుదర్శించుటయు నట్లేయని గ్రహించితిని; పర్వతప్రకాండములలో, అసీమమైన సువిస్తృతాకాశములో, పదార్థమువలె నిన్ను స్పష్టముగా దర్శించి కృతార్థుఁడనైతిని. "చక్షువులారా! బ్రహ్మను జూడక నాస్తికులు గాకుఁడి; కర్ణములారా! "నేనున్నాను; నేనున్నా"నను నీశబ్దమును వినుఁడి. బ్రహ్మయొక్క నానావిచిత్రకథలను ఆకర్ణింపుఁడి;" యంటిని. ఇట్లంతయు సిద్ధముచేసికొని సాధననారంభించితిని. సాధనమాత్ర మెన్నాళ్ళు చేసితిని? శీఘ్రముగనే నిన్ను సకలవస్తువులందుఁ గంటిని. భారతమున నింగ్లీషునభ్యసించిన యొకయువజనుఁడు యోగియయ్యెననిన నమ్మకము గలుగదు; కాని సభ్యతలో యోగము జన్మించెను. ప్రేమభక్తులమధ్య యోగమయ్యెను. న్యాయశాస్త్రము యొక్క విచారణచే నేహరినిఁ జూడనగునో, ఆయనను సిద్ధాంతము చేసితిని; మనోవిజ్ఞానము యొక్క సాహాయముచే నాహరినిఁ బరీక్షించితిని. హరీ, నీవన్ని పరీక్షలందును

ఉత్తీర్ణుఁడవైతివి. ఆత్మన్! జయధ్వనులఁజేయుము! రసనా! జయపెట్టుము!! నా బ్రహ్మ పరీక్షోత్తీర్ణుఁడయ్యెను!!! వృక్షాకాశములను జూచిచూచి యెవఁడాస్తికుఁడయ్యెనో, అతఁడు నాస్తికుఁడు కావచ్చును; కాని, నా బ్రహ్మ, "నన్నన్నిప్రకారముల పరీక్షింతువో పరీక్షింపుము; నేను నీవాఁడను; నీవు నావాఁడవు; నన్ను నీహస్తమునఁ బడవేసికొంటిని, నీకుఁ దోఁచినట్లు జేయుము; నన్నుఁ బెద్దబాజాలలోనికిఁ దీసికొనిపొమ్ము; అగ్నిలోఁ బడవేయుము; జలములోఁ బడవేసియుంపుము; పుస్తకములతో సరిజూడుము; నన్ను బరీక్షింపుము;" అనుచు నాకు వరమునిచ్చెను. పరీక్షఁజేసిచూడ, హరి నా సకలపరీక్షలయందును ఉత్తీర్ణుఁడయ్యెను. హరీ! నీవెన్నఁడును మిథ్యగావని యిప్పుడుగ్రహించితిని. విద్యుత్తువలె చకచకలాడుచున్నావు; తళుకుబెళుకు మనుచున్నావు. బ్రహ్మవస్తువు నెవరుచూచిరి? హిమాలయమా! నీవు నా బ్రహ్మయొక్క సాక్షివగుము; ఆకాశమా! నీవు పుష్పములను వర్షింపుము. ఓ సత్యమా! జ్వలనమానుఁడవగు నో యీశ్వరా! నేను నిన్ను దర్శించితిని; నీవు మాట్లాడుము, మాట్లాడుము. నేను యాత్రికుఁడగు నీశ్వరుని మన్నింపను. బాల్యకాలమునుండి నేను నిన్నుఁ బాటించుచున్నాను. నిన్నగ్నివలెఁ జూడనగును. పసిఫిక్ మహాసముద్రమును దాఁటవచ్చునుగాని నిన్నెవఁడును అతిక్రమింపనేరఁడు. బ్రహ్మమా! బ్రహ్మమా!! బ్రహ్మమా!!! బ్రహ్మమా!!! నేను యోగిని!!! నేను నిన్ను దర్శించుచున్నాను!!! ఇపుడు నాప్రాణము నీలో మునిఁగిపోయినది. మాట్లాడుము; ఎల్లవానిని నిన్నుఁబట్టనిమ్ము. నాస్తికుల యొక్క యీశ్వరా! దూరమునకుఁ బొమ్ము; కల్పనయొక్క యీశ్వరా! దూరమగుము;

స్వప్నము యొక్క యీశ్వరా! దూరముగను. నిన్నుఁ బాటింపను. కల్పనయొక్క యీశ్వరుఁడు ధూమయున్న నెగిరిపోవును. పరీక్షను నాఁగలేఁడు. నాయీశ్వరా! రమ్ము! భగవానుఁడా! నీవు రమ్ము! ప్రకాశించుచున్న యగ్ని రమ్ము! రమ్ము! ధగధగమండుచుండుము. ఒక్కని మేషములో భారతవర్షము యొక్క కోటి కోటి ప్రజలను విశ్వాసులను జేయుము. బంధుమిత్రులు శోకించుచున్నారు; కనఁబడుము. నిరాకారపూజను బట్టించినందుకుఁ ద్వరితముగ దర్శనమిమ్ము. చూచి యందఱును ఆస్తికులగుదురు. ఆస్తికుని నేను మహిమాన్వితునిఁ జేయుదును; ఆస్తికుని బ్రహ్మపుత్రుఁడనందును. ఈశ్వరదర్శన మెంతసహజము! ఇటువంటి విశ్వాసము కలుగకున్న మాటేలా! ఇట్లు కాదేని, ఇరువది వత్సరము లేమిచేసితిని! ఏసాధనలో "ఈశ్వరుఁడెక్కడ, ఈశ్వరుఁడెక్కడ" ననుచుఁ బారమును వల్లెవేసినట్టు లీశ్వరుని నిర్ధారణచేయవలయునో, ఆసాధన ఎట్టిపనికిమాలిన సాధన? "అమ్మా!" యని నిన్నతిసులభముగఁ బట్టనగును. ఓయి నిర్ధననిధీ! నిన్ను నేను సులభముగఁ బొందితిని. ఇదివఱకు నాకేమియు లేకుండెను; ఇపుడు సాధనాగారములోను, నాపుస్తకాలయములోను, బావతుములోపలను బ్రహ్మధనమున్నది. జమీందారునికంటె, రాజుకంటె నేనధికుఁడనైతిని. నీపుత్త్రుఁడనైన నేను బ్రహ్మాండముయొక్క యుత్తరాధికారినైతిని. యోగములో సూర్యచంద్రనక్షత్రములను, సమస్తమును వక్షస్థలమునందుంచుకొంటిని. సాలెపురుగే విధముగఁ దనగూటియందుఁ బడిన పురుగును బట్టుకొనునో, ఆవిధమున నిన్నుఁ బట్టికొంటిని. బ్రహ్మయు బ్రహ్మాండమును, బ్రహ్మాండమును బ్రహ్మయు, నాలోనున్నవి. నేను ధన్యుఁడను! నాపూర్వపురుషులు ధన్యులు!! ఈమాటలనన్నింటి

ఎవరువినుచున్నారో వారుధన్యులు !! ధన్యుఁడవీశ్వరా !! నీవుధన్యుఁడవు !!! నీవు ఆయోగిని యోగిగఁజేయఁగలవు. ఓకృపాసింధూ! సచ్చిదానందుని విశ్వసించి యోగముయొక్క-సుఫలము నీజీవనములోనే యాస్వాదింపఁగలుగునట్లు ఆశీర్వదింపుము !! జగజ్జననీ !! ముక్తిదాయినీ !! కృపఁజేసి నీవు మాకీయాశీర్వాదము నిమ్ము !!!



# దశమాధ్యాయము.

## ఆశ్చర్యగణితము.

భానువారము ౧౬ ఆశ్వయుజము. ౧౮౦౪ శకము.

నాజీవనముయొక్క గణిత మత్యంతాశ్చర్యకరము. ఏయంకశాస్త్రము ద్వారమునఁ బ్రపంచము నడిపింపఁబడుచున్నదో నాకందు విశ్వాసములేదు. నాయంకశాస్త్రమునకును దానికిని విరోధము గాన్పించుచున్నది. మూలతత్వములలోనే వివాదము; అయినప్పటికిని నాకును గణితమున్నది; దాని శాస్త్రార్థమును గ్రహింపనగును; భక్తులును గ్రహింపఁగలుగుదురు. దానినియమాదులన్నియును సరిగనేయున్నవి; జనసామాన్యులదిపాటింపరు; శతాబ్దములు గడచిపోయినను బాటింపరు. నేనేదేశమునుండి వచ్చితినో యక్కడి యాచారవ్యవహారము లిక్కడి యాచారవ్యవహారములవంటివి గావు. ఈదేశపుఁబ్రజ లిక్కడిరీతినీతులయొక్క పక్షపాతులైనట్లే, నాదేశపుఁబ్రజలును అక్కడిరీతినీతులయొక్క పక్షపాతులు. తమదేశముమీఁదను, దమయిండ్లమీఁదను, అనురాగ మందఱకు నున్నది. తమదేశమును మహిమాన్వితముఁజేసికొనఁగ నెవరికిఁ గోరికయుండదు? ఓమానవజాతీ! ఈదేశపురీతినీతులను, ఆచారవ్యవహారములను, నీవు చక్కఁబఱచియుంటివేని, దాని నితరులకుఁ జెప్పి మెప్పింప నట్లుచూతువో, అట్లుగనేచేయ సమానాధికారమును, ఉత్సాహమును, నాకును నిమ్ము. నేను మాదేశపుసంగతులను జెప్పుదును. మాదేశమును నీను దక్కువచేయను. మాదేశపుఁబ్రజ లేశాస్త్రమును మన్నింతురో,

అది తక్కువలోనిది కాదు; పైఁగ నెక్కువది. అక్కడ శాస్త్రిప్రసంగతులను గూర్చి కొంతనిమిషములు వినుటయుఁ, గొంచెమాలోచించుటయు నుచితమని త్తోనఁ జివటకు నమ్ముము. ఆయంకశాస్త్రము లోకులను విస్మయాపన్నులఁ జేయును. సాధారణు లందులో నసత్యమును జూతురు. ఆయసత్యమును సాధనఁ జేసినవారిని మూఢులనియుఁ, బిచ్చివాండ్రనియుఁ బిలుతురు. అయినను నానోరాఁగదు; అందుచే నీయంకశాస్త్రి మత్యంతాశ్చర్యకరమైనదని ధైర్యముతోడఁ జెప్పుదును; ఏలయన, దానిప్రకారము మూఁటినుండి యైదును దీసివేసినఁ బదునేడు మిగులును. ఈసాంగతత్త్వమును బట్టికొని, ఈనియమానుసారముగా, ధర్మసాధనలను జేసిన, లాభమే యగును గాని నష్టము రాదు. ఇట్టిసాధన చేయుటవలననే బహుశత్రుసముక్షమందును జయపతాక స్థాపింపఁబడినది. ఈయంకముమీఁదనే ధర్మజీవనము స్థాపింపఁబడినది; ఏజయముకలిగెనో, అది యిందుమూలముననే కలిగినది. అయిదు మూఁడు గలసిన నెనిమిదగునన్నచోటనే, అపజయమైనది. చిన్నసంఖ్యలోనుండి పెద్దసంఖ్యను దీసివేసినఁ జాలశేషముండునని చెప్పినచోటనే జయమునందితిని. గృహము నిర్మాణించుటుచితమనుకొంటిని, వెంటనే నిర్మాణించితిని. గోడలు పైకిలేచెను; గృహము నిర్మాణమయ్యెను; గదిలో పటములుసహ వ్రేలాడఁదీయఁబడెను; అందుమీఁద పునాదులు వేసితిని. ఈదేశముయొక్క విధి ఇది, శాస్త్రమిది. ఎవరు పునాదులువేసి గృహనిర్మాణము నారంభింతురో వారిని మేము మూఢులందుము. జయముకలుగదని నిర్ధారణఁజేయుదుము. ధర్మమందిర మెట్లునిర్మితమగునని, గోడ లెట్లులేచునని, ముందర ధనముపోఁగుకానిరెండల సమాపనమెట్లగునని, ఎవరైన ననుచుండఁ

జూచితిమేని, ఇతనికి జయసంభవము లేదని వెంటనే తెలిసికొందుము. మేమన్ననో, "ఈశ్వరా! నీకిల్లు కావలయునా?" యందుము. ఆయన, అవు నన్నయెడల నాకాశముపైని నాల్గంతస్తులమేడ యప్పుడే నిర్మితమైనదని గ్రహింతుము. గృహము నిర్మాణమయ్యెను; డబ్బును రాసాగెను; అప్పుడు పునాదులుపడెను. ముందర భావించి చేయవలదు; ముందుచేసి తరువాతను భావింపవలదు; మొదటను వలదు; మధ్యను వలదు; తరువాతను వలదు; ఎన్నఁడును భావింపకుము. ఈశ్వరాదేశముమీఁదఁ గార్యముల ననుష్ఠింపుము; భావింతువేల? పిల్లలవివాహము తలపెట్టెను; ఐదువందలరూప్యముల యగత్యముండెను; అయిదువేలరూప్యములు కావలసివచ్చెను; అప్పుడు, డబ్బెక్కడని, డబ్బెట్లువచ్చునాయని ఈపృథివియందలిమూర్ఖుఁడు భావించును. వివేచనతరువాత నాలోచన, ఆలోచనతరువాత వివేచన, చేయఁగఁ జేయఁగఁ దలదిమ్మెక్కెను. అయిదువత్సరము లైపోయెను; వివాహము కానేలేదు. భావింప మొదలుపెట్టినవారికి నన్నివిషయములలోను భావనయే ప్రత్యక్షమగును. మాదేశస్థులు కుమార్తెకు వివాహము చేయవలసియున్నఁ గేవలము నాకాశమువంకఁ జూతురు; "హరీ! నీయీకన్యకు వివాహముచేయవలయునా?" యందురు. "అవును, ఆశ్వయుజశుద్ధపంచమినాఁడు స్థిరమయ్యె"నని ప్రత్యుత్తరమునందుదురు. వివేకవైరాగ్యాస్త్రములను చేతఁబట్టికొని, సాధకుఁడు బయలువెడలెను. శుభముహూర్తమున వివాహమయ్యెను; ఏయాటంకములును రాలేదు. వరుఁడు లేఁడు; డబ్బు లేదు; ఇట్టియవస్థలో సాధకుఁడు కార్యమును సాధించెను. ఈపృథివియందలిలోకులు, ఇట్టియవస్థలో నెట్లగునాయని చింతింతురు.

ఈశ్వరుఁడెఱుఁగును; అయిపోవును. ఈశ్వరుఁడు చెప్పినప్పుడగునని భక్తుఁడనును. భక్తున కొక్కఁడమ్మిడి కనఁబడ లేదు; కాని మైదువందలమందిని బిలిచి చక్కఁగా విందుచేయవలయునని యీశ్వరుఁడు నుడివెను. భక్తుఁడుపాసనలోఁ గూర్చుండెను. ఈవైపున వివాహమునకు వాద్యములన్నియు సిద్ధము; వేయిమందికి నేర్పాట్లును జరిగెను వివాహమైపోయెను. ఎట్లయ్యెను? ఎట్లగునో ఈదేశపులోకు లాలోచింపరు; ఎట్లయ్యె నాయనియే యాలోచింతురు. లెక్కఁబెట్టి పదురూపాయలరొక్కమును, బదిమందిమనుష్యులను గావలసియున్నచోట, సరిగా సమయమునకు నంతియే సిద్ధించెను. ప్రయోజనమైనదెల్ల తటస్థించెను. ఏసూత్రమును బట్టి ఎట్లయ్యెనో, ఎవరు చెప్పఁగలరు? స్వర్గమెఱుఁగును; మర్త్యము చెప్పలేదు. ఇవన్నియు సిద్ధింపఁగా, నేప్రకారముగా నయ్యెనని గృహస్థుఁడు తిరిగి జిజ్ఞాస చేసెను; సమస్తము సిద్ధించినవిధమిది; మనుష్యులు వచ్చిచేరినదియు నీప్రకారముగనే. ఈకార్యము నందఱుఁ బ్రశంసింతురనియు, నీకార్య మనుష్ఠింపఁబడినయెడ లోకులందఱును యశస్సును గీర్తింతురనియు, నెప్పుడు తెలిసెనో, ఇది దుష్కార్యమనియు, దీనివలన సర్వనాశనమగుననియు సాధకుఁడు వెంటనే గ్రహించెను. విద్వాంసులు గణుతింతురు; పండితులు ఆదరింతురు; సాధారణులు కీర్తింతురు; కావున నీకార్య మనుష్ఠింపఁబడదు. ఇక్కార్యమును జేయుమని మనస్సనెను; ఆకాశమువంకకుఁ జూడఁగా, నిది కొంచెము మంచికార్యమని తేలెను; కొందఱు సజ్జనులును, ధనాఢ్యులును, పండితులును పిచ్చవాఁడనుచున్నారు; అందఱును విపక్షులైరి; అందుచే దీనిని జేసియే తీఱవలెనని స్థిరగురయ్యెను. ఈకార్యమును జేసిన నందఱును నిందింతురు; ఘోరావమానము కలుగును;

ఉపన్యాసము నీయఁబోవుచోటున కెవ్వరును వినుటకు రారు; అత్యంతాప్తమిత్రులు సహ పరిత్యజింతురు; మనశ్శరీరములును బుద్ధియు క్షీణించి, అవసన్నావస్థను జెందును. ఇట్లు కానున్నప్పుడు, "కావలసినట్లయినది; ఎవరును సాయము చేయరు; కావున నీ కార్యానుష్ఠాన ముచిత" మని మనసు వచించెను. ఏలయన, పృథివి శత్రువైనపుడే ఈశ్వరుఁడు మిత్రుఁడగును గదా! పృథివి దేనిచే విముఖ మగునో, ఈశ్వరుఁడు దానిచే ననుకూలుఁడగును గదా! ఏపనిలోనైన లక్షమందియవసరమున్నప్పుడు, సాధకుఁడును భక్తుఁడును నైన గృహస్థుఁడు ముగ్గురిచే నది యనాయాసముగ సాధింపఁబడునని పలుకును. ఈపని నైదువేలమందిలేకుండ సమాప్తము కాదని పృథివి యనును. అయిదుగురికంటె నెక్కువైన నీకార్యము చెడునని భక్తుఁడనును. చాలధనమావశ్యకము; చాలమంది ప్రచారకులుండవలెను; అనేకులు పదేష్టలు కావలయును; ప్రచారమప్పుడగును; ఇది పృథివిమాట. "కాదు. అయిదుగురున్న నెక్కువ; పండ్రెండుగురొక్కచోఁగలసిన నప్పటికే హెచ్చుసంఖ్య వచ్చినదనుకొనుము; పండ్రెండుగురు చేయఁగలిగినది, పండ్రెండు లక్షలమంది చేయలేరు. పదుముగ్గురు చేయఁబోఁగానే చెడును." అని భక్తుఁడనును. అయిదువందలమంది చేయలేనిదానిని అయిదుగురు చేయఁగలుగుదురు. అంతయేకాక, అయిదుగురు చేయవలసిన దానిలో, నార్గురు ప్రవేశించిన నంగతియంతయుఁ జెడును. ఇందునకై ఏలాగునైనఁ దక్కువమందే యుండుటకై యత్నింతును. సంఖ్యను వృద్ధిచేయుట ఈశ్వరాజ్ఞకు విరుద్ధము. "చూడు; చూడు! అయిదుగురు విశ్వాసపరులు కూర్చున్నారు.", ఇంతలో నింతమంది యెట్లయిరి? ఏమి యాశ్చర్యము! ఏఁబదివత్సరములలో నింతమంది

రాయెట్లుచేరిరి? ఇంతమంది నీశ్వరుఁడు కుదిర్చెనా? కొలఁదిమందియో స్తంభస్వరూపులై ధర్మసమాజమును దమతలలమీఁద నుంచుకొని కాపాడుదురు. దుర్జయులగు పందొమ్మిదుగురును ధరాతలమున జయముఁగాంచిరి, అందుచే మా దేశమునుండి వచ్చినవారెల్లఁ దక్కువమందికై యత్నింతురు. చాలమంది వచ్చుచున్నట్లు కనఁబడినతోడనే, సంగీతకారుఁడు సా, రీ, గా, మా యనుచు స్వరముల నాక్రమించినట్లుగానే, ఆచార్యుఁడు సాధనమాత్రల పైపైకెక్కించును. అసంఖ్యముగు జనము, ఒకశతమునకు వచ్చెను. ఇప్పటికైనను ఇంతమందియా? అసలుపథమున నింతమందియా? ఇంకను గఠినసాధన ప్రవర్తితమయ్యెను. కొంతమంది విరక్తులైరి. మఱికొంతమంది నిందించుచుఁ బలాయనమైరి. రెండువందలమంది రైదుగురైనపుడు, స్వర్గమునుండి పుష్పవర్షము కురియసాగును. ఇంతకొలఁదిదినములలో నింతమంది రైరాయని, యాచార్యుఁడు తలపోయును. అయిదువందలమందిని గత్తిరింపఁగాఁ, గత్తిరింపఁగాఁ దరువాత నంతరాళమున నుండునైదుగురిలోపల సమస్తధర్మసమాజముయొక్క బలమును ఘనీభూతమయ్యెను. ఏయే కార్యములలోఁ బృథివికిఁ గడుతలఁపోయు టావశ్యకమో, ఆయా కార్యములలో నిక్కడ భావనయే పనికిరాదు. గణితశాస్త్రములో నూహాగొటుకవని యనేకులనుకొందురు; అది సరికాదు. ఒక జనుని జీవనములో నిరువదిరైదువత్సరములు సప్తాహముతరువాత సప్తాహము, మాసముతరువాత మాసము పరీక్షితమై ప్రమాణమైనది. ఈ జీవనములో నేకొంచెము జయము గలిగినదో, యది చింతచేయకుండుటవలననే గలిగినది. డబ్బుపోగుచేసికొని కార్యారంభణముచేయుట విఫలము.

ఎక్కడ డబ్బులేదో, చింతలేదో, అక్కడనే జయము కలిగినది. నేను స్వచక్షువులతో దర్శించినట్టియది సత్యమయ్యెనేని, అందఱు నీగణితము యొక్క ప్రశంస నేల చేయరు? అనలుసంగతిఁ జెప్పుచున్నాను; భావనచే విషయసంపత్తి దక్కదు; శరీరము సుస్థితిలో నుండదు; ధర్మము మాట చెప్పనే యక్కఱలేదు. బౌద్ధశాస్త్రము యొక్క నిర్వాణమును జేతఁబట్టుకొని, ఎక్కడికి వెళ్ళినను జయమగును. అగాధము లెక్కడ మ్రింగివేయఁబోవునట్లు యెదుటనే నోరు తెఱచుకొనియున్నవో, ఎక్కడ నిలుచుండినఁ బదస్ఖలనమగునో, అట్టి నిశితమగు క్షురధారవంటి స్థానమున నిలువఁబడి ధర్మమును స్థాపింపుము. నీవు లక్షరూప్యములను ముందుండఁజూచుకొని, పిమ్మట దయావ్రతమును బూనుదువా? అట్లైన్నటికిని వలదు. దయావ్రతమును బూనుము; కట్టువస్త్రమును చింపి, యొక్క పోఁగును చేతఁబట్టుకొని, "రా! రా! ధనమా! రా!" యనుము. మఱునాఁడుదయమున సూర్యుఁడుదయించినట్టుగనే, నీకుఁగావలసినదంతయు నీశ్వరుఁడిచ్చును. ఈశ్వరునిధనమునకు నాయన జ్యేష్ఠపుత్త్రులును నధికారులే, ఆయన కనిష్ఠపుత్త్రులును నధికారులే. బిడ్డలుకలిగిన ధనభావనయేల? నాటకమాడవలెను; వితంతువుల దుఃఖమోచనము చేయవలయును; దేశమున విద్యాలయములను స్థాపింపవలయును; గృహమునఁ జూడఁగ ధనముండెను; దయాపథమున కంటకముగదా యనుకొంటిని. రెండుమూఁడుదినములు గడచెను; చూడఁగా నింట రాగిదమ్మిడి లేకుండెను; ఇప్పుడు ధర్మమును నడిపింపవలయుననుకొంటిని. భవిష్యద్వృక్షమున ధనమున్నదని ప్రవర్తకుఁడు ధైర్యమును పురికొల్పెను. పృథివిమీఁద ధనమున్నఁ జాలునని

భక్తులు కార్యముల నారంభించిరి. రెండులక్షల రూప్యములున్నవాఁడు రెంకురూప్యములను ఖర్చుచేయలేకపోయెను. ఎవని కేమియు లేదో వాఁడే పనిచేయును. నేను ధనికుఁడనని ఎవరెఱుఁగరు ? నాచేతిలో నొకకోటియున్నదని ఎందుకనుకొనఁగూడదు ? ఏలయన. నావద్ద నొకరూప్యమునయితము లేదని నేనెఱుఁగుదును. నాకేమియు లేదు ; నేను కేవలము బ్రహ్మధనములో ధనికుఁడను. దీనిచే నేను సర్వకార్యముల ననుష్ఠింపఁగలను. అన్యులకుఁ జెక్కిలిమీఁదఁ జేయియున్నపుడు, నాకు నడుముమీఁదఁ జేయియుండును. అన్యులకెక్కడ సాహసమో నాకక్కడ వెలుపు. విస్తారధనమెక్కడనో, రెండుపాఠశాలలు, రెండుబ్రహ్మమందిరములు ప్రతిష్ఠింపఁబడఁగలిగినంతధనమెక్కడనో, అక్కడ విషమున్నదని యెంతును. డబ్బున్నదని లోకులు గర్వముచే మదించియున్నారు. సైతానుయొక్కధనమును స్పర్శించి హరిసమాజమును స్థాపింపఁజూడను. హరియొసంగినధనమని తెలిసినపుడు, దానినినెత్తిమీఁదఁ బెట్టికొందును. హరియొక్క ఒక్కరూప్యము లక్షరూప్యములు. హరియే స్వయముగా ధనమునీయనియెడల సాహసము రాదు. ఈప్రణాళినవలంబింపు నాదిష్టులైనవారు అవలంబింపుఁడి. ఈప్రణాళ్యవనంబులోఁ గడుభారమున్నది. దీనిలో ననేకులకు నరిష్టముగలిగినఁ గలుగవచ్చును. ఈశ్వరునిసూచనలనుబట్టి యీప్రణాళిని గార్యముల ననుష్ఠింపవలయును. అనేకులు ఆలోచింపక కార్యములను చేయఁబోయి ఋణజాలమున బద్ధులగుదురు. "డబ్బునకింతచ్చింతయేల? అనుకున్నట్టయిన, నొక్కచీటిముక్కవ్రాసి లక్షరూప్యములను దెప్పింపఁగల" నని

చెప్పుచు ననేకులెగిరిరి; ఎగిరి, పడిరి; పడి, మునిఁగిరి. మే మెగిరితిమి గాని పడలేదు. పూర్వముండిన సాహసముకంటె నిప్పుడు సాహసమెక్కువైనది. డబ్బులేనప్పుడు ప్రచారకుల సంఖ్య పదిరెట్లెక్కువగునేని, రెండువందల మందివచ్చి ప్రచారకులమధ్యఁ జేరుదురేని, అందఱకును ఆశ్రయమునీయ సంభవము కావచ్చును; ఏలయన, డబ్బులేదుగదా! డబ్బునకు గుంజులాటగానున్నదని యెఱుఁగుదును. ఇట్టిసమయమందు రెండువందలమందివచ్చిన, ముహూర్తమధ్యమునఁ గుబేరునిధనమువచ్చును. ఒక్కమాటేడ్చినఁ జాలును. ఈపత్రికార మిరువది, యిరువదియైదు వేలరూప్యములను వత్సరవత్సరమును ఖర్చుఁజేయుచువచ్చుచున్నాను. లేమిడి యెన్నఁడును లేదు. పూరిగుడిసెలో దుకాణము, తృణములను దంతమధ్యముననుంచుకొని * వ్యవసాయము; కాని యభావ మెన్నఁడును లేదు. ఒక్కయుపాసనఁజేసి యైదుగడ్డిపోఁచలను దంతమధ్యమున నుంచుకొని, “ఒకవిద్యాలయమును స్థాపింతును; అందులోఁ బ్రతిమాసము నైదువందలరూప్యము లావశ్యక” మని ఎవ్వరైన ననిరేని అతనిముఖముఁజూచి సిద్ధించునని చెప్పఁగలను. ఒక్క తృణమును దంతమధ్యమందుంచుకొని యీవ్యక్తి యెంతధనమును దేఁగలఁడు! ధనమున్నవారిద్వారమున నేదికాదో, అది ధనములేనివారిద్వారమున నగును. ఈయాశ్చర్యకరవిషయము నెవరుగ్రహింతురు? భక్తుఁడు గ్రహింపఁగలిగినది, విద్వాంసుఁ డెట్లుగ్రహించును; భావింపకయే కార్యములననుష్ఠింపుము; వ్యవసాయముచేయుము; వాణిజ్యముఁజేయుము; పిల్లలకుఁ

* వంగదేశమున నిది వినయమునకుఁ జిహ్నము.

చదువుఁజెప్పింపుము; అన్నియు నగును. సరస్వతియు, లక్ష్మియు, విద్యయు, ధనమును, నీవగును. మీరాలోచించి చేయుదురు; మేమాలోచింపక చేయుదుము. మా "నవవిధానము" వారు డబ్బు చేతఁబుచ్చుకొనకయే బహుకీర్తిని స్థాపింపఁగలరు. "నవవిధానమునకు జయ" మని యననేయందురు. మీరొకొక్క కుటుంబమును సంరక్షింపలేరు; కాని యాలోచనలేకయే బహుపరివారముల్ప్రతిపాలితమగును. ఏఁబదిమందిపిల్లలకు వివాహములు చేయవలయును; రోగులకు నౌషధములు గొనవలయును; ఇదెట్లగునాయని, వైద్యుఁడెట్లువచ్చునాయని భావింపకుము. భావించి యెవరును ఏమియుఁ జేయఁగలిగియుండలేదు. మనుష్యుఁడు చింతలో మగ్నుఁడయ్యెను; అప్పటికిని కుమార్తె వివాహము కాలేదు; కుమారునికి నుద్యోగము దొరకలేదు. చివరకుఁ బిల్లలన్నములేక చచ్చిపోయిరి. పృథివియొక్క పాండిత్యమునకు ధిక్కారమగుఁగాక! ఉపాసనవలనఁ గాఁగలిగినది, చింతవలనను, పాండిత్యమువలనను గాదు. ధనాఢ్యులును, పండితులును దేనినిఁజేయలేరో, భక్తవత్సలుఁడాదేశించనేని మాదేశభక్తుఁడొకఁడు దానిననాయాసముగఁ జేయఁగలఁడు. ఈగణితము అభ్రాంతమని నేనింకను జూపింతును. నాదళములో విశ్వాసపరులున్న, వారును జూపింతురు. భావింపక, భీతిఁజెందక, ఎవఁడగ్నిముఖమున నిలుచుండునో, వానికే జయమగును. ఎవరికి నేమియు లేదో, వానికే జయము. అగ్నికణములమధ్యను దక్షిణహస్తమును, అగ్నిపైని ప్రజ్వలించు జ్వాలలందు వామహస్తమును ఉంపుము! సాహసముతో నిండియుండుము!! ఓసాధకా! ముఖముందుఁ దృణములతో నిలువఁబడినవాఁడవై స్వర్గరాజ్యమున వసియింపుము!!!

ఓ దయాసింధూ! ఓ కరుణామయా! నీవు తామసారముగా నడచిన, నీవు సత్యమనియు, నీయంకశాస్త్రము సత్యమనియుఁ జూపింపనగును. ఈ పృథివియొక్క మనుష్యుల విద్య యది విద్యకాదు; అవిద్య. నీమార్గమును ననుసరించిన నేదిసత్యమో, అప్పటికది యసత్యమని తోఁచును. కాని, ఈశ్వరా! అటుకాదు; అటుకాదు. వెళ్ళఁగా, వెళ్ళఁగా నెట్టిమహాశ్చర్యములను జూచితిని! గొప్పగొప్పవీరులు వచ్చి ప్రవేశింపలేని రాజ్యములోనికి మేమువచ్చి ప్రవేశించితిమి. అరకానితో మేముచేయఁగలిగినది లోకులు లక్షరూప్యములతోఁ జేయఁజాలరు; మేము బాగుగ నుపాసనను జేయము, అందుచే మాకు లేమిడికలుగుచుండును. కౌపీనధారుల మైతిమేని, శ్రీగౌరాంగుఁడు, క్రీస్తు, మోశా వలె సర్వత్యాగుల మైతిమేని, ఒక్కరొట్టెముక్కతో లక్షమందిని తినిపింపనగునని చూపింపఁగలుగుదుము. యావన్మనస్సుతో దీనిని విశ్వసింతుము. ధనాభావమువలన సత్యస్థాపన యాఁగునను సంశయము మాకుఁగలుగునా! ఆనందమయీ! సాహసమునిమ్ము, సత్యస్థాపనయేల కాదు! నీ దాసులిప్పుడే నడుము బిగింతురు. ఒక భారతవర్ష మెంత? ఆయిదార్గురము నిలఁబడితిమి; భారతమును జయింపనే జయింతుము. అయిదువందలమంది నిలబడిన, "దైవమా! ఇంతమంది యేలవచ్చిరి? ధర్మముయొక్క ప్రథమావస్థలో పండ్రెండుగురే యుండురు. శిక్షకులును ఉపదేష్టకులును, పదిపండ్రెండుమందికంటె నెన్నఁడును నెక్కువగ నుండలేదే! దృశ్యమును చూచుటకా వీరు? పుష్టిగలుగును పాయముఁ జూడుము; సమస్తబలమును ఘనీభూతము చేసి కొలఁదిమందిలో నుంచు" మని, మొఱఁబెట్టుదుము. ఇపుడు భయపడుదుమేల! ఇఁకను

భయకారణము లేదుగదా! మేమిదివఱకుఁ బరీక్షించి చూచినయుపాయముననే యిఁకఁ దిగ్విజయులమగుదుము. జయలాభమందిన భక్తులందఱును ప్రార్థనోపాసనలవలననే యందిరి. ప్రార్థనోపాసనలఁజేసియే, వారు పారత్రికధనమును సంచయము చేసిరి. పృథివియొక్క ధనమసారము; మాకు "నీ" వను ధనముగావలయును; నీవారిని మేమాదరింపఁజాతుము. సుబుద్ధినిమ్ము; ఈధర్మసమాజములో నీవారెంతమందియున్నారో, వారందఱకును సుబుద్ధినిమ్ము; భావనాశూన్యమైన యాకాశవిహారియగు పక్షిచందమున, వారు నీయాదిష్టకార్యములను జేయఁగలుగుదురుగాక! లోకభయమున నేమిభయము? ఈవిధమునఁ గార్యములననుష్ఠించినఁ బృథివి కరియమగును. క్షత్రియబలము సిగ్గుచే దాఁగికొనుఁగాక! పృథివియొక్క రాజ్యబలము, బాహుబలము, ధనబలము, అన్నిటికిని లజ్జవచ్చునుగాక! ఏబ్రహ్మబలమును పొందితిమో, అదియే దుర్జయబలము. ఈబలములో బలుఁడనై "జయమగుఁగాక! జయమగుఁగాక!! బ్రహ్మకు జయమగుఁగాక!" యందును; వెంటనే యాకాశము పాతాళము కంపించును. అయిదార్గురుతోనే పృథివి జయింపఁబడును. దయామయా! పంచవింశతివత్సరసఖా! నీవు దయయుంచి ఏసమస్తసత్యములను దెలిపితివో, ఆసముదయమును ఇవ్వ డిక్కడనున్న మిత్రులందఱకును దెల్పుము. ఈసత్యమును బట్టుకొని ఎవరు నుపహసింపకుందురుగాక! మేమీసత్యము నవలంబనము చేసికొని సంసారాసక్తినుండి తప్పించుకొనెదము. నీమీఁద భారము వేసి కార్యముల ననుష్ఠింతుము. మామనస్సులలో నిఁక సందేహములు లేవు; మాకిఁక లేమిడియేమి? నీవు మావాఁడవు; మేము నీవారలము; మాకు సర్వధనమువైన

నీవుసాయపడిన, ధనము సహాయమగును ; జగత్తు సాయమగును. నీవు సాయముకానియెడల నెవరును సహాయము లేరు. మాకుఁ గావలయుసర్వమును నీలోన దొరకునుగాకయని కోరుదుము. దయామయా! దయనుంచి మమ్ముల నాశీర్వదింపుము! మేము పృథివియొక్క కుటిలజటిలాంకశాస్త్రమును వదలి, నీచరణములఁ బ్రార్థించినవారమై మహాకీర్తిని స్థాపనఁజేసిపోదుముగాక!! కృపఁజేసి దుఃఖులగు నీతనయుల కీదినమున నీయాశీర్వాదము నిమ్ము!!!



# ఏకాదశాధ్యాయము.

## జయలాభము.

భానువారము ౨౩ ఆశ్వయుజము ౧౮౦౪ శకము.

భగవానుని యొక్క యానందపుఖాతాలలోఁ బ్రథమమున దుకాణ మెప్పుడు తెఱవఁబడినదో అప్పుడే, ఋణముమీఁద నేదియుఁ గొనఁబడదనియు, అప్పుమీఁద నేదియు విక్రయింపఁబడదనియు నొకనియమము చేయఁబడెను. సంగతిసందర్భములనుబట్టి కొనుటయు, ఖరీదుపుచ్చుకొని వస్తువులను విక్రయించుటయుఁ బ్రథమమునుండియు నియమమైయుండెను. ఈనియమమునుండి మనస్సెన్నఁడును, ఈవైపునకుఁగాని, ఆవైపునకుఁగాని చెదరలేదు. ఇతరులమాటలను విని యీవ్యవసాయమందు దిగలేదు; నాది కాని దానిని నాది యనలేదు. ఏకొంచెమధికారముండెనో, దానికిమించినవిషయములను ముట్టలేదు. నాకు దొరకినకొంచెమును, నాఘటమునందుండిన కొంచెము ప్రేమరసమును, నాకబ్బినయల్పవిద్యను, నేనుపాటించిననాల్గువిషయములను మాత్రమే కార్యములో పరిణతిఁజెందించితిని. ఈప్రకారమెంతో జాగరూకతతో వాణిజ్యము నడిపింపవలసివచ్చెను; క్రమముగ వర్తకము పెద్దదయ్యెను; అనేకులు కొనవచ్చిరి, ఈమాత్రము నియమముండుట చేతనే వ్యవసాయమింతలక్ష్మీప్రదమయ్యెను. శాస్త్రములో నుండినదనిగాని, లేక యల్ల యీమనుష్యుఁడు నుడివెననిగాని, వివేచనచేయువాఁడను గాను. ఆ దేదియుఁ జేయఁబోయినంతనే గోలలోఁ బడుదునని యెఱిఁగియుంటిని. ఇతరులనాలుకతో రుచిచూచిన విపత్తునందుఁ బడుదునను భయముండినది; ఇప్పుడును ఉన్నది.

వ్యయముగ గ్రహింతును; తరువాతఁ జేయుదును. మొదటినుండియు నిదియె నాప్రతిజ్ఞ. వైరాగ్యమును గానిమ్ము, యోగమును గానిమ్ము, ఇతరులమాటమీఁద స్వీకరింపను. లోపలనేమియున్నదో, చివఱకేమగునో ఎవరికిఁ దెలియును? అంధకారములోనికిఁ బ్రవేశింప నుచితము గాదు. నేత్రములున్నవి; కర్ణములున్నవి; హస్తములున్నవి. పరీక్షింతును; చక్కఁగాఁ బరిశీలింతును; పిమ్మట సిద్ధాంతముఁ జేయుదును. తల్లి యింటనే యున్నది; ఆమె నడుగుదును, గురువు గృహమందే యున్నవాఁడు; ఆయన నడిగి యర్థము తెలిసికొందును. ఆప్తమిత్రుఁడు కుడిచేయిప్రక్కనే యున్నాఁడు; "హరీ! నాకు సాయము చేయు" మని ఆయన నడిగెదను. గృహమున ధనము సంచయమై యున్నది; అందుచే ఖర్చుచేయుదును. ఎక్కువగాఁ గావలసియున్న భగవానుఁడిచ్చును. ధనవంతుఁడనైతినేని నెమ్మదిమీఁద నపుడు వృద్ధిసేయుదును; ఇట్లనుకొనుచు నావనిలో నేనుంటిని. బజారులో మిగుల బాగ వర్తకము సాగించితిని; అప్పు కాలేదు. మూలధనమల్పముగాఁ గలిగిన నల్పవ్యవసాయమును భగవానుఁడు మహైశ్వర్యమునకుఁ గారణముగాఁ జేసెను. కొనవచ్చువారికి నప్పుమీఁద నిచ్చువాఁడను గాను; ఈశ్వరునిలో నేవ్యవసాయమును నడిపితినో, అదియును రొక్కముమీఁదనే. రొక్కముకొఱకే ఆశ. రొక్కము పుచ్చుకొనక విక్రయింపనను నియమము ఈశ్వరదత్తము. లోభముకలుగఁజేసిన సందేహమువలనఁగాని, అవిశ్వాసము మూలమునఁగాని యీవ్రతమును బూనలేదు. తాను రొక్కపు డబ్బునిత్తును గాని, అప్పునియ్యననియు, అతిశయమైన నగదు విలువ కలిగిన రైశ్వర్యమును దానర్పింతుననియు, విధాత

జీవనారంభముననే తెలియఁజెప్పెను. అందుచే నగత్యమైనకాంచనమును, మానవుఁడు పొందఁగలిగిన సమస్తమును, నాకు లభించుననువిశ్వాసము కుదిరెను. సాధనఁ జేసితిని; భవిష్యదనిశ్చితధనముకొఱకై యాశపడకుంటచే లాభమే యయ్యెను. రాత్రిగడపితిని; మరునటినాఁడుదయమున నభిలషించిన ధనమును బొందితిని. తరువాత నోరకునుగదాయని యూరకుండిన సాగదు. అందుచే నాయనకుఁ బ్రణమిల్లి, "ప్రభూ! రొక్కపుసొమ్ము నిత్తునంటివిగదా! యిమ్ము; అగత్యమైన వేచియుందును; కాని నీవద్దనుండి పుచ్చుకొని కదలుదును" అని వక్కాణించితిని. నావిషయమునను, పృథివివిషయమునను, దేశవిషయమునను, మానవజాతివిషయమునను, ఏదేదికోరితినో, అదంతయుఁ గ్రమముగ లభింపఁగంటిని. "లభింపనాలస్యమగును; లభ్యముకాదు; కానసంభవ" మను నీమాటలనన్నిటి వింటిని. "పరలోకమందు ఫలలాభముకలుగును; కీర్తిస్థాపితమగును; ఇక్కడఁ గేవలము బీజవపనమే" యను జనులువిశ్వసించు వాక్యములకుఁ బ్రమాణములును, నానాశాస్త్రములలోఁ గంటిని. దేనినిఁబొందుటకై వేచియుండ వేచియుండ ననేకులశరీరములు క్షీణించిపోవునో, రాత్రింబవళ్ళు గడచిపోవునో, మాసామాన్యబలముచే, సామాన్య యత్నముచే నది లభ్యమయ్యెను. అనేకులు ధర్మసంస్కారకులు, మహాత్ములగుపండితులు సత్యమునువిస్తరించుటకై కష్టములను సహించి, ఎంతోపరిశ్రమచేసి, చివరకు భవవ్యవసాయములో వంచితులై పరలోకమునకు వెళ్ళిపోయిరి. వారు బీజవపనముఁజేసి వెళ్ళిన సహస్రవత్సరములకుఁ దరువాత మేము ఫలము ననుభవించుచున్నాము; మాకీకాల మనుకూలమయ్యెను;

గాఢముగుపేర్చిన గాఢతరమై నమస్తమును మార్చివేసెను. పంచవింశతివత్సరముల పరిశ్రమచేఁ బంచశతవత్సరముల ఫలము లభింపఁగ నిప్పుడు చూచుచున్నాను; ఒక్కనాఁటిపని ఒక్కఘంటలో నగుచున్నది. ఏబీజమునుండి వృక్షముత్పన్నముగా ననేకవత్సరములు పట్టునో, ఫలములు ఫలింప బహుకాలము వేచియుండవలయునో ఇప్పుడది త్వరలోనే యగును. బ్రహ్మనామోచ్చారణ పూర్వకముగాఁ గార్యమారంభమయ్యెను; రెండువత్సరములు గడచిగడవకముందే కావలసినంతఫలించెను. నమస్తము లోకారణ్యమయ్యెను. దుర్వహభారమునువహించుటకై దేశదేశాంతరములనుండి జనులువచ్చుచున్నారు. పంచవింశతివత్సరములకుఁ బూర్వ మెట్లుండెను! పంచవింశతి వత్సరములకుఁ బరమం దెట్లయ్యెను! ఇదంతయు నెవరికిఁ దెలిసియుండెను! కల్పనలోను నెవరు ననుకొనలేదు! ధర్మమునకు నధర్మమునకు నెట్టివివాదము లుండెను! అధర్మముమీఁద లోకుల కెట్టియాసక్తియుండెను! బ్రాహ్మధర్మమెట్టిహీనావస్థలోనుండెను! భక్తిప్రేమ లెంతకొఱతఁగా నుండెను! దుర్బలబంగాళీయునకు నుత్సాహ మెంతతక్కువగానుండెను! పది, యిరువది వత్సరము లెడతెగకుండఁగఁ గృషిచేయుటచే, సత్యవిస్తారముయొక్కయు, సత్యరక్షణయొక్కయు సంభవము వృద్ధియయ్యెను. ఏదేశములో ననేకములగుసద్విషయములను గుంటిపాలగునో, ఆదేశములో బ్రాహ్మధర్మము నవవిధానములోనికిఁ బరిణతమయ్యెను. ఏవత్సరమునందున్నతికలుగలేదో, అట్టివత్సర మింతవఱకు రాలేదు. ఈశ్వరుఁడు నిదిరించినట్టిమాసముగాని, సప్తాహముగాని యెక్కడ? జనులకుఁ బరమువిషయమై వినిపింపని దెప్పుడు? సింహమెదిగెను; కేవలవంగదేశమేల? భారతవర్ష

మంతయుఁ గంపించుచున్నది; ఇటునటు కదలుచున్నది. నవవిధానపక్షమునఁ జేయఁబడిన కార్యములలోఁ బూర్ణముగానిదేది? ఫలింపక పోయిన దేది? మహత్తరమగు కీర్తి ప్రతిష్ఠితమయ్యెను; భక్తుఁడు హరినామమునుచ్చరించుచు మొదలుపెట్టిన చిన్న చిన్న కార్యములును సఫలమయ్యెను. ఇప్పుడు సత్యసూర్యునివైపునకుఁ దిరిగి, సత్యాగ్ని మధ్యహస్తమునుంచి, పొందవలసినదిపొందితినని, దర్శింపవలసినదిదర్శించితినని, చెప్పనగును. ఆనందపుబాజారులో నెవరు దుకాణమును దెఱచిరో, వారికే విస్తారముగ లాభము దొరకెను. వర్తకముఁ జేసినకొలఁదిని కేవలలాభ మేకలిగెను; నష్టము రాలేదు. ఇఁక నేదియు నన్ను భయమునందింపలేదు; ఏదియు నన్నుఁ గష్టపెట్టలేదు. ఏయాదాయవ్యయముల పట్టికఁ దెఱచి చూచినను, అయిదురూపాయలతో నారంభమును, అయిదులక్షలరూపాయలలాభమును గనఁబడును. పూరిగుడిసెలో దుకాణము పెట్టికొనినవానికమితధనము. ఎవరివిషయమున నీశ్వరుఁడు, జన్మింపఁగనే అవినశ్వరాక్షరములతో "జయలాభ" మని వ్రాసెనో, అతని జయలాభము నెవరాఁపివేయఁగలరు? "వీండ్రు జయులగుదురు; వీరు ధూళిముష్టినిఁ బట్టుదురు; అది స్వర్ణముష్టియగు" నని ఈశ్వరుఁడు నుడివెను. హరినామోచ్చారణపూర్వకముగాఁ జేసినదానివలననే పృథివికి మంగళమగును. స్వార్థపరుఁడనై కార్యములను సాధింపలేదు; రెండురూకలలోభముచే నుపార్జించుటకై రాలేదు; దేశముయొక్క దుఃఖముచే దుఃఖితుఁడనై వచ్చితిని. "వర మడిగిపుచ్చుకొ" మ్మని యీశ్వరుఁ డారంభముననే చెప్పెను. భక్తుఁ డేవరమునడిగెను? జయినగునట్లు వరమిమ్మనెను. "భక్తునకు జయము నిస్సంశయ" మని వెంటనే యీశ్వరుఁడు స్వహస్తముతో

వ్రాసియిచ్చెను. భక్తితోఁ జేసినదెల్ల జయమగునని యిప్పుడు కనుచున్నాను. ఈవిషయమునకు నిపుడు గణింపుటకు వీలులేనన్ని ప్రమాణములు దొరకుచున్నవి. ఓశ్రోతృగణములారా! భారతవర్షీయ బ్రాహ్మమందిర విషయములోను, భారత వర్షీయబ్రాహ్మసమాజ సంబంధములోను, నవవిధానవిషయములోను, ఆరంభింపఁబడిన కార్యములలో నేది పూర్ణమును సఫలమును గాలేదో చెప్పుఁడు! దేశమందు హరినామముయొక్క కోలాహలధ్వని మ్రోసాగెను. ఎట్టి మార్పో, చూడుఁడి! ఏదేశములో మద్యపానము ప్రబలమగుచుండెనో ఆదేశము గౌరాంగునియొక్క మధుమయమైన హరినామమున నున్మత్తమయ్యెను. దేశీయు లింగ్లీషువిద్యను నేర్చికొని, మృదంగమును వాయించుకొనుచు, నట్వులవలెఁ గీర్తనముఁ జేయుచుఁ దిరుగుదురని ఎవరెఱిఁగియుండిరి! అవిశ్వాసము, నాస్తికత్వము పొడసూపుచుండెను; అవిశ్వాసభావ మడవివలెఁ బెరుఁగుచుండెను; ఇట్టిసమయమున వంగదేశముయొక్క యువజనులు నిమీలితనేత్రులై, "ఇదిగో! బ్రహ్మదొరకె; ఇదిగో! బ్రహ్మదొరకె; ఇదిగో! సర్వేశ్వరుఁడును, మహేశ్వరుఁడును నైనహృదయేశ్వరునిఁ బట్టికొంటి"మనుచు నందురని ఎవరెఱుఁగుదురు? ఈసకలము నిపుడు స్వచక్షులవుతోఁ జూచితిని; ఇతరులకుఁ జూపించితిని. ఇపుడు శాక్తవైష్ణవులలో మిలనమయ్యెను. కాళీకృష్ణ ఏకాసనమున నాసీనులైరి. భక్తుఁడు కాళియందుఁగృష్ణుని, కృష్ణునందుఁ గాళినిఁ జూచుచున్నాఁడు. శక్తికి భక్తిభావమునను, భక్తికి శక్తిభావమునను బూజజరగుచున్నది. వంగదేశమున శాక్తభక్తులును, భక్తశాక్తులును, ఒకటియగుచున్నారు. శాక్తునిమందిరమును, భక్తునిమందిరమును, రెండు నొకటిగఁ గలసిపోయి యీమాలు సువర్ణమందిరమగును. జననికిఁ జూపఁబడుభక్తియే హరికినిఁ

జూపఁబడినది ; హరిభక్తులు హరికి నే భక్తి నర్పించువారలో, జనసకి నాభక్తినే యర్పింప మొదలు పెట్టిరి. ఈశ్వరేచ్ఛచే నవవిధానమున రెండు నేకమయ్యెను. పంచవింశతివత్సరములయొక్క పరిశ్రమ సఫలమగుచున్నది. దేశమందు జాతిభేదము మొదలగునట్టి యెన్నికుసంస్కారముల ప్రభావము చెల్లుచుండెను! అందుకొఱకై యీమనస్సెంత యేడ్చెను. "గౌరాంగుఁడెక్కడ! శ్రీచైతన్యుని జాతినిర్విశేషప్రేమ యెక్కడ?" అనుచుఁ బ్రాణ మెంత యేడ్చెను? ఒక్కొక్క కన్నీటిబిందువు పడినట్లుగనే, లక్షలక్షయకరముల భూమి పండసాగెను. ఇదంతయు సిద్ధించినది నిజగుణమువలనఁగాదు ; హరిపదములను బట్టుకొనుటవలననే సర్వము నయ్యెను. ఒక్కపిడికెఁడుదుమ్మును చేతఁబట్టిన నది పిడికెఁడుసువర్ణమగునని తిరిగిచెప్పుచున్నాను. హరినామము విద్వాంసులమధ్యను నాగరికులమధ్యను బ్రవేశించినది ; వంగదేశపుయువజనులలోనికి మునులును, ఋషులును వచ్చి ప్రవేశించుచున్నారు. మే మెంతప్రార్థనఁ జేసియుంటిమి! అట్లు ప్రార్థించుటచేతనే, అట్లు భిక్ష మెత్తుటచేతనే, హరి యిదంతయు నొనగూర్చెను. ఇందుచేతనే మాకు రొక్క-రొక్కముగా లాభము వచ్చుచున్నదని చెప్పుచున్నాను. దేశమున కెద్దియో సేవచేయవలసియున్నది. అపుడు పదివేలమంది కార్యమునుబూనిరేని, చివరకు నసలు చెడుననియెంచి వెంటనే భక్తదళ మల్పమై పుష్టిఁజెందునట్లు చూచితిని. నానాదిక్కులను నాకు శుభమే కాన్పించుచున్నది. హరినామ మెట్లల్లుకొనిపోయినది! ఇరువదియైదువత్సరములలో దేశముయొక్క వైఖరి భిన్నలక్షణమును దాల్చినది. ఇపుడు శత్రుసంఖ్య వృద్ధియైనను, విరోధానలము ప్రజ్వలితమైనను, విపత్తులువచ్చి మమ్ములను ముంచివేయ

యత్నించినను, భయములేదు. ఏలయన మేము జయులమగుటకే జన్మించితిమిగదా! ఏయుద్ధమందు హారిలేదు? ఏయే మహాయుద్ధములలోనికి దిగితిమో, ఎన్ని ప్రతికూలానుకూలావస్థలలోఁ బడితిమో, సర్వత్ర జయమయ్యెను. ఈశ్వరుఁడు తనచేతితోఁ మమ్ములను స్పర్శించెను; అందుచే మేము దుర్జయులమైతిమి. ఆయనప్రేమయొక్క నిదర్శనము లనేకములు చూచితిమి! మానలుదిక్కుల నొకవంద రెండువందలకీర్తిస్తంభములు స్థాపితములయ్యెను. "ఎంత పరిశ్రమఁజేసితిరి! మీశ్రమ కొకటికిఁ బదింతలుగా ఫలము నిచ్చితి" ననుచు హరి యుత్సహింపఁజేయును. ఇట్లుగాకున్న సాగునా? లాభమును చేతులతో దోఁచుకొనుచున్నాము! మేమనుదినమును సంపాదించుకొని తిందుము. లేదేని ప్రాణపతిమాటలు రుచింపవు. అనుదినమును లభింపదేని మేము నిలిచియుండలేమని యెఱిఁగియుండియే, ఈశ్వరుఁడీయేర్పాటుఁజేసెను. ఇపు డింతకుఁబదింతలుగాఁ బరిశ్రమఫలమును బొందితిని. వార్ధక్యములోఁ దిరిగి బాలకుఁడ నగుదునని తోఁచుచున్నది; తిరిగి మహాపరిశ్రమఁజేసి వంగదేశమును గంపింపఁజేయఁ గోరిక యగుచున్నది. కోటిబాలురువచ్చి దేహమధ్యమునఁ బ్రవేశించుచున్నట్లున్నది. యౌవనకాలము తిరిగివచ్చి నేత్రముల నగ్నిమయోత్సాహములో, జ్వాలమానాగ్ని నమముఁ జేయుచున్నది. ఈశ్వరకైంకర్యములో జీవనమును సమర్పింపకుందునా? కడుదుఃఖితుఁడనైతిని; ఉత్పీడితుఁడనైతిని; అనేకులచేఁ బదమర్దితుఁడనైతిని; అయినను నాకేమియుఁ గొఱంత కలుగలేదనే నేననుకొందును. హరిధన్యుఁడు, హరిధన్యుఁడు, హరిధన్యుఁడు; నాకుఁ గేవలము లాభమేకలుగుచున్నది. నే నే

కార్యములను జేసితినో, ఆకార్యములే వేలవేలజనులను బరమాత్మ దిక్కునకు నాకర్షించుచున్నవి. గృహమునందు దాఁగియున్నను బదివేలమందిజనులు "హరి, హరి" యనఁగఁగందును. ఓయి, హరీ! ఇందుకొఱకై నేను దుఃఖించియుండలేదా? యంటిని. హరి వెంటనే కలకత్తాలో బృందావనమును జూపెను; ఆయమునను, ఆప్రేమ వ్యాపారములను జూపెను. ధనధాన్యములు దొరకలేదని నాకు దుఃఖమగుచున్నదియా? అగ్రహారములు లభ్యముకాలేదను మనస్తాపమున్నదా? నేను హరిదాసుఁడను; ప్రభువునకున్నది దాసునకున్నది. బ్రహ్మాండము నాహస్తగతమైనది. నేనపజయము నొందుటకు జన్మించితినా? రసనయందు హరినామముచ్చరించు సామర్థ్య ముండనేని, ఈరసన యెన్నడు నపజయమనుమాట నుచ్చరింపదు. అన్యవిషయములలో హీనుఁడనయినను, ధనము లేకుండినను, మానములేకుండినను, అధికసాధనభజనలు లేకుండినను, నామీఁదను, నాదశమీఁదను, హరినామముయొక్క బలమున్నది. ఇదిగో! శ్రీగౌరాంగుఁడు మాదశమునందు వచ్చి ప్రవేశించి నాట్యము చేయుచున్నాఁడు. సమస్తమును స్వచక్షువులతోఁ జూచితిని! విశ్వసింపకుందువెట్లు? ఈభక్తుఁడు నష్టపడలేదు; దేనిమూలమునను నష్టపడలేదు; కేవలము జయలాభమునే పొందెను. ఇంకెట్టి సంవాదమును గోరుదువు? జయినై మార్గమార్గమునను హరినామము యొక్క పతాకనెత్తితిని. అహంకారముచే నుబ్బిపోలేదు. హరినామముయొక్క బలిమిచే మీవంటి నావంటివారందఱు సమస్తమ్మును జేయఁగలరు. హరినామముయొక్క బలిమిచే మనము పృథివి నొకకుండపెంకువలె విసరి వైకుంఠమునఁ బారవేయుదము. మనము నరాధములమగుటచే నిప్పటికి నిట్టిదుర్దశ యున్నది; కాని,

ఊహాదుర్దశలోఁగూడఁ బనికిమాలినవస్తువులను జేతిలోఁబట్టికొని "హరి" యనఁగనే స్వర్గముఁ గాఁజూచితిని. బయలుమీఁద గృహనిర్మాణమయ్యెను. విరోధులయొక్క ప్రాణమధ్యమునను నవవిధానము ప్రవేశించుచున్నది. హిందూక్రిస్టియనులలో నన్యోన్యానురాగము కలుగుచున్నది. కృష్ణక్రీస్తులలో సమ్మేళనమగుచున్నది. యువవృద్ధులుకలసి ప్రణయములో బద్ధులగుచున్నారు. సహస్రోన్నతిద్వారములు తెఱవఁబడినవి. వంగవాసులారా! శీఘ్రముగ లేచిరండు! చక్కని వాయువులు వీచుచున్నవి, లేచిరండు! భక్తిఘట్టమునకు రండు!! తెరచాప నెత్తుఁడు!!! నౌకను వదలుఁడు!!! ఒక్కపాపిష్ఠునిజీవన మింతకీర్తి నిస్థాపించెనేని, మీరలు, సహస్రశాస్త్రవరులు ఏకమైరేని, హరినామముయొక్క మహిమను ఎంత విస్తరింపఁజేయఁగలరు! దేశములో నెంతకీర్తి స్థాపనము చేయఁగలుగుదురు! ఒక్కపాపి యింత చేయఁగలిగెను! మీరలు సహస్రసాధువులు పరిశ్రమఁజేసి యింకను ననేకచిత్రములను జూపుఁడి! దేశము నీమెట్టుమీఁద నాఁపుటకు వీలులేదు. కల్యాణముయొక్క రథము, పుణ్యముయొక్క రథము వచ్చినది; నరనారులకు సంవాదము నిండు! మనమస్తకములను ఖండఖండములుగఁ జేయుట కెవరిసాధ్యము! ఈనకలామరాత్మలమీఁద జేయివేయుట కెవరిసాధ్యము!! దుర్జయులరై యీ వంగదేశమును దీసికొనివెళ్ళి స్వర్గములోఁ జేరవేయుఁడి!!!

ఓదీనశరణ్యా! భారతపరిత్రాణకర్తా!! మేమెట్టిసుఖమును పొందితిమి! సంసారము విఘ్నమయమని లోకులందురు; బీజమును వపనముచేసిన వానరాక, ఎండచే నెండిపోవునందురు. మేము దుఃఖపువాక్యములను జాలఁగవింటిమి. అష్టప్రహరములును

నీప్రసంగమునే చేయువారుగూడ, భయభయపుమాటలను జాలఁ వినిపించిరి. కాని, నీప్రసాదముచే మే మెన్నఁడైన, క్షతిగ్రస్తుల మగుదుమని కాని, ఓడిపోతిమని ఎవరిముందరనైన చెప్పుకొందుమని కాని యనుకొనలేదు. హరినామముయొక్క బలముండుటచేఁ బ్రాణమున్నను సరే, పోయినను సరే, యనుకొని యుద్ధమున దిగితిని. అభేద్యకవచమును ధరించుకొని, సైతానుతో యుద్ధము చేయువానికి శరణ మెక్కడిది? అట్లేయయ్యేనేని వ్యాఘ్రము ధ్రువుని హతముచేయునదియేకదా! అట్లైనన్ఁడను గాలేదు; అట్లైనన్ఁడను అగుటకు వీలులేదు; అందుచే విపత్సమయములలో "హరి, హరి" యని ఎంతకొట్టుకొంటిని! తల్లీ! చూడుము! నేఁడు నేను జయిన్నై యెంతరాజ్యమునకు రాజునైతినో చూడుము! అస్పృశ్యుఁడని ఎవరు నన్ను బరిత్యజించువారలో వార లీదినము అతిథులైవచ్చిరి. తల్లీ! చూడుము! ఎవరు మనుష్యులమీఁద రాళ్ళురువ్వువారలో, కపాలమును భేదించి రక్తపాతమును జేయువారలో, వారు నేఁడు దాపునకువచ్చి, "ఎక్కడ మీజననిఎక్కడ? మేమామెను బూజింతుము. మేము నవవిధానమునకు విపక్షులమైయుంటిమి; కాని యిపుడు, ఈశ్వర తనయులయొక్కరక్తమును గనఁగంటిమి; ఈమాట మీజనని మున్నింతు"మని యనుచున్నారు. తల్లీ! మాకిఁక నేమియిచ్చినను, ఇయ్యకున్నను జయమునిచ్చితివి. జయపతాక లేచినది; జయవృష్టి రైనది; ఇందులకని నీకు మేము ధన్యవాదముల నర్పింతుము. దుఃఖదుఃఖితులకు ఇంతసుఖమునిచ్చితివి! ఋణముమీఁద ధర్మమును నడపింప నగత్యము లేక పోయెను. నిర్జనకాననమందు అనిశ్చితజయమును లక్షించుచుఁ గాలయాపనముచేయ నవసరము రాలేదు. ఎంతమంది

జనులు జయమునకై అనిశ్చయమార్గమునందుఁ బ్రతీక్షించుచున్నారు! మేమా మార్గమును బట్టికొనిపోవలసిరాలేదు; అందుచే మాకుఁ గడు నాహ్లాదమగుచున్నది. మేము పృథివిమీఁదనే వైకుంఠమును జూచితిమి. సమ్ముఖమునందును, బాహ్యమందును వైకుంఠధామమే వంగదేశ మూఁగులాడుచున్నది; హరినామముయొక్క ప్రభావ ముండినది కాదు; మృదంగసహకారముతో హరినామము గీర్తింపఁ బడెను. ఎవరు బాగుగ నృత్యము చేయఁగలమాయని యిపుడు యువ వృద్ధులలోఁ బోరాటమగుచున్నది. ఎవరి హరిభక్తి యెక్కువదని వంగదేశీయులు కోలాహలము చేయుచున్నారు. హరీ! ఎట్టి విచిత్రములను జూచితిని! ఇంకెట్టి విచిత్రములను జూచుచున్నాను! మేము నిన్నుఁ బూజించి కడులాభము నందితిమి! ఈధనముయొక్క గుణమును ఒక్కనోరు వర్ణింపలేదు. వైకుంఠములో నేమిలభ్యమగునో అది తరువాత మాట; ఈదినము లభ్యమైనదానికే పరమానందము. హరిపాదపద్మములు చేతఁజిక్కినవి. ఈదేశములో నిపుడు కడు సంశోధన యగుచున్నది. ఎన్ని కక్షప్రతికక్షులు ఎగిరిపోవుచున్నవో, జాతిభేదములు, మతోపశాఖలభేదములు, కాలభేదములు, ఎట్లు నాశనమగుచున్నవో, ఎవరు చెప్పఁగలరు? హరీ! విశ్వాసముయొక్క యాలోకమును బంపుము; లోహమయ భారతము సువర్ణభారతమగును; కలియుగభారతము సత్యయుగభారతమగును. పూర్ణచంద్రునియొక్క యాలోకము భారతముపైఁ బడెను; ఆహా! భారతమాతకు దుఃఖ నివృత్తి యయ్యెఁగదా! మాతృభూమి ధన్యమయ్యెను. కృపాసింధూ! అపజయము నొందమని నమ్మి, ప్రాణముమీఁద మోహమ్మును విడిచి, యుత్సాహముతో నీనవవిధానమును సర్వత్ర ప్రచారము చేయున ట్లాశీర్వదింపుము! దయామయీ! జననీ!! కృపఁజేసి నీసంతానమున కీదిన మీయాశీర్వాదము నిమ్ము!!!

# ద్వాదశాధ్యాయము.

---

## వియోగము: సంయోగము.

భానువారము ౩౦ ఆశ్వయుజము ౧౮౦౪ శకము.

మనస్సు పూర్ణవస్తువును ఖండఖండములను చేయును. ఆమనసే యాఖండఖండములను తిరిగి దగ్గఱఁజేర్చి సంయోజితము జేయును. ఆధ్యాత్మిక విషయములలోను, వియోగ సంయోగములు సర్వదా తటస్థించుచునే యున్నవి. జడ జగత్తుయొక్క వస్తువులన్నియు వియుక్తములై పరమాణువులక్రింద మాఱిపోయి, తిరిగి యాపరమాణువులన్నియు సంయుక్తములై పూర్వపువస్తు వేర్పడునట్లుగనే, మనస్సును ధర్మరాజ్యములోఁ గూర్చుండి సర్వదా వియోగసంయోగ క్రియల సంపాదించుచున్నది. కొందఱమనస్సులలో నీవియోగ భావము ప్రబలము; మఱికొందఱమనస్సులలో సంయోగస్పృహ యెక్కువ. కేవల మొక్కవస్తువును మనమున ఖండఖండముఁ జేయుట, ఒక్కభావమును ఖండఖండముగ భావించి వాని నధ్యయనముఁ జేయుట, ఒక్కవస్తువుయొక్క గుణములను ఒక్కొక్కటిగ భావించుట, కొందఱయభ్యాసము. మఱికొందఱు వియోగముదిక్కునకే తొక్కి చూడనిచ్చగింపరు; అఖండవస్తువును దర్శింపఁదలఁతురు. "ఒక్కొక్క గుణమును ఇంకెంతసేపని భావింపను, పూర్ణవస్తువు నింకెంతని విచ్ఛిన్నము చేసిచేసి చూడను;" అనునభిప్రాయమును గొందఱ కొందఱమనములందుఁ బ్రబలముగ గాననగును. నాన్వభావములో రెంటిని 'సామంజస్యము గానుంపు యత్నములు జరుగుచున్నవి. ఏదో యొకప్పు డీరెండుభావములయొక్క సామంజస్యమైపోయినదని చెప్పుటకు వీలులేదు. సామాన్యమానవులవలెనే నేనును ప్రథమమున

ప్రాంశిక దర్శనపక్షపాతినై యుంటిని. ప్రతివిషయమును సూక్ష్మరూపమున విచ్ఛిన్నముగా దర్శించుటకే యత్నించువాఁడను. ఒకొక్కటిగాఁ జూతమను నిచ్ఛయే ప్రబలమైయుండెను. పాపమెట్లుపోవునాయనియే ప్రథమమునఁ దలపోయువాఁడను; మనస్సెట్లు క్షుద్రవృత్తులలోనికి దిగకుండునాయనియే చింతించువాఁడను. పరసేవఁ జేయుచు జన్మ నెట్లుసార్థకముచేసికొందునాయను నీభావమే కొన్నిమాసములవఱకు స్థాయియైయుండునది. స్వార్థపరత్వ మెట్లుపోవునా, దయలోమునిఁగి యెట్లుందునా యనుచింత యొకొక్కప్పుడు ప్రబలమైయుండునది. ఒకప్పుడు చదువుమీఁద నాసక్తికలుగునది, మఱియొకప్పుడు విరక్తి పుట్టునది. ఒకప్పుడు పుస్తకములు లేనియెడలఁ దృప్తికలుగునదికాదు, మఱియొకప్పుడు పుస్తకములు బాగుండునవిగావు. రెండుభావములును మనస్సునందుండెను; కాని యొకటితరువాత నొకటిచొప్పున సాధనఁజేసితిని. ఒకప్పుడు వైరాగ్యమును, మఱియొకప్పుడు పుణ్యమును ఇంకొకప్పుడు ప్రేమను ఒకొక్కటిగా సాధనఁజేసితిని. ఈశ్వరుని యొక్క స్వరూపములలోఁ బ్రథమమున న్యాయభావమే హృదయమందుఁ బ్రబలమై ప్రకాశించుచుండెను. బాహ్యమందుండు న్యాయభావమును జూచినమీఁద నంతరంగమునందుండిన యన్యాయ భావమునకై గడుతీవ్రముగ ననుశోచన కలుగనారంభించెను. అనేకదినములకుఁ బిమ్మట న్యాయమునకు మాఱుగా దయాభావమును, అనుభావమునకుఁ బరివర్తనముగా భక్తిప్రేమ భావములును సంచరించెను. యావత్స్వరూపమును ఏకత్ర గ్రహించుటకు ఆసక్తి యుండినదిగాదు; ఎప్పుడేది ప్రయోజనమగునో, అప్పుడు దానినిఁ జేయుటకయియే యత్నించువాఁడను. వియోగస్పృహలోనే దినములు గడచుచుండెను; ఏకాంశ మావశ్యకమో ఆకాంశమును

జేయుటకే యిచ్ఛయుండెను. అఖండముమీఁద అనురాగము కలుగు నదిగాదు; అఖండమును పట్టుకొనలేనగియు, పట్టినను అంతలాభము లేదనియుఁ దోఁచునది. సమ్ముఖమున నౌషధాలయమును జూచితిని గాని సమగ్రశోభమీఁద దృష్టిలేకుండెను. రోగి కేయౌషధము ప్రయోజనమో తన్నిమిత్తమయే హస్తము ప్రసారితమగును. నవవిధాన భావ మావిర్భవింపకుంటచే సౌందర్యజ్ఞాన మంకురింపలేదు. రోగమును ముందు శాంతింపఁజేసికొని పక్షపాతినై నదిలేనిది తరువాతఁ జూచుకొందమనియే లోలోపల ననుకొనువాఁడను. భయానకరోగమును; అత్యంతాభావమును కలదు; కావున వియోగస్పృహ హృదయమునఁ బ్రాబల్యముతో నుదయించెను. ఒకొక్కయభావము విముక్తమైన కొలఁదిని ప్రకృతియొక్క యాశ్చర్యకౌశలమును గనఁగంటిని. ప్రకృతియొక్క క్రియాకలాపములు గద్యరూపమున వ్రాయఁబడుచున్నను, తరువాతఁ దన్మధ్యమునఁ బద్యములననేకముఁ జూచితిని. ప్రకృతియొక్క కౌశలము ఒకదానితరువాతనొకటిని దెచ్చి నిర్ధారితనియమానుసారముగా నానకళమును సంయోగించుచుండఁ గంటిని. మందారముయొక్క యవసరము కలిగినపుడు, భక్తితో మందారమును గ్రహించితిని. తులసి యావశ్యకమైనపుడు భక్తితోఁ దులసిని గ్రహించితిని. తరువాతఁ జూడ నెవరో సమస్తమును సంయోగించి పుష్పమాలగ గుచ్చుచుండెను నవవిధానమందు సమస్తమును దండగఁ గ్రుచ్చుదమనునిచ్ఛ మొదటఁ గలుగలేదు; కాని ప్రకృతిమధ్యమున నెవఁడో యదియ చేయుచుండెను. క్రీస్తుని మన్నింపవలయునని ఎవరెఱుఁగుదురు? శ్రీగౌరాంగుని నాదరింపకుండిన నాకు జరుగుటలేదని యెప్పుడు గ్రహించితినో, అప్పుడే నవద్వీపమునకు వెళ్ళితిని; నవద్వీపమునుండి శ్రీగౌరాంగునిఁ

దోఁడితెచ్చి హృదయమునందుంచుకొంటిని. బుద్ధునియొక్క యావశ్యకత కలుగఁగనే, వృక్షతలమునుండి బుద్ధుని పీఠ మధ్యమునకుఁ దోడ్తెచ్చితిని. ముగ్గుర నొక్కచోటికిఁ దేవలయునని యెవరెఱిఁగియుండిరి? భగవానుఁ డీవిధమున నొక్కొక్కనినిఁ దెచ్చి భక్తమండలిని గూర్చునని యెవరెఱుఁగుదురు? లోలోపల నిట్టి కౌశలము నెవరో యవలంబించుచున్నారని నేనెఱిఁగియుండలేదు. సమయముయొక్క గత్యనుసారముగను, అంతరముయొక్క రుచ్యనుసారముగను, ఎప్పుడేదిప్రయోజనమని తోఁచునదో దానినెల్ల ఖండముగ గ్రహించువాఁడను. కాని హృదయములోపల సంయోగ వియోగములు సామంజస్యము కాఁగలుగుమూల మింతెను. ఏ భావములోను మనస్సు విశేషకాల మాబద్ధమై యుండవీలులేదు. నేఁటివఱకు నీతలంపే ప్రబలముగానున్నది. ఏదోయొక్క గుణములో నధిక కాలము బద్ధుఁడనై యుండలేనైతిని. పాపనాశమునకుఁగాను న్యాయచింతనుఁ జేసితిని; కాని యిట్లేయున్న సాంశికసాధనయగునని కొన్నిదినములతరువాత గ్రహించితిని. వెంటనే ప్రేమచింతలోనికిఁ బ్రవృత్తుఁడనైతిని. సదా ప్రేమనే భావనఁ జేసితిని; రాత్రిందివములు సహాస్యవదనముతో నుంటిని. "అంతపరుగిడుట మంచిదికాదు; ఈమాఱు విపరీతదిక్కునకుఁ జాలదూరము వెళ్ళుటయైనది." అని మనస్సుతిరిగివచించెను. తిరిగి న్యాయపుదిక్కునకు వెళ్ళితిని. ఆనాఁక ఒక్కవైపుస్రోతస్సుమీఁదనే పరుగిడిపోవుచున్నదని చూచినవెంటనే తిరిగి లాగిపట్టితిని; ఈవిధముగా హృదయమును బ్రకృతిస్థముఁ జేయుటకు సర్వదా యత్నించుచున్నాను. ఎంతోసేపు చదివితిని; అందుమీఁద మనస్సు బుద్ధిచేతిలోఁబడి చావనున్నదని యెప్పుడు గ్రహించితినో, ఆవెంటనే బాలకభావ మేమూలమునఁ

గలుగునాయని, సరళత్వ మెట్లుసిద్ధించునాయని, నితాంతముఁ బ్రియత్నము చేయనారంభించితిని. ఒకవైపున విపత్తునుజూడఁగనే రెండవవైపునకుఁ బరుగెత్తుదును. కేవలము సామంజస్యమురియొక్క చేష్టరియే క్రమాగతముగ జరుగుచున్నది. నావిషయమున నెట్లో యితరులవిషయమునను నట్లే. బాహ్యమండలిలోఁ బరిశ్రమమును, కర్మోత్సాహమును, అధికమగుచున్నదని చూచితినేని, దీనినుండి వీరిమనస్సులను, ద్రిప్పి యాధ్యాత్మిక భావములోనికిఁ దీసి కొనివెళ్ళుటుచితమని తోఁచును. నాలుగువారములలోఁ గర్మశీలురు, ధ్యానశీలురుకాఁగఁ జూతును. కర్మమునుండి నివృత్తులై ధ్యానము రియొక్క గభీరానందమును, బ్రహ్మనందమును, ఉపభోగించుచుండఁ గందును. తిరిగి ధ్యానము చేయఁబోయి ఎవరును బరసేవ చేయుట లేదని చూచితినేని వెంటనే వివేకము నామంత్రితము చేసితెచ్చి ధర్మమండలిలో స్థాపింతును. ఇన్యుని మనస్సు నా మనస్సువంటి దేకాన, ఒక భావమునుండి తద్విపరీత భావమునకుఁ బోవుచుందుము. దినము లిట్లేగడచినమాట వాస్తవమే; కాని సామంజస్యపుదిక్కునకే పోవుచున్నాము; నవవిధానమున్నదిక్కునకే పోవుచున్నాము. ఆంశికధర్మమునువదలి హృదయమిపుడు పూర్ణత్వమున్నదిక్కునకే వెళ్లిపోయినది. ఇపుడిఁకను, ఆంశికోన్నతిని సాధన చేయలేను. స్వదేశమందు, మాతృభూమిరియొక్క కల్యాణార్థమై, ఈశ్వరుఁడు ఏనవవిధానమనిచ్చెనో, దానియర్థము కేవలము పూర్ణత్వమే. ఈపూర్ణత్వము మనోమధ్యమునను౦డెను. క్రీస్తుమహర్షి యీశ్వరునివలె పూర్ణము కమ్మని చెప్పెను. బహుదినములనుండి యీయుపదేశము మనస్సునందు స్వర్ణాక్షరములలో వ్రాయఁబడియుండెను. ఖండఖండ భావములను బట్టుకొనియుండఁగూడ దనుకొనుచుండెను. ఈశ్వరునిగుణములు

జీర్ణములు; ఆయనదయ పదునాఱువీసములు. నాకట్లు లేదు. ఆయనకు వైరాగ్యమెట్లో యానందమట్లే. నాకు వైరాగ్యములభ్యమైన నానందము తగ్గును. ఆనందములో మగ్నమైన వైరాగ్యము తగ్గును. నేను బ్రహ్మను స్థలమందు దర్శింపఁగలిగినంతగా, జలమందు దర్శింపలేకపోవచ్చును. నేనొక్క ఖండమందు నీశ్వరుని దర్శింతునుగాని, రెండవఖండమందుఁ గనలేను; పుణ్యాత్ములలో నాయనను దర్శింపఁగలుగుదును; గాని పాపాత్ములలో దర్శింపలేను. పాపియైనవాఁడును నీశ్వరతనయుఁడే, పుణ్యవంతుఁడును నీశ్వరతనయుఁడే. నేను పాపిముఖములో నీశ్వరుని దర్శింపలేను. నేను క్రీస్తుయొక్క యీశ్వరునిమట్టుకుఁ జూచి, బుద్ధునియొక్క యీశ్వరునిఁ జూడకుందునా? నీవు కావలెనని యొకనినుండనిచ్చి, మఱియొకనిని గృహమునుండి నడువనడతునా? శ్రీగౌరాంగునియొక్క ప్రేమ నీహృదయము నానందింపఁజేయుననియు, క్రీస్తుయొక్క వివేకము నిన్ను సౌఖ్యవంతునిఁ జేయలేదనియు నీవనుకొనుచుంటివా? నీవు హృదయమునందు గుప్తపాపమును దాఁతువు కాఁబోలును? అందులకనియే కాఁబోలును క్రీస్తును సాగనంపుదువు? కేవలము శ్రీగౌరాంగునినే మహోన్నతునిఁ జేయుచున్నావు. పాపమును జూడ నిచ్చలేదా? ఆత్మవిస్మృతుఁడవై కృత్రిమసుఖమును గోరుచున్నావు; అందులకనియేనా నీకిట్టి భావము? ఆంశములో నింక మనస్సు తృప్తి పొందలేదు. ఒకరిని బాగుగఁ బ్రేమించి, మఱియొకరిని తక్కువగఁ బ్రేమించిన నాయన యేమనుకొనునోయని తోఁచును. బుద్ధునినాదరించి శ్రీగౌరాంగునే హృదయమునఁ బెట్టుకొనుటచే బుద్ధుఁడెంతయనుకొనుచున్నాఁడు? గౌరాంగునాదరించి క్రీస్తుని దూరదూరము చేసితినా? నేను బంగాళీహిందువును; అందుచేఁ

గాఁబోలును గౌరాంగునిఁ బ్రేమించుచున్నాను! క్రీస్తు పరదేశీయుఁడు; అందుచేతఁ గాఁబోలును ప్రేమింపను! ప్రాచీనఋషులు వ్యాఘ్రచర్మముమీఁదఁ గూర్చుండెడివారు; కాషాయవస్త్రములను ధరించువారు; చివరకు వారిని ద్వేషముతోఁ జూతునేమోయని వెంటనే ఋషులగృహములకు వెళ్లితిని. వ్యాఘ్రచర్మమును స్వీకరించితిని, గైరికవస్త్రమును ధరించితిని. ఋషిగణములారా! ఆశ్రమవాసులారా! నవనాగరికతయొక్క గౌరవార్థమై వేషభాషలను బూనఁజాలను. ఏకోనవింశతిశతాబ్దములో మిమ్ములను బ్రేమింతును; రండు! మిమ్ముల నాదరింతును. ఇట్లనుచు ఋషుల నాదరించి సన్మానించితిని. ఒక్క సాధువును స్వీకరించినతోడనే, ఇంకొక సాధువు దగ్గఱకుఁ జేరును. భగవంతుఁడు హృదయమధ్యమందలి నారదునకు శిక్షఁ గఱపెను. ఒకనిని నిమంత్రణము చేసినతోడనే, ఒక్క సత్యము నాహ్వానము చేసినతోడనే, నారదుఁడు వెంటనే వెళ్ళి తిరిగితిరిగి, సమస్త సాధువులను సమస్తసత్యములను పిల్చివచ్చును. నేనొక్కనిని నిమంత్రణముచేసి. ఒక్కటిని గ్రహింతు ననుకొందును గాని నారదుఁ డట్లు చేయనియ్యఁడు. ఒకదానినిఁ దేఁబోఁగానే యన్నిటినిఁ దేవలయును. మోశాక్రీస్తులు ఒండొరుల హస్తములను బట్టుకొని నృత్యము చేయుచున్నారు. దీనినిఁ జూచియే నవబ్రాహ్మధర్మమును, నవవిధాననామముచే నాఖ్యాతముఁ జేసితిని. అన్యులు ఆంశికభావమునందుకొనినను ఉంచుకొనవచ్చునుగాని, నవవిధానములో నట్లుజరుగుట కెన్నఁడును వీలులేదు. ఒక్కొక్కటి పుచ్చుకొనిన నపరాధమగునని నాజీవనములో నెపుడు చూచితినో, అపుడే నూతననామముతో బ్రాహ్మధర్మము నాఖ్యానము చేయుట ఆవశ్యకము. వయసుముదిరెను; పూర్వోపార్జితాంశిక

భావములను గుచ్ఛవలెఁ గట్టితిని. పువ్వులగుచ్ఛవలె సాధువులు మిళితమైరి. సత్యములన్నియుఁ గుచ్ఛగఁ గట్టఁబడినవి. ఒకొక్క నాఁడు ఋషులేతెంచిరి; ఇంకొక నాఁడు పంజాబుదేశపు నానకు వచ్చెను; మఱియొక నాఁడు అయోధ్యదేశపుఁ గబీరు వచ్చెను. క్రమక్రమముగ నందఱు రాసాగిరి; క్రీస్తు, గౌరాంగుఁడు, అందఱును వచ్చిరి. ఎవ్వఁడు లోపలఁ గార్యములను జేయుచుండెనో, ఆయన "అందఱను గూర్చుండుఁ"డనెను. ఒకప్పుడను తాపము, మఱియొకప్పుడు సదనుష్ఠానము, ఒకప్పుడు వైరాగ్యము మఱియొకప్పుడు ఆనందము, ఒకప్పుడు వృద్ధభావము, మఱియొకప్పుడు బాల్యభావము, ఒకొక్కపుడు యువజనునియుత్సాహము, ఒకొక్కటిగా సమస్తమును రాసాగెను. ఎవ్వాఁడు జీవనముయొక్క మూలమందుండెనో, ఆయన సకలరత్నములను దీసికొని, మాలగఁ జేసి మెడయందు వేసెను. ఒకప్పు డిహలోకముయొక్క సౌందర్యమును మఱియొకప్పుడు పరలోకముయొక్క సౌందర్యమును వేంచేసెను. ఇహలోక పరలోకములు, ఒక్కటయ్యెను. ఇంటఁ గూర్చుండి స్వర్గసుఖమును అందుకొంటిని! రెండు వాద్యయంత్రములు మ్రోగుచుండెను; ఒకటితరువాతనొకటివచ్చి ఇక్కడ సముదయమును మిలనమయ్యెను. నానాయంత్రములును మిలనమై యొక్క యంత్రమయ్యెను. విభిన్న వాద్యయంత్రములయొక్క స్వరము మిళనమై ఒక్క సుమిష్టస్వర ముత్పన్నమయ్యెను. ఇపుడు పూర్ణత్వము కావలెను. పూర్ణత్వముదిక్కునకే ఇపుడు వెళ్ళుచున్నాను; క్రమముగఁ బోవుచున్నాను. బంధుమిత్రు లెవరు, పరమాత్మ నిచ్ఛగింతురో, వారు మార్గమధ్యముననే నాఁగిపోయిరి. సౌభాగ్యవంతుఁడగు నీవ్యక్తి ఎప్పుడును నాఁగలేదు; క్రమముగఁ బోవుచునే

యున్నాఁడు. “పాంథుఁ” డను నామమిడి భగవానుఁడు నన్నుఁ బృథివిమీఁదికిఁ బంపెను; పాంథశాల దొరకదని చెప్పియే పంపించెను; అందుచేఁ గ్రమముగ సాగియే పోవుచున్నాను. వర్షాకాలమునఁ బరుగిడితిని; శీతకాలమునఁ బరుగిడితిని; ఋతువులను లెక్క చేయలేదు. బాల్యమునఁ బరుగిడితిని; యౌవనమునఁ బరుగిడితిని; మృత్యువుతరువాతను బరుగిడవలెను. నవవిధానము పూర్ణత చెందనే చెందును. ఈపథికునితో నెవరు సాగివచ్చిరో, వారు సిద్ధముగనుండుదురుగాక! ఇప్పటికిని అభావములు చాలనున్నవి. మిత్రబాంధవులారా! ఈశ్వరుని యొక్క పూర్ణత్వమును లక్షించి సాగిపోవలెను! అంశమును చేతఁబట్టుకొని ఇఁక నీశ్వరావమానమును జేయకుఁడి!! నవవిధానము యొక్క వక్షము నిఁక విదారితముఁ జేయకుఁడి!!!

ఓదీనబంధూ! ఓయి పూర్ణబ్రహ్మమా! మే మేవిధమున ధర్మమును అంశములక్రింద ఖండఖండములుగఁ జేసితిమో, సమస్త పృథివియు నట్టిదోషమును ఎల్లకాలమును జేయుచున్నది. విభిన్న సంప్రదాయములు భిన్న భిన్న భావములను సాధన చేసెను; అందుచేతనే యింతవిరోధము. హిందూసమాజమున నున్నపుడు, అవిశ్వాస మధ్యమున నున్నపుడు, మేమును కేవలాంశిక సాధననే చేయుచుంటిమి. ఒకొక్కటి చొప్పున సకలమును గ్రహించి పూర్ణతఁ జెందవలెనని యిపుడు గ్రహించితిమి. నవవిధానము మనోమధ్యమున నావిష్కృతమైనప్పటినుండియు, “అహో! క్రీస్తుని స్వీకరించి ప్రాణబంధువైన గౌరాంగుని నడువనడచితినా! భక్తి దుఃఖించుచున్నటు లున్నది; న్యాయముయొక్క పక్షపాతినిఁ గాఁబోయి భక్తి నడిచితిని గాఁబోలు! ఒకసోదరుని హృదయమునకు రాజును జేసి,

మఱియొకసోదరుని బహిరించితినా? ఒకసోదరికి స్వర్ణాలంకారములిచ్చి మఱియొకసోదరిని దూరీకరించితినా? ఇఁక నట్లుచేయఁజాలను!" అనియే కేవలమనిపించును. అందఱ ననాదరణచేసి క్రీస్తునాదరించినయెడల నింటిలోనికిఁ బ్రవేశింపఁగనే దుఃఖము కలుగును; క్రీస్తును దుఃఖించును. తక్కినబంధువులందఱు హృదయమునుండి నిర్వాసితులగునంతగా నాకు క్రీస్తు నాదరించితినా? ఓయి పూర్ణబ్రహ్మమా! నీరాజ్యమున నుదారస్వేము! నీతనయులొండొరుల బుజములమీఁదఁ జేతులనైచికొని యుండఁగోరుదురు. నీన్యాయముతో నీప్రేమ నృత్యముఁజేయును. నీయన్నిగుణములు మిళితమై యొక్కగుణమగును. పలురంగులును గలసిపోవును. ఏడురంగులునుగలసి యొకరంగు కాఁజూచితిని. నవవిధానము యొక్క శోభ యెంత యాశ్చర్యకరము! నేను పూర్ణబ్రహ్మరూపమును దర్శింపఁగలుగునట్లును, బ్రహ్మయొక్క పూర్ణపరివారమును వీక్షింపఁగలుగునట్లును, పూర్ణసౌందర్యమును గాంచఁగలుగునట్లును, నన్నాశీర్వదింపుము! అట్లు యనంతనే సకలభేదములును సమసిపోవును. నలుదిక్కులందలి లోకులవ్యవహారములను జూచి కడుదుఃఖమగుచున్నది, కొందఱు కేవలము పాపమును జేయుదురు; మఱికొందఱు కేవలము సుఖము నేవెదకుదురు. కొందఱు క్రీస్తునుస్వీకరించి గృహమందే యాసీనులైయుందురు; మఱికొందఱు గౌరాంగునితో నున్మత్తులగుదురు. కొందఱు కర్మశీలురై తక్కినసమస్తమును బరిత్యజించిరి; మఱికొందఱు వివేకమునుమాత్రమే గ్రహించి యూరకుండిరి. ఇఁక ఖండగుణములను జూడనీకుము. చూచుటకే యత్నించితిమేని, ఈమాఱు అఖండమును జూడఁగల్గునట్లుచేయుము. అఖండభావమును దర్శింపఁగనే అందఱియొక్క భక్తిభావమును బుణ్యా

భావమును ఉప్పొంగిపోఁగాక! సహృదయసాధుమండలిని దర్శించి మనఃప్రాణములానందితములగుఁగాక! ఒకటిని, రెంటిని, మూఁటినిఁ జూచి తృప్తిఁజెందియుండలేను. నవవిధానము నిచ్చితివి; నేనిప్పుడు పూర్ణుఁడ నగుదునుగాకని, ఎవరు నవవిధానమును విశ్వసింతురో వారు పూర్ణులు కానిచ్చగింతురుగాకని కోరుదును. ఇంక నంశమును జూడనిచ్ఛలేదు; ఇఁక నంశమును గ్రహింపలేను. బ్రహ్మతనయుఁడనై ఖండఖండములను గ్రహింతునా? పూర్ణబ్రహ్మమా! రమ్ము! ఈహృదయము నిన్ను గ్రహించును. రానుంటివేని పూర్ణజ్ఞానమును, పూర్ణపుణ్యమును, పూర్ణప్రేమను, పూర్ణశక్తిని చేతఁ బట్టుకొని రమ్ము!! దీనునిఁకఁ గష్టపెట్టకుము. రెండుహస్తములను జాచెదను; అఖండ సచ్చిదానందపూర్ణభావమున హృదయములోనికి రమ్ము! అంశము కోరువారు అంశమును బొందుదురు; పూర్ణత్వముకోరువారు ఆజననిని పూర్ణభావమునఁ జూఁడగల్గుదురు. ఆంశికధర్మ మిఁకనుండకుండుగాతమని, సమస్తమును మిలనమై యేకమగుగాతమని సమస్తమానవజాతికొఱకును బ్రార్థింతును. మేమెన్నఁడు నవవిధానమును మనసార నాలింగనము చేసికొందుము? సమస్తగుణములును కోటికోటి సూర్యులవలె హృదయమునఁ బ్రకాశితములగుఁగాక! చూచి మూర్ఛితుఁడనై పోదును! అనంతములో లీనమగుదును!! ఇఁకను జననిని ఖండఖండముగ గ్రహించి గంగాతీరమున నట్టేకూర్చుండి యుండను. పూర్ణబ్రహ్మ, పూర్ణబ్రహ్మ, పూర్ణబ్రహ్మ, పూర్ణబ్రహ్మ — ఈశబ్దము నుచ్చరించుచు నుచ్చరించుచు, బూర్ణత్వమును బొందుదును. పూర్ణతను బొందనియెడల ముక్తి కనఁబడుటలేదు. రూపమును జూచి ముగ్ధుఁడనైనపుడు, "వత్సా! గుణములో నేల ముగ్ధుఁడవుగా" నందువు. కేవలము నీగుణములనే భావించుచుంటినేని, "బాలుఁడు గుణముల

భావింపఁదగునా ? రూపమునుజూచి ముగ్ధుఁడవుగాలేకపోతివా ?" యందువు. దయామయీ ! ఎల్లకాల మీవిధమున లాంఛనమునే పొందితిని ; నీనికటమునకు వచ్చిననన్నిమాఱ్లలో నాకమాత్రమైనను ప్రశంసనుపొందలేదు. "తల్లీ ! నీయాభరణములు మిక్కిలి యందముగ నున్న"వంటినా, "నాకట్టుచీర బాగుండలేదా ?" యందువు. చీరను ప్రశంసించితినేని, ఆభరణముల నేల యనాదరణము చేయుదు' వందువు. "అమ్మా! నీన్యాయగుణ మెంతయాశ్చర్యకర"మంటిని. వెంటనే నీయసీమప్రేమస్వరూపమును జూపి "నాప్రేమంతయల్పమా ?" యందువు. వివేకము నాదరించితినేని, "భక్తి యంత పాఱవేయవలసినదా?" యందువు. తల్లీ ! నేనేమి చేయనో చెప్పుము. ఆంశిక సాధనలతో నిఁక ప్రాణము తృప్తి చెందదు. పూర్ణత యెట్లులభ్యమగునో చెప్పుము. మావలె నంశముతో సంతుష్టులెవ్వరో, వారి నొకఁ్రమాఱు శోకింపనిమ్ము ! పూర్ణవైకుంఠ మెకఁ్రడనో, మాకందఱకును జెప్పివేయుము !! ఓదయాసింధూ! ఓయిపరమేశ్వరా!! పూర్ణధర్మమును స్వీకరించి యభావమునంతను దూరీకృతముఁ జేసికొనునట్లును, పూర్ణపవిత్రత్వము యొక్క యానందములో మగ్నమగునట్లును దయయుంచి యాశీర్వదింపుము !!! దయామయీ ! జననీ !! అనుగ్రహించి మాకీయాశీర్వాదము నిమ్ము !!!



# త్రయోదశాధ్యాయము.



## త్రివిధభావము.

భానువారము ౨౫ ఆగ్రహాయణము ౧౮౦౪ శకము.

సాధకుని జీవనధాతు నొక్క జాతిది కాదు; ఈ విషయమల్పవివేచన మీఁదనే తెలియఁగలదు. ఇది సంయుక్తధాతువు; త్రివిధధాతువుల యొక్క మిశ్రనము దీనియందుఁ గనఁబడును. దీని నెట్లు తెలియఁగ నయ్యెనని ప్రశ్నించితి రేని నిజజీవనమును జక్కఁగఁ బరిశీలించినంత నే జీవనములో మూఁడు ధాతువులున్నవని గ్రహించితినని చెప్పనగును. వివేచనచేసి, భావత్రయము యొక్క మిశ్రనము నుండఁజూచుకొని, జీవనారంభము చేసితిననుట గాదు. అనేకదినములు జీవనప్రవాహము ప్రవహింపఁ దరువాత దృష్టి నిగుడ్చిచూచితిని; ఇది యొక జాతిది కాదని యపుడు సిద్ధాంతము చేసితిని. జీవనధాతువును బరీక్షించి చూచినపుడు ఏయే ధాతువులచే నిది సృష్టమయ్యెనో తెలియఁగంటిని. ఈ జీవనములో ముప్వురుపురుషులున్నారు. మూఁడు ప్రకృతు లీజీవనములో విరాజిల్లుచున్నవి. మూఁడువిధములైన స్వభావములయొక్క సమన్వయమైనది; మూఁడువిధములైనధాతువు లేకత్ర మిశ్రన మయ్యెను. ఒకటిబాలకత్వము, ఒకటియున్మాదము, ఇంకొకటి ప్రాఁగ్భుఁభోతుతనము, — ఈ మూఁటి యొక్క ప్రకృతి విభిన్నమని యందఱును దెలిసియున్నదే. ఈ మూఁటివిషయమై తెలిసికొనవలె నన్న నధికవిచారణగాని, శాస్త్రపాఠముగాని చేయనగత్యము లేదు.

మూఁటిస్వభావమును సులభముగనే గ్రహింపవచ్చును. మూఁడు స్వభావములను దమస్వభావములతో మిళితముచేసికొన్న వారలు ధన్యులు. మూఁడును మిళితమైన నాశ్చర్యకరమగుపవిత్రత్వమును, ముక్తియు నందనగును మూఁటిలో నొకటినిఁ బరిత్యజించిన స్వభావము అపూర్ణమగును. ముద్దినుసులను ఏకత్ర మిళితముగా వేసి ఉన్నతజీవనము, సౌఖ్యకరజీవనము, చక్రవర్తివంశము, సౌఖ్యకర వంశము, ఘటిల్లవని యీశ్వరుఁడే వచించినట్లున్నది. ప్రతిసాధకుని యందు నీమువ్విధమైనసంభారము నిగూఢముగ మిళితమైపోయినది. సాధకుఁ డెంతసాధనఁ జేయునో, అంత బాలకుఁడగును; ఎంత యుపాసనచేయునో యంతయున్మాదియగును; ఎంతనృత్యగీతములలోఁ బడి స్వర్గసుఖము నాస్వాదించునో యంత త్రాగుఁబోతగును. ప్రథమావస్థలో సాధకునిజీవనమున బాలకత్వము, ఉన్మాదలక్షణము, త్రాగుఁబోతుస్వభావము, అల్పపరిమాణముగఁ గనఁబడును; సాధనలోఁ బరిపక్వమైనకొలఁదిని, ఈనానాగుణములును వృద్ధిఁ జెందును. బాలకునిస్వభావము సహజస్వభావము. ఈస్వభావమును సులభముగనే ఎఱుఁగనగును. బాలకస్వభావ మబ్బెనేని జనులు వృద్ధులలోఁ గలసియుండ నసమర్థులగుదురు. జీర్ణశీర్ణావస్థలు బాలకునకు ననాదరాభక్తిమూలకవిషయము లగును; బాలురతో నుండుటకే యిచ్ఛకలుగును. ఆటలమీఁదికే బుద్ధిపోవును. సరళత్వము సహజమగుచున్నదని, వృద్ధావస్థ, కుటిలత్వము ప్రవంచనము, కడు నప్రియమగుచున్నవని, మనస్సువిప్ప కోరికయగుచున్నదని, రెంతగ్రహింతునో, అంత నేను బాలకుఁడనైతిననుకొందును. ఎంత వృద్ధుఁడనైపోదునో యంత మ్లానవదనుఁడనగుదును. * బలమును, వీర్యమును, ఉద్యమమును వయోవృద్ధిలోఁగూడ నడువనడఁచితినేని

క్రమమున నిరుద్యమునిష్క్రియుఁడనై పోదును; కార్యానుష్ఠానేచ్ఛ క్రమముగ నణఁగిపోవును. ఇట్లనుభవమైనకొలఁదిని బాలకుఁడనుగాక వృద్ధుఁడనగుచుంటినని గ్రహింతును. కాని వయోవృద్ధితోఁగూడ బాల్యభావమే వృద్ధియైనదని జీవనవేదపాఠమువలన నవగతుఁడనైతిని. వయస్సు వృద్ధియగుచున్నదనుకొనను. అసత్యమూలకమైన గణితమునుబట్టి వృద్ధుఁడనైతినని చెప్పవలయునుగాని లోపల మాదేశపుగణితానుసారముగఁ జూచి క్రమముగ బాలకుఁడనగుచున్నట్లును క్రమమున వయస్సు తగ్గుచున్నట్లును గనుచున్నాను. సరిగ నీమాటను మన్నింపక పోయినను, వయస్సు వృద్ధియగుచుంటలేదనినైనను, చివరకుఁ గొంచము స్వీకరించుటుచితము. ప్రత్యూషసమయమున నాలుగుగంటలన్నరయైనపుడు, ఇంకొకరెండునిముషములతరువాతనే తెల్లవాఱినదనుకొందునా ? ఒక్కనిమిషముతారతమ్యమునకు అంతఁగ నాలోచింతునా ? ఏమాత్రమునుగాను. అయిదుకొట్టుటకు నైదు నిమిషములొకచోట, అయిదుకొట్టుటకు నెనిమిదినిమిషములు మఱియొకచోట ; ఈవ్యవధానము నెక్కువగాఁ దలంతునా ? ముప్పది, నలుఁబది, ఏఁబది, లేక యఱువది వత్సరములు పరలోకముయొక్క లక్షవత్సరములముందు ఒక్కక్షణమాత్రము. ఇఁక క్షణకాలమే పాటిదినిగాదు. బాలకునివయస్సు ఒకటిన్నర వత్సరము; నాలుగుదినములెక్కువైనఁ గావచ్చును; అంతమాత్రమున నేమైనది ? ఒకటిన్నరవత్సరపుబాలకుఁడనే నేను. కోటివత్సరము లైకార్యాలయములోఁ బనిచేయవలసియున్నదో, అక్కడ నేనిపుడు సంపూర్ణబాలకుఁడనే. భవనమున కిప్పుడేవచ్చితిని; మృత్యుచింత కింకను సమయమురాలేదు. నిజముగాఁజూచిన నాకజీవనములోని

యొకవత్సరముగాని, యొకశతాబ్దముగాని, గడియారముయొక్క యొకనిమేషమంత. ముప్పది దాఁటినవని, నలుఁబది దాటినవని యనుకొనుచు నస్థిరుడ నేల యగుదును? ఎనుఁబది వత్సరముల వృద్ధుఁ బోయెనని ఈ దేశమున నందురు. రెండువత్సరముల బాలకుఁడు వెళ్ళిపోయెనని మా దేశపులోకు లందురు. వసగత్తి పోయెనని ఈదేశముననందురు; ప్రాకుచుఁ బ్రాకుచుఁబోయెనని మా దేశముననందురు. జీర్ణకళేబరుఁడైనంతనే ఎవరును వృద్ధులుగారు; మనస్సరళత్వమే బాల్యకాలము. మనస్స్వర్గమే స్వర్గము. ఈశ్వరుఁ డీ భావమునే రక్షించును గాక! ఇంక నీ బాల్యకాలమును సహచరులనుబట్టియు నెఱుఁగనగును. వృద్ధసంగము నెప్పుడైన వెదకి యుంటినేని నేను మిథ్యావాదినని చెప్పవలయును. బాలక సహవాసమే నాకుఁ గావలయును. బాలకుని నేను చుంబనము చేయుదును; బాలకముఖముతో నా ముఖము నేకము చేయుదును. బాలకుఁడు నా మనోహరమగు పుష్పము; చూచిన స్వర్గము స్మరణకు వచ్చును. బాలకునిపదధూళిని గ్రహించుటకు నిచ్ఛయగును. బాలకులలో నుండుటకే కేవలము మనసిచ్ఛగించును. ఎంతమంది వృద్ధులు శ్మశానాభిముఖులై పోవ యత్నించుచున్నారో వారినిఁ జూచిన నేమనితోఁచును? వీరు స్వయముగ యత్నించి వృద్ధులగుచున్నారని తోఁచును. జీవనవేదముయొక్క శ్రోత లెవరైననుండిరేని వినుఁడు. జనని నామంత్రితముచేయఁగఁ జేయఁగ బాలకభావము కలుగును. కేవలము రాజాధిరాజులపూజయే చేసితివేని వృద్ధుఁడవై పోవచ్చును మాతృపూజఁ జేయుటవలన నెన్నఁడును వృద్ధత్వము రాలేదు ఎన్నఁడును వృద్ధుఁడవుగావు. జననీక్రోడమం దెన్నాళ్ళుందునో, జననియొక్క స్తన్యపానము నెన్నాళ్ళు చేయుదునో, అన్నాళ్ళును

క్రమమున నిరుద్యమునిష్క్రియుఁడ నైపోదును; కార్యానుష్ఠానేచ్ఛ క్రమముగ నణఁగిపోవును. ఇట్లనుభవమైనకొలఁదిని బాలకుఁడనుగాక వృద్ధుఁడనగుచుంటినని గ్రహింతును. కాని వయోవృద్ధితోఁగూడ బాల్యభావమే వృద్ధియైనదని జీవనవేదపాఠమువలన నవగతుఁడ నైతిని. వయస్సు వృద్ధియగుచున్నదనుకొనను. అసత్యమూలకమైన గణితమునుబట్టి వృద్ధుఁడనైతినని చెప్పవలయునుగాని లోపల మాదేశపుగణితానుసారముగఁ జూచి క్రమముగ బాలకుఁడ నగుచున్నట్లును క్రమమున వయస్సు తగ్గుచున్నట్లును గనుచున్నాను. సరిగ నీమాటను మన్నింపక పోయినను, వయస్సు వృద్ధియగుచుంటలేదనియైనను, చివరకుఁ గొంచెము స్వీకరించుటుచితము. ప్రత్యూషసమయమున నాలుగుగంటలన్నరయైనపుడు, ఇంకొక రెండునిముషములతరువాత నే తెల్లవాఱినదనుకొందునా? ఒక్కనిమిషముతారతమ్యమునకు అంతఁగ నాలోచింతునా? ఏమాత్రమును గాను. అయిదుకొట్టుటకు నైదు నిమిషములొకచోట, అయిదుకొట్టుటకు నెనిమిదినిమిషములు మఱియొకచోట; ఈవ్యవధానము నెక్కువగాఁ దలంతునా? ముప్పది, నలుఁబది, ఏఁబది, లేక యఱువది వత్సరములు పరలోకముయొక్క లక్షవత్సరములముందు ఒక్కక్షణమాత్రము. ఇఁక క్షణకాలమేపాటిదినిగాదు. బాలకునివయస్సు ఒకటిన్నర వత్సరము; నాలుగుదినములెక్కువైనఁ గావచ్చును; అంతమాత్రమున నేమైనది? ఒకటిన్నరవత్సరపుబాలకుఁడనే నేను. కోటివత్సరములే కార్యాలయములోఁ బనిచేయవలసియున్నదో, అక్కడ నేనిపుడు సంపూర్ణబాలకుఁడనే. ప్రభవమున కిప్పుడేవచ్చితిని; మృత్యుచింత కింకను సమయము రాలేదు. నిజముగాఁ జూచిన నాకజీవనములోని

యొక వత్సరముగాని, యొక శతాబ్దముగాని, గడియారముయొక్క యొకనిమేషమంత. ను పక్షిది దాఁటినవని, నలుఁబది దాటినవని యనుకొనుచు నస్థిరుఁడ నేల యగుదును? ఎనుఁబది వత్సరముల వృద్ధుఁ హోయెనని ఈ దేశమున నందురు. రెండువత్సరముల బాలకుఁడు వెళ్ళిపోయెనని మా దేశపులోకు లందురు. వరుగత్తిపోయెనని ఈ దేశముననందురు; ప్రాకుచుఁ బ్రాకుచుంబోయెనని మా దేశముననందురు. జీర్ణకళేబరుఁడైనంతనే ఎవరును వృద్ధులుగారు; మనస్సరళత్వమే బాల్యకాలము. మనస్స్వర్గమే స్వర్గము. ఈశ్వరుఁడీ భావమునే రక్షించును గాక! ఇంక నీబాల్యకాలమును సహచరులనుబట్టియు నెఱుఁగనగును. వృద్ధసంగము నెప్పుడైన చేదకియుంటినేని నేను మిథ్యావాదినని చెప్పవలయును. బాలక సహవాసమే నాకుఁ గావలయును. బాలకుని నేను చుంబనము చేయుదును; బాలకముఖముతో నాముఖము నేకము చేయుదును. బాలకుఁడు నా మనోహరముగు పుష్పము; చూచిన స్వర్గము స్మరణకు వచ్చును. బాలకునిపదధూళిని గ్రహించుటకు నిచ్ఛయగును. బాలకులలోనుండుటకే కేవలము మనసిచ్ఛగించును. ఎంతమందివృద్ధులు శ్మశానాభిముఖులై పోవయత్నించుచున్నారో వారినిఁజూచిన నేమనితోఁచును? వీరు స్వయముగ యత్నించి వృద్ధులగుచున్నారని తోఁచును. జీవనవేదముయొక్క శ్రోత లెవరైననుండిరేని వినుఁడు. జనని నామంత్రితముచేయఁగఁ జేయఁగ బాలకభావము కలుగును. కేవలము రాజాధిరాజులపూజయే చేసితివేని వృద్ధుఁడవై పోవచ్చును. మాతృపూజఁ జేయుటవలన నెన్నఁడును వృద్ధత్వము రాలేదు; ఎన్నఁడును వృద్ధుఁడవుగావు. జననీక్రోడమందె నాళ్ళుందునో, జననియొక్క స్తన్యపానము నెన్నాళ్ళు చేయుదునో, అన్నాళ్ళును

బాలుఁడనుగానే యుందును; వృద్ధుఁడ నిఁకఁగాను. పరలోకమునకు వెళ్లి విద్యాలయమునఁ జేరుదును; జననిని జననియని యాహ్వానము చేయవలయునను నీమంత్రమును, ఈశాస్త్రిమును అక్కడఁగూడ శిక్షింతును. ఈబాలకద్రవ్యము, లోననున్నది; ఉన్మాదద్రవ్యమును దానినంటియేయున్నది. ఉన్మాదితో నెవరికినిఁ గలయదు. పృథివికినుత్తరదిక్కు ఉన్మాదులకుదక్షిణదిక్కు. ఉన్మాదియొక్క సాహిత్యము, మనోవిజ్ఞానము, గణితము, అన్నియు నూతనము; సమస్తమును బృథివికి విపరీతము. సాంసారికులవలెనగుట సరిగాదు. ఇట్టియున్మాదివి కావలయును. పృథివి దేనిమూలమున నివన్నియు బుద్ధిగలవాని కార్యములు కావనునో, క్రమముగ నట్టినానాకార్యములును జేయవలయును. విపరీతపుఁగార్యముల నన్నిటినిఁ జూచి లోకులున్మాదియని, ఛాందసుఁడని యుపహాసముచేయుదురు. ఉన్మాదిశాస్త్రిము వేరు; పృథివియందలిలోకులు తద్వచనములువిని కేవలము నవ్వుదురు; మా దేశపుఁబ్రజలు అదిచదివినకొలఁదిని తృప్తిమంతులగుదురు. పృథివియొక్కలాభనష్టములను వివేచనచేసి యున్మాది యెన్నఁడును వ్యవహరింపఁడు. సహస్రవిషయములలో నష్టపుదిక్కునకే యున్మాది వెళ్ళును. లోకులు లోకమార్గమున వెళ్ళుదురు. ఉన్మాదులు ఆకాశమునఁ బోఁజూతురు. ఉన్మాదులు కేవలము భావముమీఁదనే గృహమునుగట్టుదురు. లోకులు కోటిరూప్యములు దొరకఁగనే ధనికులనుకొందురు. ఉన్మాదులు ఏమియులేకున్నను తాము ధనికులమనుకొందురు. ఉన్మాదినిఁ జూడఁగనే నవ్వువచ్చును. ఈజీవనములోఁ గొంచెము చూచినవ్వఁగలిగిన విషయములుండునేని కృతార్థుఁడనగుదును. ఈజీవనములోని పరిహాసవిషయములను పృథివిచూచినది. ఆభావములన్నియు

జీవనము యొక్క సువర్ణ భాగములు; ఉన్మాదవిపరీత భావములన్నియు లోహ భాగములు. ఉన్మాదివలెఁ బృథివి నెంతమఱతునో, అంత సౌఖ్యసంచారమగును. బుద్ధివిచారణ ఆరంభమైనట్టుచూడఁగనే, "అదిగో! పార్థివమానవుఁడనైతినా? ఎవరిదళ్ళములోఁ బడితి"నని భావింతును. కేవల లోకజ్ఞులతోఁ గూర్చుండిన మనస్సులో నెట్లోయుండును. లేవఁగలిగితినేని బ్రదుకుదునని తోఁచును. ఈపృథివియందలి చతురులు నడచుత్రోవను గన్నెత్తిచూచుటకైన భయమగును. ఏ నానా స్థానములలో వారుకూడుచుందురో ఆ నానాతుచ్ఛస్థానములకు వెళ్లఁగోరికరాదు; కార్యానురోధమున వెళ్ళినను లేచిపోవ నిచ్ఛయగును. పిచ్చివానికిఁ బిచ్చివాఁడు కావలయును; చతురులకుఁ జతురుఁడు కావలయును. పిచ్చివానియొద్దఁ గూర్చుండియున్నంతసేపు వాఁడు వాగుచునేయున్నట్లు చూతువు. ఎవరు రేపటికొఱకై భావించుచుఁ గార్యములను జేయుచున్నారో పిచ్చివానికన్నులు వారివైపునకుఁ బోనిచ్చగింపవు. నేత్రము లేదికుక్కనకు వెళ్ళును? ఎక్కడఁ బిచ్చివాండ్రసభయో యక్కడికి; ఏదిక్కున నున్మాదాశ్రమమో యాదిక్కునకు. ఎక్కడ నున్మాదులు "ఈశ్వరా! ఈశ్వరా! హరి హరీ!" యని నృత్యము చేయుచున్నారో, పిచ్చివాఁ డాదిక్కునకుఁ జూచును; అక్కడకే వెళ్ళఁగోరును. నాలోపల బాలకుఁడు నృత్యము చేసెను; ఈలాగుననే యున్మాదియును వానితో లోలోపల నృత్యముఁ జేసెను. పిచ్చితనము బాగుగఁ బరిపక్వమయ్యెను. బుద్ధిమంతునివలె నుపాసన చేసిన, నీశ్వరునిఁజూచి యుపహసించి, నవ్వితినాయని తోఁచును. బుద్ధిమంతునివలె, శాస్త్రపాఠము చేసిన, "ఇదేమి? ఈశ్వరుని మోసపుచ్చవచ్చితినా యే"మని తలపోయుదును. ఉన్మాదివలె నేదినము పానన చేయుదునో,

ఉన్మాదివలె నేదినము చదువుదునో, ఉన్మాదివలె నేదినము నృత్యము చేయుటనో, ఏదినము కార్యములన్నియు నున్మత్తుని కార్యములవలె నగునో, ఆదినము మనము నంగడు నానందముగలుగును. రెండుధాతువులు మిలనమయ్యెను. తృతీయ ధాతువు త్రాగుఁబోతు నాసక్తి. సంసారము యొక్క మత్తత పృథివియందున్నది. మనలక్షణములు దానికేల భేదముగానుండును? త్రాగుఁబోతైనఁ బరిమాణము నెక్కువ చేయవలయును; మేము నట్లే చేయుదుము. ఉపాసన ఐదునిముషముల సేపుండెను; ఇపుడు అయిదుఘంటలైనది; ఒక్కమాఱీశ్వరుని స్మరించి తృప్తిఁ జెందువాఁడను. ఇపుడు, ఈశ్వరా! ఈశ్వరా! ఈశ్వరా! ఈశ్వరా! యన్నయిపుడు తుష్టిగలుగును; అందువలనను గలుగదు. ఇంకను స్మరింపనిచ్ఛయగును. ఇదివఱకొక్కమాఱు చూడఁగనే యగునది. ఇపుడు చూచుచునే కూర్చుండవలయును. అప్పుడొక మాదిరి మద్యముతో సరిపోవునది. ఇపుడు వేడిఁసారాయిగాని చాలదు. త్రాగుఁబోతులకు నాథులైన శ్రీగౌరాంగక్రిస్తులిపుడు పూర్ణముగ త్రాగిపడినట్లు తోఁచుచున్నది. పృథివిమీఁద నట్టివారు లేరు; అట్టి విలువగలమద్యమును ఇక్కడ సాధారణముగ నగపడదు. హస్తములను జోడించుకొని ప్రార్థన చేయుదునుగాని, అయినను ఇదియొకమాదిరిది. మఱి మోశాక్రిస్తులు చేయునది అదొకమాదిరిది. ఇదంతయు భావించుచు భావించుచునే జ్ఞానశూన్యుఁడనగుదును. కేవలము త్రాగుటకే జీవనము ఇష్టపడును. త్రాగుఁబోతున కింకేమి లక్షణములు? పరిమాణమును వృద్ధిఁజేయ నేవిధమున నిచ్ఛ యంకురించునో, హృదయమున నుత్సాహమెక్కువైనకొలఁదిని త్రాగుఁబోతులవలె సహవాసగాండ్రు సంఖ్య నెక్కువ చేయును

యత్నమగును. చెలికాండ్రు, ఎక్కువమంది కావలయును; దళము కావలయును; కీర్తనభూమిని విస్తృతముఁ జేయవలయును. ఒక వేయిమందికి నీశ్వరవిషయమై చెప్పఁగలిగిన నిదివఱకు మనస్సు తృప్తిఁ జెందునది; ఒక్క వేయిమందితోఁ గలసి కీర్తనఁ జేసిన నిదివఱకు మనస్సు ఆనంద మొందునది. ఇప్పుడూ వేలమంది దొరకినను మనస్సు తృప్తినొందదు. మనస్సింకను గోరును. హరి తనదళము నెపుడువృద్ధిచేయును? స్వభావముగనే ఈయిచ్ఛయగును. దళములోఁ గ్రమముగ సంగడికాండ్రసంఖ్య. నెక్కువచేయ యత్నము చేయుదును. క్రమముగ నందఱును స్వర్గీయసుధారసపానము చేసినపుడే జీవనము సార్థకమయ్యెననితోఁచును. పూర్వపశ్చిమముల కెన్నాళ్ళొక్కమాఱుగాఁ బిచ్చియెత్తెనో స్వర్గీయసురాపానములో నందఱు నెన్నాళ్ళు మత్తులుగారో, అన్నాళ్ళు నీమానవునిరక్తవర్ణ నేత్రము లేమిచేసినను శాంతింపవు. ఒంటిగానున్నన్నాళ్ళు త్రాగుఁబోతుతనము కలుగలేదు. ఏక వింశతిసహస్రజనులతోఁ ద్రాగుడు తనములోఁ బడ్డను, తృప్తికనుపింపలేదు. లక్షలక్షమందితోఁ, గోటి కోటిమందితోఁ గలసిఁ త్రాగఁగోరుదును. బాలకుఁడు బాలక దళమును గోరును; పిచ్చివాఁడు పిచ్చివాండ్రచెలిమి నభిలషించును; త్రాగుఁబోతు త్రాగుఁబోతులకై చూచును. హరిలోఁ బిచ్చికెక్కినవాండ్రు, హరిలోఁ ద్రాగుఁబోతులు ఎక్కడయని వెదకుచున్నాను. ఇంకను బాలకుఁడనగుదును; ఇంకను నున్మాది నగుదును; ఇంకను ద్రాగుఁబోతునగుదును. స్వదేశస్థు లెవరెక్కడ నున్నారో జాడలుతీయుదును. మూఁడుధాతువులయొక్క ముగ్గురి మనుష్యులను హృదయమున నుంచుకొందును; వరింతును. ఈమూఁడు భావములను శిరోధార్యరత్నములవలె బహుమూల్యముగలవని

గ్రహింతును. ఎన్నాళ్ళు బాలకత్వమున్నదో, ఉన్మాదమున్నదో, ప్రమత్తతయున్నదో అన్నాళ్ళును సౌఖ్యమును, పవిత్రత్వమును. ఏనాఁడు వృద్ధుఁడనగుదునో, పిచ్చితనమును వదలుదునో, ఉన్మాదావస్థ తిరోహితమగునో, ప్రమత్తత వదలిపోవునో, ఆనాఁడే మృత్యువు నాలింగనము చేసికొనవలయును. ఈమూఁటితోను ఎన్నఁడును విచ్ఛేదము కలుగకుండునట్లు భగవానుఁ డాశీర్వదించును గాక!

ఓ దీనబంధూ! కరుణారసానంతసముద్రమా! నీక్రోడములో వెళ్ళి కూర్చుండఁగలిగిన నేమిసౌఖ్యముగనుండును. చాల వయస్సు ముదిరినదని, జ్ఞానము కలిగినదని, ధర్మము ననుష్ఠించితినని యనుకొన్న నపరాధమగును. "ఏమియుఁగాలేదు ; తల్లియొడిలోనే యుందు" నను నీవిషయము నెంతమనస్సులో నుంచుకొందునో అంత సుఖముగ నుందును. గొప్పవాఁడనగుట యట్లుండఁగా, నీక్రోడమునుండి తమక్రోడములోనికిఁ దీసికొన నింకెవ్వరైనవచ్చిరేని భయమగును. వృద్ధునిఁజూచిన నాకు భయము. "నేను జననికిభిన్నము నింకేమియు నెఱుఁగను" అను నీజ్ఞానము ముక్తిప్రదజ్ఞానము ; సౌఖ్యప్రదజ్ఞానము. ఈజ్ఞానము వృద్ధియగుఁగాక నియే ప్రార్థన. తల్లీ కేవలము నీస్తనదుగ్ధములే త్రాగుదుఁగాక! పృథివిమీఁదికిరాఁగానే నేనన్నమును దినలేనుగదా! కఠినాహారమును నమలలేనుగదా! వయసురాలేదు ; కాలూనినిల్చుండలేను. తల్లీ! నీక్రోడమందుందును. అఱుగనివస్తువులను దినలేను. దయామయీ! నీపూజను జేయుచుఁ జేయుచు నెంత స్తనదుగ్ధమును పానము చేసితినో, బాల్యావస్థలో నెంతసుఖము పొందితినో అంత నాలోఁ బిచ్చితనమును, త్రాగుడుతనమును వృద్ధికాసాగెను. తల్లియొక్క స్తనదుగ్ధమును పానము చేసినకొలఁదని, శిశువున

కుండుస్ఫూర్తిహీనత కలుగుచున్నది. అందుచే నిందులో దుత్తూరమో సారాయియో యున్నదనుకొంటిని. తల్లీ! ఎన్ని మాటలు నీదుగ్ధమును బీల్చితినో, అన్ని మాటలును తెలివితప్పినవాఁడనైతిని. తెల్లని చక్షువులతో నుపన్యాసమిచ్చుటకుఁబోయినఁ దప్పులుపడును. తెల్లని నేత్రములతో సాధనచేతును గాని అదిసాగదు. మత్తెక్కిన నివన్నియు బాగుగనగును. దయామయీ! దయామయీ! యని పిల్వఁబిల్వ నీ స్తనదుగ్ధము నోటిలోనికి వచ్చును. దుత్తూరమువంటి దేదో నీవు పాలలోఁగలిపితివి; అందుచేఁ ద్రాగి యున్మాదినగుదును. ఎంత పిచ్చివాఁగుడు వాఁగుదును! ఎంత త్రాగిపడిపోదును! తల్లీ! ఇందులో నేను సుఖముగనుందును. ఈపిచ్చితనము, త్రాగుడుతనము, మంచిది. వృధివియొక్క జ్ఞానిని కానిచ్చలేదు. బాలకునిఁ జేసియుంపుము. వృద్ధుఁడ నెన్నఁడును గాకుందును గాక! తలమీఁది వెండ్రుకలు తెల్లనైన నష్టములేదు; ఆత్మకుమాత్రము వార్ధక్యము రాకుండును గాక! హరీ! ప్రభూ! బాలకుఁడనైయుండు టెంత సౌఖ్యకరము! ప్రాణములోపల గోల యేమియు లేదు; ఉపాసనా సమయమున శిశువువలె సహజ వచనములఁ బలుకుదును. వంకరటింకర మార్గము లక్కఱలేదు; కుటిలుఁడనైతినేని సుఖము కలుగదు. వృద్ధునివిషమును బాలకుని యంగములోఁ బ్రవేశింపనీకుము. అమ్మా! నీవు నన్నుఁ జేతులలోఁ బెట్టుకొని ఎగురవేయుము; చెక్కిలిముద్దాడుము; ఇంతియ కోరిక. బ్రహ్మమందిరముయొక్క ప్రార్థనను వినుము; మమ్ముల నాడిలోనికిఁ దీసికొని యాదరింపుము. కృపామయీ! సర్వదా బాలకుఁడనై యుండునట్లును, ఉన్మాదియొక్కయుఁ ద్రాగుఁబోతుయొక్కయుఁ బ్రకృతిలో వసించునట్లును, కృపఁజేసి యాశీర్వదింపుము. ఏకొంచెము వార్ధక్యమును సంచయము చేసితినో దానినిఁ బరిత్యజించి బాలకుఁడ

నగుదునుగ్గాక! దయామయీ! నీధర్మరసమును పానముచేసి కడునున్మత్తావస్థను బొందుదునుగాక! బాలకునివలె, నున్మాదవలెఁ నృత్యము చేయుదును. నృత్యము చేయుచుఁ జేయుచు స్వర్గములో, బ్రవేశింతునని యాశపడుచు, భక్తితో నీపాదపద్మములకుఁ బలుమాఱు నమస్కరింతును.



# చతుర్దశాధ్యాయము.



## జాతినిర్ణయము.

భానువారము 3 వ పౌష్యము ౧౮౦౮ శకము.

మానవకులమును ధనికదరిద్రజాతులలోనికి విభజించినయెడల నన్ను నేనేశ్రేణిలోవాఁడ ననుకొందును ? ఓయి ! ఆత్మా ! నీవేజాతి వాఁడవు ? ధనికవంశసంభూతుఁడవా ? లేక దరిద్రవంశ సంభూతుఁడవా ? ధనవంతులకులములో జన్మగ్రహణముఁ జేసితివా, లేక దరిద్రజాతిలోఁ బరిగణితుఁడవా యని యీజీవనములో నీమాట ననేకమార్లు ఆత్మను జిజ్ఞాసచేయవలసివచ్చెను. దీనిమీమాంస జీవన వేదముయొక్క యొకవిశేషపరిచ్ఛేదము. ఆత్మ ఏజాతిలో జన్మించినది ఎఱుఁగ నావశ్యకము. స్వభావమెట్టిదో, రుచులును అభిప్రాయములును ఏజాతివారివంటివో, కార్యప్రణాళి యెవరి ననుసరించియున్నదో, స్వభావముగ దీని నెఱుంగ నిచ్ఛయగును. నేనేజాతిమానవుఁడనో మును ముందే తెలిసికొననిచ్ఛయగును. విశేషానుసంధానమువలనను, బంచవింశతివత్సరములసూక్ష్మాలోచన వలనను, మనఃకామములను, అభిరుచులను తఱచితఱచిచూచుట వలనను, ఆత్మ దరిద్రజాతిదని సిద్ధాంతముగుచున్నది. శరీరముయొక్క రక్తము దుఃఖులరక్తము, శిరస్సులోని మస్తిష్కము దీనజాతిమస్తిష్కము. ఏకొలఁది దైనికాహారవ్యవహారము లున్నవో, ప్రచురపరిమాణమున వానిలో దరిద్రత యే కన్పడును. అనుమానప్రమాణముమీఁద నీసిద్ధాంతమును జేసితినేని అది మిథ్యయగును; వేదినుండి మహాపాపముఁ జేయుటయగును. మనస్సుయొక్క గభీరమైనరుచులనన్నిటిని ననేకవత్సరములనుండి

పర్యావేక్షణచేసి సిద్ధాంతముచేసితిని; సత్యముసాక్షిగా నిందులో ననృతములేదని, భ్రాంతిలేదని, అనుగూనములేదని చెప్పఁగలను. బహువిచారణలలోఁ బరీక్షితుఁడనై దీనుఁడనని యాత్మస్వభావమును దెల్పుచున్నాను. ఉచ్చకులోద్భవుఁడనైనను, నానాప్రకారములైన ధనసంపత్తులైశ్వర్యమునుసూచించుచున్నను, మనోమధ్యమునఁ దదనురూపభావము కాన్పింపదు ధనమున్నదిగాని ధనముకొఱకైన ప్రియాసలేదు. ఉత్తమభోజ్యపదార్థములున్నవిగాని ఆహారస్పృహ లేదు. మనస్సునకు సామాన్యవస్తువులలోనే సంతోషము. మానమర్యాదలు నలుదిక్కులనున్నవిగాని మనస్సు వానిఁదలపెట్టదు. ఇరుదళములలోకులు వచ్చిన ధనికులనువదలి మనస్సు దరిద్రులను వెదకును; బీదలసహవాసములో మనస్సునకుఁ దృప్తియగును. ఇదంతయుఁజూచిన మనస్సేజాతిదో స్పష్టముగఁదేలుచున్నది. ఈపరీక్ష విచారకుని భ్రాంతిలోదింపలేదు; ఇందులోఁ దప్పు రావీలులేదు ఏలయనఁ బరీక్ష విశేషావస్థలోనైనది. హృదయము దీనమైనను, బాహ్యోపకరణములు ధనాఢ్యులవి. ఈయవస్థలో నాత్మను శీఘ్రముగనే పరీక్షింపవచ్చును. ధనికుల ప్రాసాదములో జన్మింపక దరిద్రులపర్ణకుటీరములో జన్మించియుంటినేని పరీక్షించుట కఠినమగునది. మనస్సులోపల ధనసంపదలయొక్క యుత్తేజముండిన నుండునది. బీదలపథమును కేవలమవసరముచేతనే పట్టువాఁడనేమో! బాహ్యమందున్న ధనికభావము, లోపలనున్నదిలేనిది చూడవలెను. మనస్సు ధనమును బరిత్యజించి, దారిద్ర్యమునన్వేషించునపుడు, దరిద్రిత మనస్సు యొక్క స్వాభావికమనియు, మనస్సు దరిద్రజాతిదనియు గ్రహింపవలయును. ధనాఢ్యులగు పితృపితామహులవలనఁ బాలితుఁడ

నై బాహ్యసంపదలచే వేష్టితుఁడనైనప్పటికిని వయోవృద్ధితోఁగూడ మనస్సు స్వాభావికదైన్యపరిచయము నియ్యసాగెను. సామాన్యాహారములో మనస్సునకుఁ దృప్తికనిపించును; దైన్యసాధన దీనికిస్వభావసిద్ధము. దీనతను బహుకష్టముచే సాధింపనగత్యము కలుగుటలేదు; శాకాన్నములోనే నేనులోభిని. ఆసక్తి యేపదార్థములో నైననున్న నయ్యది శాకము. ఈవిషయము నాజీవనములో నత్యపూర్వతత్త్వమును బ్రకాశముజేయును. దీనిచే నితరులకు మనోరంజనముగాకున్నను నాకిది యతిచమత్కారవిషయము. హృదయము స్వాభావికముగ శాకములో నెట్టితృప్తిఁజెందునో, ఎట్టిసౌఖ్యమును, సౌలభ్యమును, బొందునో, మనస్సునకెట్టితృప్తియు, నానందము, నీసామాన్యవస్తువులోఁ గాన్పించునో, దానిఁబట్టి ఈశ్వరునకు నామీఁద మిగులఁగరుణయున్నదని గ్రహించితిని. బాష్పీయశకటములోనెక్కి ఎక్కడికైనవెళ్ళవలసివచ్చిన, మూఁడవ తరగతినివదలి మొదటితరగతిలోనికిఁ బోవుటకు భయమగును. అనధికారకార్యములోనికి దిగుచున్నానేమోయని తోఁచును. ధనికుల రాజ్యములోనికిఁ బ్రవేశించుచున్నానేమోయని భయముగును. యావత్సమయమును భీతిల్లవలసివచ్చును; నానావిజాతీయ భావములలోను, వస్తువులలోను తృప్తియంతరించును; శాంతిరసమునకు భంగముకలుగును. ప్రథమశ్రేణినివదలి ద్వితీయశ్రేణిలోనికిని, ద్వితీయమును వదలి తృతీయశ్రేణిలోనికిని వెళ్ళుట స్వభావసిద్ధమని మనస్సొక్కని మేషములో సిద్ధాంతముఁజేయును. సిద్ధాంతములోఁ గాలవిళంబముచేయ వీలులేదు; సౌలభ్యమునకుఁగాను దుఃఖులును, దరిద్రులును నున్నస్థానమునకే మనస్సు వెళ్ళఁగోరును. తృతీయ శ్రేణినివదలి ప్రథమశ్రేణిలోనికివెళ్ళిన • నది కర్తవ్యానురోధమునఁ

గావచ్చును; కాని స్వభావమును జిజ్ఞాసచేసిన, "సుఖమక్కడనే? తృతీయశ్రేణి ఎట్లుద్వేగవిహీనమో, ప్రథమశ్రేణి యిట్లులకా" దని వక్కాణించును. నేను ధనికులకొఱకుఁ గాదనియు దరిద్రులకొఱకే సృష్టింపఁబడితిననియు నీయుక్తివలననే తెలియవచ్చును. ఎక్కడ దరిద్రులో యక్కడనే నాకుఁ జనవు; జీవనరక్షణ అక్కడనే. ఈ సకలదారిద్ర్యభావములను నేనాయాసపడిశిక్షింపలేదు. తమంతనే అన్నియుఁ జక్కఁగఁబ్రకాశించినవి. బాటను నడచిపోవలసిన దరిద్రులవలెనే పోటును. నగరకీర్తనములో దుఃఖులవలెఁ బోవలయునని ఎవరుచెప్పిరి? ఈదుఃఖులలక్షణములను ఎవరియొద్దనేర్చుకొంటిని? ధనికులు దీనినిఁజూచి ఏమందురని యాలోచింపలేదు. వార్తాపత్రికలలో బరిహాససూచకవచనములు బయలువెడలిన వెడలవచ్చుననియు, మానహానియైనఁ గావచ్చుననియుఁ దెలిసియు నిర్లోలచేసితినో చింతింపలేదు; అది చింతనీయవిషయమనియు ననుకొనలేదు. కాని పాదుకావిహీనుఁడనై నేనుమాత్రము సాగిపోతిని. ఓయీఆత్మా! నీవు శిక్షింపలేదు. అయినను దరిద్రతను శిక్షించితివి. కుటీరముండుంపలేదు, హృదయము స్వభావముగనే ధూళిమధ్యనుండి పోఁగోరెను. ఈ విషయమున నింకను అనేకోదాహరణముల నీయవచ్చును. పృథివి గ్రహించినను, గ్రహింపకపోయినను ఆత్మ దీనులయాత్మయని, మనస్సు దుఃఖుల మనస్సని, శరీరము దుఃఖదరిద్రులశరీరమని, నేను జక్కఁగ గ్రహించితిని. సకలవిషయములలోను దీనదారిద్ర్యలక్షణములు ప్రకాశితములు. మహాధనికులతో సమానాసనముమీఁదఁ గూర్చుండుదునా? గొప్పవాండ్రి కరస్పర్శమును జేయుదునా? ఇవన్నియుఁ జేసినంత మాత్రముననే స్వభావము పోవునా? చండాలుఁడు బ్రాహ్మణస్పర్శచే బ్రాహ్మణుఁ డగునా? కాకాన్నభోజి

ఒక్కదినము సమాప్తిగృహమున భుజించినంతనే ధనికుఁడగునా? స్వభావమేఖి చేసినను పోదు. ఇందుచే నరిదఱితోఁ గలసిమెలసియు నిరాపదగానున్నాను. కావలసినంతజాతి వచ్చినది. ఎవరెవరీజాతియొక్క లక్షణయుక్తులో ఇంగితమువలన గ్రహించితిని; ఇంగితమువలన నిరూపణచేసితిని. కాని యొకవిషయము నా శాస్త్రములో వ్రాయఁబడియున్నది. అదియును జెప్పుటుచితము. నిర్ధనులగుదీనులతోనే నేనున్నాను, ఎవరు ఛిన్నవస్త్రధారులో, ఎవరు కడుబీదలో వారే ప్రాణబంధువులైనను, అల్పమున సంతసించు వారలెవరో వారే నాప్రాణసఖులైనను, నేనానూతన విషయమును శిక్షించితిని. ధనికుని నసహ్యతతోఁజూచి, దీనుని మన్నింపుమనియుఁ, బహ్రాక్రమశాలులను దృణీకరింపుమనియు, ధనికులకుఁ బరిత్రాణము లేదనియు, మానసంపదలు, గౌరవము, నెక్కడనో అక్కడ ధర్మములేదనియు, కేవలము పర్ణకుటీరములోనే ధర్మము వసించుననియు నొకయుక్తికలదు కాని యిక్కడిశాస్త్రములో నవవిధానమతమున ధనికులను దుఃఖులను సమానముగా మన్నింపుమని సిద్ధాంతమైనది. స్వర్గపథమున ధనికులు, దుఃఖులు, ఉభయులును పోవుచున్నారు. బాహ్యమందు ధనమున్న నష్టము లేదు; మనస్సు దుఃఖియైననే చాలును. బాహ్యమందు ధనమున్నదన్నంత మాత్రముననే ఎవరైన స్వర్గమార్గమునఁ బోఁజాలరా? దుఃఖులను దగ్గఱకుఁదీసికొనుము; ధనికులనుగూడ దగ్గఱకుఁదీసికొనుము. పక్షపాతశూన్యుఁడవై ఇద్దఱకును ప్రీతినిఁజూపుము. ఇది నవవిధానము యొక్క నూతనవిషయము; నూతనోపదేశము. ధర్మము రాజప్రాసాదములోను, బర్ణకుటీరమందును నున్నది. భక్తి నవాబును ప్రేముచేఁ గౌఁగిలించుకొనును; సామాన్యచండాలునిఁ గూడఁ

ప్రేమాలింగనములో బద్ధునిఁ జేయును. ప్రేమగలవానికి నరపతియెటులో దుఃఖియగునటులే. అతనిముందు 'ధనికుఁడు ధనికుఁడుగాఁడు; దరిద్రుఁడును దరిద్రుఁడుగాఁడు; అతఁడు మానవుఁడైనంతనే ప్రేమించును. ఇదియే నాహృదయములోఁ బ్రబలమయ్యెను. అగుటకును గారణమున్నది. నేను హీనస్వభావములోను, దీన మనస్సుతోను, మాతృగర్భమునుండి జన్మించినప్పటికిని, నేను దైన్యుఁడననియు, హీనుఁడననియు, భూమిష్ఠుఁడనైనంతనే గ్రహించినను, నలుదిక్కులఁజూడఁగనే ధనికులమధ్యజన్మించితిననియు, మహా ప్రాసాదములో దాసదాసీజనులమధ్య మహైశ్వర్యములో వాసమనియు గ్రహించితిని. ఉత్తరమందును దక్షిణమందును దేవతైశ్వర్యక్రియాకలాపమునే చూచితిని. అంతర్బాహ్యములల్లో యుద్ధము కొనసాగెను. చండాలునికుటీరమందు ఏలజన్మింపలేదని లోలోపల జిజ్ఞాసచేసితిని. దాసదాసీజనములు లేనిచోట, నశ్వ శకటములు లేనిచోట, నాకేలజన్మము కలుగలేదు? దుఃఖికి భగవానుఁడు ధనికులసంగమము నేలయిచ్చెను? బాల్యకాలములో భాగ్యవంతుల బాలురతోడను, యౌవనములో శ్రీమంతులయువజనులతోడను ఏలతిరిగితిని? వయసుముదిరినపుడు ఉన్నతవిద్యాశిక్షార్థమై ఉచ్చ విద్యాలయమున కేలవెళ్ళవలసివచ్చెను? దానిలో గభీరార్థమున్నదని ఈశ్వరుఁడెఱుఁగును. అవన్నియు నేలజరిగెనో అపుడు గ్రహింపఁ గలిగియుండలేదు. దీనజాతివాఁడనై, దీనులతోనుండియుంటినేని, దీనముగఁబ్రవర్తించియుంటినేని, దీనులపక్షపాతినై యుండవచ్చును; ధనికులమస్తకములమీఁదఁ గుఠారాఘాతమును వేయఁగోరియుండ వచ్చును. 'దీనగృహమందుండిన నుదాసీనుఁడనగువాఁడనని ఎవరు చెప్పఁగలరు? ప్రాణేశ్వరుఁడు ధనికులగృహమందు జన్మమునిచ్చెను;

అంతఃకరణమందు ఘనీభూతమైన దైన్యమును, నేత్రములముందు లక్ష్మీమయసంసారప్రకాండమును ఉంచెను. బాహ్యమందైశ్వర్యమున్నను, నేత్రములను బంధించి నిర్ధనక్రియాకలాపమును చూడఁ గల్గితిని. ఈ ద్విజాతీయ భావమధ్యమునందుండి సహస్రపర్యాయము లీశ్వరునకు నమస్కరించితిని. ధనికులపక్షపాతినైతిని; దుఃఖుల యొక్కయు పక్షపాతినైతిని. సకలపరిభేదములను మఱచితిని; వర్ణభేదజాతిభేదములను మఱచి యందఱకును ప్రేమనిచ్చితిని. ఇపుడు రెండుబాహువులను ప్రసారించి నవవిధానములోనికి ధనికులను దెచ్చుచున్నాను; పరివ్రాజకులును, సర్వత్యాగులును నగు దీనులను ఆలింగనముచే బంధించి తెచ్చుచున్నాను. ఒకపార్శ్వమున ధనికులను విద్వాంసులను గూర్చుండఁబెట్టుచున్నాను; ఇంకొకవైపున దీనదుఃఖులకు నాసనమునిచ్చుచున్నాను. పండితులను దెచ్చుచున్నాను. అందఱునువిచ్చేసి ప్రేమాలింగనములను గ్రహించుచున్నారు; అందఱునువచ్చి నవవిధానాలయమును నింపించుచున్నారు. నేఁడెట్టి మహాదినము! నా భాగ్యముచే ద్విజాతీయస్వభావమును జూచితిని. ఉచ్చజాతియొక్కయు, నీచజాతియొక్కయు, విద్వజ్జాతియొక్కయు మూర్ఖజాతియొక్కయు, నీద్విజాతులయొక్క సంధిస్థలమున నా భాగ్యమున జన్మించితిని. ఇందుచేతనే, “ఓయిదయాళుఁడా! ధనికుఁడు ధనమున్నదన్నంతమాత్రముచే నిన్నుఁ బొందలేఁడా? పండితుఁడు సంస్కృతమభ్యసించెనని నీగృహమునకు రాఁజాలఁడా? ఎవరేమాత్రమువిద్యనార్జింపలేదో, వారిని నీవు వెళ్ళనడతువా?” యందును. ఈశ్వరబాహువు లందఱకొఱకును బ్రసారితమ్ములై యున్నవని నవవిధానము వక్కాణించును. దుఃఖవికమ్ము. కాని యాకర్షించి యందఱను నీశ్వరగృహమునకుఁ దెమ్ము. అంతర

ముందేదీనజాతీయభావమున్నదో, దీనినుండి మహోపకారము కలిగినదని చెప్పఁగోరికయగుచున్నది. ఈదీనతాజలమునందు నహంకారాగ్నినిఁ జల్లార్పితిని; విద్యాధనములగౌరవమును నదుమ నణచితిని. ఈజలములో శాంతినిఁబొందితిని. కర్తవ్యానురోధమున గొప్పవారియిండ్లకు వెళ్ళుదును; ధనికులయొద్దకు వెళ్ళుదును; ఆచారవ్యవహారములలో గొప్పకుటుంబములతో నాబద్ధుఁడనగుదును; అయినను, నేను హీనుఁడనని, చిరహీనుఁడనని, నీచుఁడనని, అతి నీచుఁడనని, ఎఱుఁగుదును. నేనుమాత్రముదీనుఁడనై, దుఃఖధనికుల కుభయులకును గౌరవమునుజూపితిని; ప్రేమలో నుభయుల నాలింగనముచేసికొంటిని. స్వయముగ దీనదరిద్రజాతివాఁడ నైయుంటిని; దీనివలననే సుఖమును శాంతియు; దీనాత్మలకే పరిత్రాణము.

ఓయిదీనబంధూ! ఓకరుణామయా! పృథివియొక్క ఉచ్చపదమునుబొంది మనస్సెన్నిమాఱు లహంకారముతో గర్వితమగును! ధనమానములమధ్యనుండి హృదయ మెన్నిమాఱులు విచలితమగును! కాని, ఓదీనబంధూ! జన్మమునుండి, బాల్య కాలమునుండి, ఎవరిని దీనత్వములో స్థిరపఱచియుంతువో అహంకారము వారియొద్ద కెట్లురాఁగలదు? నేను దీనజాతి వాఁడనగుటచే దీనులదళములో నెంతలాభమును బొందితిని! దీనులతోఁగలసి నగరకీర్తనములో నెంతమత్తుఁడనైతిని! అధిక ధనమానములమధ్యను బ్రచురఫలమునుబొందితిని. గొప్పజాతివాఁడ నైయుంటినేని మహాపాపమును జేయువాఁడను. సామాన్య శాకాన్నములో నాసక్తిలేకుండెనేని, ఓయిదీనహీనగతీ! నిన్ను నేనెఱుఁగకుండువాఁడను; ఈదినము వేదిమీఁదఁ గూర్చుండువాఁడను

గాను. తనయుని ధనికులజాతిలోఁ జేర్చితినేని, వాఁడు ధనగర్వములోఁ బడి చచ్చిపోవుననియు, వానిని దీనజాతీయునిగాఁ జేయుటుచితమనియు నీవుగ్రహించితివి. ఓదయాసింధూ ! మోనమువచ్చుననియెఱిఁగి అహంకారము, మృత్యువు, వినాశముచేయుననిచూచి, “ తనయునకు దుఃఖమునన్నునిత్తును ; బీదవానియాత్మనిత్తును ; రుచులను దుఃఖుల రుచులవలెఁ జేసియిత్తు ” నంటివి. దీనజాతివాఁడనై వచ్చినప్పటి నుండియు నెంతసుఖమునుబొందితిని. అన్నిటికినిఁగారణము నీదైన్యమునే కంటిని. దైన్యస్వభావము నావక్షమున శాపముగాక యాశీర్వాదమయ్యెను. ఇన్నివిపత్తులు తలమీఁదనుండి దాఁటిపోయెనుగాని, దేనివలనను నేమియుఁగాలేదు. ఉచ్చపదములలోనికి నెంతయెక్కుచున్నాను ! ఎట్టియున్నతలోకులకరస్పర్శమును జేయుచున్నాను ! ధనముయొక్క యుష్ణత ననుభవింపఁగరాలేదు. బ్రాహ్మదశములో నాయొద్ద కెన్ని ప్రలోభనములువచ్చెనో, ఇన్ని యింకెవరియొద్దకును రాలేదు. ఇన్నిపరీక్ష లింకెవరికినిఁ గలుగలేదు. నాసంసారములోనికి రాచ సంసారమువచ్చినది ; గౌరవము మిక్కిలియెక్కిపోయినది ; కాని నాకు జారిపోలేదు. నీమీఁద బుద్ధియుంటచే ఝంఝామారుతములోను జావలేదు. నేనాచాఁపనే యల్లుచుంటఁబట్టియు, జాతీయభావమున జెల్లమునమ్ముకొనుచు బాటబాట తిరుగుచుంటఁబట్టియు, సామాన్యదీనసాంగత్యమునే వెదకుచుంటఁబట్టియు, బ్రతికి పోతిని ; లేదేని ధనసంపదలమధ్యఁబడి చచ్చిపోవువాఁడను. నీవెవరినిబ్రతికింతువో, వాని నెవరును హతునిఁజేయలేరని గ్రహించితిని.

దైవమా ! దీనత నాపరిత్రాత ! ఇపుడు నీవద్దఁగూర్చుండి యాశ్వాసముఁజేయుచున్నాను. ధనికులారా ! రండని ధనికుల

నాహ్వానము చేయుచున్నాను. సోదరా! నీవునురమ్మని దరిద్రునిఁ బిలుచుచున్నాను. ధనికుల సంసారములోనుంటిని; ధనికులు నిమంత్రణముఁజేయుదురు; అక్కడికి వెళ్ళుదును; గొప్పవాండ్రను బ్రేమింతును; రాణులను రాజులను బ్రేమింతును. మహారాజ్ఞికి భక్తిఁ జూపుదును. విద్వాంసులను గౌరవింతును. ఇపుడు ధనికులతోఁ గలసిమెలసితిరిగినను భయమింకను లేదు. సిద్ధుఁడైన భయమింక నుండదు. ఓయిదీనబంధూ! ధర్మముయొక్క శాంతభావమును, దీనభావమును అందఱకునిమ్ము! మేము యథార్థముగ దుఃఖులము. మానవవిధానము దుఃఖులవిధానము! మేము దుఃఖులవలె బాటవెంటఁ బోవుదుము; ధూళినై పోదుము. దంతమధ్యమునఁ దృణము నుంచుకొందుము; అపుడు చేతులుచాఁచి స్వర్గమునందుకొందుము. మేమందఱమును దీనాత్ములమై, పృధివిమీఁద నేపవిత్రస్వర్గీయ సుఖమున్నదో, దానినేయనుభవించి కృతార్థులమగునట్లు కృపఁజేసి యాశీర్వదింపుము!!!



## పంచదశాధ్యాయము.

### శిష్యప్రకృతి.

భానువారము ౧౦ వ పౌష్యము ౧౫౦౪ శకము.

ఈపృథివి బ్రహ్మవిద్యాలయము. ఈవిద్యాలయములో నుండవలసినవాఁడను ధర్మోపార్జనమును, జ్ఞానచర్చను జేయుచు బ్రహ్మనుబొందుదును. ఇందువలననే నన్నెన్నఁడును శిక్షకుఁడననుకొనియుండఁగలుగలేదు. నేనెన్నఁడును శిక్షకుఁడనని విశ్వసింపను. శిష్యుఁడనైవచ్చితిని; శిష్యజీవనమును ధారణముచేయుచున్నాను; అనంతకాలమును శిష్యుఁడనైయే యుందును. సిక్కుమతముయొక్క ప్రధానధర్మమగుశిక్షనందుట నాశోణితమందు నిహితమైయున్నది. ఆభావమునుండియే జీవనతరువు దినదినమును సబలమును, సతేజమును నగుచున్నది; శోణితమధ్యమున నాభావము దినదినమును బ్రబలమగుచున్నది. శిక్షనందితిని; శిక్షనందుచున్నాను. ఎల్లకాలమును శిక్షనందుదమని మిక్కిలి కోరికయున్నది. ప్రాతఃకాలమున, మధ్యాహ్నసమయమున, శిక్షింతును; విపత్సంపదలలో ధర్మగ్రంథముయొక్క నానాపరిచ్ఛేదముల నధ్యయనముచేయుదును. ప్రతిప్రాణియు, ప్రతివస్తువును నాకుగురువు. మానవప్రకృతియొద్ద నేననేకవిషయములను శిక్షింతును. నేత్రములను దెఱచిన విద్యాలయమును జూడఁగలను. నేత్రములనుమూసికొనిన నింకను మహత్తరమగువిద్యాలయ మగపడును. నాశిక్షార్థస్పృహకుఁ దగినటులే శిక్షణీయములు నపర్యాప్తములు. వివిధసత్యములును, బరిత్రాణప్రదమగుజ్ఞానమును నలుదిక్కులను విస్తృతమైయున్నవి. గ్రంథాభావము నాకెన్నఁడును గలుగలేదు; శిక్షించుట యేనాఁడైన

నాఁగిపోవుననివిశ్వసించియుండలేదు. శిక్షించుటయే నావ్యవసాయము; శిక్షలోనే నాజీవనము; సుఖము శిక్షలోనే; పరిత్రాణము శిక్షలోనే. శిక్షించిశిక్షించి ఇంతసత్యధనమును పొందితినని శిక్ష సమాప్తిచేయ వీలులేదు. ఇంకెంత ధనమును దెత్తునని ఇపుడనిపించుచున్నది. శిక్షసమాప్తమైనదని నాకెన్నఁడును అనిపించలేదు. ఎంతమంది గురువులయొద్ద సత్యమును శిక్షించుచున్నాను! ఆకాశము గురువు, పక్షి గురువు, మత్స్యము గురువు, అందఱు గురువులయొద్దను శిష్యత్వమును స్వీకరించుచున్నాను. ఇది కర్తవ్యానురోధమునఁ జేసితిననుటగాదు. ధర్మానురోధముననుగాదు. స్వభావము దీనికై యేర్పడినది. ఇందులోనే నాకు సౌఖ్యముకలుగును. అమెరికాఖండమును ఆవిష్కరించినపుడు, ఆవిష్కర్తమనమున నెంతసంతోషముపొడసూపియుండలేదు! ఏదోయొక చమత్కార వస్తువును దర్శించినపుడు దర్శకునకెంతసౌఖ్యముకలుగదు! ధర్మ సంబంధమునఁగాని లేక, నీతిసంబంధమునఁగాని ఏదోయొకనూతన సత్యము లభ్యమైనపుడు నాకంతకంటె గభీరమైన యానందము కలుగుననుకొనిరెద. నాకానందమెప్పుడుకలుగును? నేనేదో యొక సత్యమును బట్టుకొనఁగలిగినపుడు. నిజబుద్ధితో నేనెన్నఁడును సత్యమునార్జించియుండలేదు. వివిధశాస్త్రములను మథించి ఒక్కొకటిచొప్పున సిద్ధాంతముఁ జేయుట నావ్యవసాయముగాదు; ఈశిక్ష నాదికాదు. ఘోరాంధకారమధ్యమున విద్యుత్ప్రకాశమెటులో నాలో సత్యప్రకాశము నటులే. ఏదోవస్తువును గనుచున్నానో లేక ఏదోపనిచేయుచున్నానో, లేక ఏచెట్టువైపునకైనఁ జూచుచున్నానో, ఇట్టిసమయమున నకస్మాత్తుగా నెవరో నాయొద్దకు సత్యమును దెత్తురు. మనసులోపలి కొకసత్యమువచ్చుటయు, వెంటనే హృదయము

విద్యుత్ప్రకాశమువలె జ్వలించిపోవును; సమస్తజీవనము నాలోడిత మగును. ఒక్కొక సత్యము మనస్సునొక దెబ్బగొట్టుచు వచ్చుచుండును. ఇప్పుడు ప్రకాశమైన సత్యములను ఇతఃపూర్వమావిష్కృతములైన సత్యములతోఁ బోల్చిచూడఁగా నాసముదయమునుండి యివి నూతన మని కంటిని. నిత్యనూతనసత్యములు లభ్యమైనవి. లభ్యముకాఁగానే మనసులో సంతోషమును, శాంతియు నుదయించెను. ఆనందమయి యగుజనని అధ్యాత్మరాజ్యములో భక్తుల కీవిధముననే సత్యదానము చేయునని హర్షోత్ఫుల్లహృదయముతోఁ జూచితిని. ఒక్కసత్యము ప్రకాశితమైనట్లుగనే యది జీవనములో విశేషముగ నుపకారము చేయును. సత్యప్రకాశముచే, బుద్ధి చరితార్థమైనట్లుగనే జీవనము నీతిలో సుశోభితమగును. విశేషమిది; సత్యలాభముచే నాకుఁ బ్రహ్మానందమగును. ఆనందముకలుగదేని ఎవరును శాస్త్రవ్యవసాయమును గ్రహింపరు. జ్ఞానలాభముతోఁ గృతార్థుఁడనై నేను శాస్త్రవ్యవసాయము నారంభించితినా? నిర్దిష్టపాఠములలోఁ బరీక్షోత్తీర్ణుఁడనై నేను సిద్ధుఁడనైతిననియు, అధ్యాపకుఁడనైతిననియుఁ జెప్పుదునా? గురువువద్ద శిక్షింపవలసినది శిక్షించితినని యీసేవకుఁ డెన్నఁడు ననుకొనలేదు. బ్రహ్మవిద్యాలయములో నుపదేశము నిచ్చినపుడును నీభావము రాలేదు; బ్రహ్మమందిరముయొక్క సన్మానితస్థానమును బొందినతరువాత నేఁడును అట్లనిపించుటలేదు. "శిక్షించుట సమాప్తమైనది; ఇప్పుడు శిక్షఁగఱపవలయు" నను నీమాట ఎన్నఁడును మనసులోనికి రాలేదు. చదువుకొనునపుడును నీభావము కలుగలేదు; చదివించినపుడును బుట్టలేదు. నేను శిక్షించినపుడును శిష్యుఁడనే; శిక్షనిచ్చినపుడును శిష్యుఁడనై నలుగురితో సాధనఁజేసి తత్త్వసంచయముచేయుదును;

హృదయమధ్యమున సత్యరత్నము దొరకఁగనే ఆహ్లాదమగును. సౌభాగ్యవశమున మేదినిమీఁదికి వచ్చితిననియు, మనుష్యజీవనము సౌభాగ్యజీవనమనియుఁ దోఁచును. శిక్షఁ జేసిన నెంతయానందమగునో ఇచ్చిన నంతయానందమగునా? సత్యలాభమపూర్వానందమునకుఁ గారణము. సత్యముతో నాత్మయొక్క సంబంధమొకటియున్నది. సత్యము దొరకఁగనే నేనొకనూతనజగత్తును జయించితిననియు అధ్యాత్మరాజ్యముయొక్క యొకమహాసంపత్తి నా హస్తగతమయినదనియుఁ దోఁచును. ఎవనికి రాగజ్ఞానమున్నదో అతఁడు తాంబుఱగాని, చితారుగాని, పుచ్చుకొని లేక, ఇంగ్లండుదేశముయొక్కగాని, భారతవర్షముయొక్కగాని ఏదేనిగానయంత్రమును బుచ్చుకొని స్వరానుగుణముగఁ బాడుచుఁ బాడుచు నొకనూతనరాగము నావిష్కరింపఁజేసెనేని అతని యానందమునకు మేరయుండదు. సురసజ్ఞునిహృదయములో నెట్టి యానందసంచారమగును! "నాగళద్వారమునుండి నూతనరాగము బహిర్గతమైనది! సరస్వతి నాయొద్ద కొకనూతనరాగమును బంపె"నని భావించుచు భావించుచు నావ్యక్తి ఆనందములో విహ్వలుఁడగును. నూతనరత్నములభ్యమైన స్వాభావికముగ హృదయమున నానందఁమాగదు. సామాన్యధీవరుఁడు నీటిలోఁ జేఁపలఁబట్టుచుండెను. అనుదినము నధ్యవసాయసహకారముతోఁ జేఁపలను బట్టుచు నాపురాతనపుఁ "జేఁదువక్కు" లను "బొచ్చె" లను ప్రాప్తించెనేని అతనిజీవనోపాయము జరగును; పరిశ్రమ సార్థకమగును. అంతకుఁదక్క నింకేసుఖమును గలుగదు. కాని యొక్క నాఁడు సోమవారముదయమున జాలమును వైచినట్లుగనే అపురాతనజాతి మత్స్యములకుఁబరివర్తముగా నెన్నఁడును గననట్టియు, విననట్టియు

నొక నూతన జాతి మత్స్యమును , జూచె నేని అతని యానందమునకు మితి యుండదు. అతని శరీరము యొక్క యొక వైపునుండి మఱియొక వైపునకు నానందము ప్రవహింపసాగును. చిత్రకారుఁడు శిక్షకుని వద్ద శిక్షించిన యా భావభంగులను, నాయాకారప్రకారములను లక్షణములను శిక్షించినట్లుగనే జెప్పుచుండును. కాని చిత్రము వ్రాయుచు వ్రాయుచు నుండఁగా నూతనవర్ణము బహిర్గతమైన, నొక నూతన భావము వ్యక్తమైన, నొక నూతన లక్షణము చిత్రమునఁ జిత్రితమైన, "నా స్రష్ట ధన్యుఁడగుఁ గాక ! పృథివి ధన్యమగుఁగాక !" యనుచుఁ, దాను ధన్యుఁడ నన్నుకొనుచుఁ, జిత్రకారుఁడు నిజసౌభాగ్యమును దెలుపసాగును. "దేనిని శిక్షింపలేదో అదెట్లయ్యెను ? అది యెక్కడనుండి పుట్టె" నని భావించుచుఁ జిత్రకారుఁడు విస్మయాన్వితుఁడై కొయ్య బొమ్మవలె నిలువఁబడిపోవును. చిరకాలమునుండి గ్రహ నక్షత్రములను జూచుచువచ్చుచున్న జ్యోతిర్విదుఁ డెప్పుడానందమును బొందును ? ఆపండితుఁడు, ఆవిజ్ఞానవిదుఁడు నభోమండలమును జూచుచుఁ జూచుచు నొక నూతన నక్షత్రము నెపుడు కనిపెట్టునో అపుడు తన హృదయము యొక్క యతులానందమును ఘోషించుటకై యత్నించును. కోటిరూప్యములు దొరకినను మనుష్యున కట్టి యానందము కలుగదు ; సమ్రాట్టు యొక్క సింహాసనము లభ్యమైన నట్టి యాహ్లాదము సంభవింపదు. "నేఁడు నేనాకాశమండలములో నూతన నక్షత్రమును దర్శించితిని ; నేనొక నక్షత్రము నావిష్కరింపఁ గలిగితిని ; దీనివలననే నాకుఁ బరమసుఖ" మనుకొనును. నూతన నక్షత్రమును గనఁగలుగుటచే జ్యోతిర్విదున కెంతయానందమో, నూతన సత్యము లభ్యమైన నాలో నంతకంటె నధిక సుఖమును

సానందమును గలుగును. ఎవరు ధనికులు కాఁగోరుచున్నారు? నృపతి కావలయునని యెవనికున్నది! బ్రహ్మప్రసాదముచే నూతన సత్యము సమాగతమైన నపుడా సత్యమును దొరకొనుటలో నుండు సుఖ మింకెందునుండదు. శిష్యప్రకృతివిశిష్టుఁడనగుట చేతనే నేను ధన్యుఁడననుకొందును. విద్యాలయముయొక్క ఛాత్రవ్రతమును నాలో నింకనుగనుచున్నాను; నాల్గువేదముల నెన్నఁడును జదువుట కాలేదు. శిష్యత్వ మిఁక నంతరింపలేదు. హిమాలయప్రకాండము బ్రహ్మజ్ఞానముయొక్క మహత్వపరిచయము నిచ్చుచున్నది. జ్ఞానము నెంత శిక్షించినను సమాప్తము కాదనునుక్తియొక్క నిదర్శనమును నలుదిక్కులఁ జూచుచున్నాను. జ్ఞానమునకు సమాప్తి లేదని సాధారణరూపమునను, విశేషరూపమునను, ఉభయరూపమునను, గనుచున్నాను. భక్తిసంబంధమునఁగాని, బ్రహ్మదర్శనసంబంధమునఁ గాని, శిక్షయొక్క యంతము కాలేదు. సమస్తశాస్త్రముల యొక్కయు సమన్వయమే ప్రకారముగ నగునను విషయమును గూర్చియు బ్రహ్మముఖమునుండి యెట్టియాశ్చర్యపు సంగతులను వింటిని! అప్పటికినిఁ బూర్తి కాలేదు. జాగ్రజ్జగద్గురు వెవరిగురువో వారిశిక్షకు నభావమేమి? సామాన్యగురువుపద్ద ఛాత్రుఁడను గాలేను; నాగురువు జగద్గురువు. ఆయన కేవలము శిక్షించుచున్నాఁడు. ఎంతశిక్ష చేయుదునో యంత యహంకారము చూర్ణమగును. నలుఁబది వత్సరములు గడచిపోయినవి; అయినను శిక్ష యింకను బూర్తి కాలేదు. ఎన్ని ప్రార్థనాతత్త్వములను శిక్షించితిని; అయినను శిక్షించుట అయిపోలేదు. దయాళుని నామము నెట్లు కీర్తింప వలయునో నేటికిని చక్కఁగ గ్రహించుట కాలేదు. ప్రేమయొక్క శబ్దార్థమేమో, ప్రేమయననేమో, రూఢియగుట పరిసమాప్తి

కా లేదు. అందులకనియే నన్ను నేనొక్క కమాఱు గదుముకొందును. గదుముకొనినట్లుగనే సత్యమును శిక్షింతును. నేను ధన్యుఁడను. ఈవిధమున ననేక సత్యములను శిక్షించితిని. ధన్యుఁడను నేను; ఆవిధమున నింకను శిక్షించుచున్నాను. ఇంకను శిక్షకుఁడనుగా లేదు: శిక్షకుఁడనుగా లేదని యెల్లకాలము స్వార్థపరుఁడనై యుండనా? జ్ఞానమును సంపాదించుకొనినపుడు దాని నెవరికినీయకుందునా? కృపణునిదివలె సాధనము మంతలోఁజిరబద్ధమైయుండునా? "గ్రహణ మంత్రము" ను సాధనఁజేసితిని గాని "ప్రదానమంత్రము" ను నేనెన్నఁడును స్వీకరింపలేదు. "దానము" నామూలమంత్రము గాదు. సత్యము రాఁగానే యది బహిర్గతమగును. ఇదియే స్వభావము యొక్క నియమము. మాదేశపులోకుల యొక్క స్వభావము సత్యము రాఁగానే ప్రకాశితముఁజేయునట్టిది. ఎవరు మాదేశమునుండి వచ్చిరో వారింటికి రెండు ద్వారములున్నవి. ఒక ద్వారముగుండ దిగుమతి; ఇంకొక ద్వారముగుండ నెగుమతి. ఒక మార్గమునుండి వచ్చుట; మఱియొక మార్గమునుండి పోవుట. సత్యమే తెంచి జగత్తులోనికిఁ బ్రవహించును; జగత్తులో ద్విగుణమై లోపలఁ బ్రవేశించును; చతుర్గుణమై తిరిగి బహిర్గతమగును; శతగుణమై తిరిగివచ్చును. మనోమధ్యమునకు వచ్చిన వృద్ధియగును. వ్యయమైన నింకను వృద్ధిఁ జెందును. సత్యము లభ్యమైనపుడు మనసులో నానందము జన్మించును; సత్యము ప్రకాశించిన నానందమింకను నధికమగును. సత్యమును లభింపఁజేసికొనుటకే నాయాశయు, నాతురతయు. సత్యము నెట్లిత్తునని యొక్కమాఱును భావింపలేదు. నోరుతెఱచి యేమి చెప్పుదునని యెన్నఁడును జింతింపలేదు. ఎప్పుడు చెప్పవలసివచ్చునో సత్యము తనంతనే తేజములోఁ బ్రకాశితమగును. గురుత్వము సారము;

దానినెన్నఁడును అవలంబింపలేదు ; ప్రాంతసంగతులను జెప్పలేదు. గతసంవత్సరమేమిచెప్పితినో ఈసంవత్సరము దానినే ఎన్నఁడును జెప్పను. ఇచ్చుటకురాలేదని గ్రహింపఁగలిగితిని. శిక్షించుటకువచ్చితిని; శిక్షితవిషయములు తమంతనే ప్రకాశితమగును. గతవత్సరమేమి చెప్పుటకైనదో, ఈవత్సరమును దానినేచెప్పితినేని, నిన్న నేఁ బ్రార్థనఁ జేసితినో నేఁడును అదియే చేసితినేని, నిన్న నేయుపన్యాసమునిచ్చితినో యాయుపన్యాసమునే తిరిగియిచ్చితినేని, అపారమైనగురుత్వమును జేయుచున్నానని, ' కనుబొమ్మలనుద్దవ్వుదు నలుగురిమనస్సును హరింపయత్నముచేయుచున్నానేమోయని తోఁచును. పుష్కరిణి యెండిపోయినదిగాఁబోలును ; లోకులకు బురదనిచ్చుచున్నాను గాఁబోలును ; బురదయు నిఁక లేనట్లున్నది ; ఎండిపోయినమనస్సు కాల్పుచున్నది. కాని, ఈమాటచెప్పఁగతి నాకుఁబట్టలేదు ; ఈమనస్తాపము నానోటినుండి యుచ్చారితము కాలేదు. దీననాథుఁడు తక్కిననాల్గువిషయములలోను ఎట్లుపకారముఁజేసెనో ఈవిషయమునను అట్లేయుపకారమొనర్చెను. "ఏమియులేదు. ఏమిచెప్పుదును ? ఏమివ్రాయుదును ?" అని ఈచింతలో నేనాఁడును చింతకుఁడనుగా నవసరమురాలేదు. నిన్నటిదినము నీదినముగాఁజేయనా ? పురాతనేతిహాసమును వర్తమానముగఁజేయనా ? నమలినదానిని దిరిగినెమరువేయుదునా ? ఛీ! ఛీ! నా గురు వీ మాట విని న నసంతుష్టుఁడగును. అందుచే నమలినవస్తువు నెన్నఁడును నెమరువేయ నవసరము రాలేదు ; నాకు బురదలోఁబడిదొర్లవలసిరాలేదు; "ఏమియిచ్చితిని ? ఏమినేర్పితిని ?" అనువైపునకు దృష్టిపోలేదు. ఏమినేర్చితిననియే కేవలముచూతును. ఇందువల్లనే నేను బ్రతికిపోతిని. సద్విషయములను నలుగురికీ వినిపించుచున్నానని యనిపించినపోఁడనే.

నాలుక ముడ్దకట్టుకపోవును; వాక్యరోధమగును; మనశ్శరీరములు సంకోచముఁ జెందును. నేను నేర్చినదే, నేర్పుటయైనది. నేను బొందినదే, ఇంకఁబదిమంది పొందుటయైనది. నా శరీరమునుండి శ్రోతయొక్క శరీరములోనికి సత్యలాభముయొక్క బలమును, ప్రభావమును సంచారితమగును. నా యాత్మలోనికి సత్యము వచ్చినంతనే అది ఇతరులదగును; నాలో సత్యము ఘోషితమైన, నా సత్యము శంఖఘంటానహకారములతో సర్వత్ర నిశ్చయముగా ఘోషితమగును. నేనేది శిక్షింతునో భారతవర్షము నదియే శిక్షించునని యీమెవైపునకుఁ జూచి కనుగొంటిని. ఒకపక్షి సత్యమును ముక్కునఁగఱచుకొని, య్యెందఱయిండ్లకును మోసికొనిపోయి, ఇచ్చివచ్చుచున్నట్లున్నది. నా హృదయ మంతఃప్రణాళిద్వారమున భ్రాతృవరుల హృదయముతో సంయుక్తము చేయఁబడినట్లున్నది. తన్మూలమున నా హృదయము యొక్క సత్యము సర్వత్ర సర్వహృదయములకును జేరుచున్నట్లున్నది. గగనమున సూర్యజ్యోతి ప్రకాశితము కాఁగానే, ఆజ్యోతి అందఱను జ్యోతిష్మంతులను జేయును. ధనాఢ్యుల ప్రాసాదములలో నెటులో, దరిద్రుల కుటీరములోను నటులే సత్యము సంచరించుచున్నదని వినుచుందును. ధన్యుఁడు జగదీశ్వరుఁడు! ఒకనియొద్దకు సత్యము వెళ్ళి, ఆ సత్యము దశసహస్రలోకుల మనస్సులోఁ బ్రకాశితమగుచున్నది. మేము కేవలము సత్యమును శిక్షింతుము; ఎల్లకాలమును శిక్షింతుముగాకనియే కోరిక! ఎట్టివానివద్దనైన శిక్షింపనిచ్ఛయగును. సామాన్యగాయకునిఁ జూచిన నతని పాదములపైఁబడి శిక్షింప నాకిష్టమగును. ఎవరైన బైరాగి వచ్చిన లక్షరూప్యము లింటికి వచ్చిన వనుకొని అతని సంగీతమును విని యెంతనేర్చుకొందును! ఎవఁడైనను మాతృసందేశమును బట్టుకొనివచ్చెనేని ఏదోయొక విధమున నతని

రెయొద్దనుండి కొంచెమాదాయముఁ జేసికొనఁగలిగినఁ జాలు ననుకొందును. ఈజీవనములో నెవరైనను దగ్గఱకువచ్చి యీయకుండఁగ వెళ్ళిపోలేదు. సాధుసంఘములోఁ గూర్చున్నంత మాత్రముననే గుణము నాకర్షింపఁగలుగునట్లు భగవానుఁడు హృదయమునకశక్తి నిచ్చెను. సాధువు నాదగ్గఱగాఁ బోయినప్పుడు తనహృద్గుణములను బడవేసిపోయెనని చక్కఁగ గ్రహింపఁగలను. నేను కొంతయశనివలెనగుదును. నేను జన్మశిష్యుఁడను; జన్మమునుండి శిక్షించుచున్నాను; శిక్ష అయిపోలేదు. అందఱియొద్దనుండి యెల్లకాలమును శిక్షింతును. సూకరాదిపశువులవద్దనుండియు శిక్షనందుదును. శిక్షింపుచు శిక్షించుచుఁ బరలోకమునకుఁ బోదును.

ఓయిసద్గురూ! అనుగ్రహించి యీవ్యక్తివిమీఁదఁ జాలఁగ శిక్ష నిచ్చితివి; చాలఁజూపించితివి. అన్నముఁబెట్టి యెట్లుశరీరపోషణఁ జేయుచున్నావో, ఆత్మముఖములో నూతననూతనసత్యములను వేసి అట్లె యాత్మపోషణఁ జేయుచున్నావు; ఇందులకై ధన్యవాదముల నిత్తును. నాగోపనవిషయములను ఎట్లువ్యక్తముచేయుదును! ప్రకాశముగాఁ జెప్పలేకున్నానుగదా! నీవద్దఁ గూర్చుండి యశేష సుఖమును భోగించుచున్నాను. సత్యమును శిక్షించినకొలఁదిని ఎంతసుఖముగనున్నది! నూతనసత్యము లభ్యమైనపుడు హృదయము పిచ్చెక్కిపోవునంతయానందము కలుగును; బిగ్గఱగ నఱవ బుద్ధిపుట్టును; ప్రాణము తపతపలాడును. ఈనూతనవిషయ మెక్కడనుండివచ్చినది, ఎవరిచ్చిపోయిరనియే భావింతును. దైవమా! గురువద్ద సత్యమును శిక్షించుట మహాసౌఖ్యప్రదము. నిరాశ్రయియైశిశువునకు సుఖము నేయిచ్చుచున్నావు. తల్లీ! నిన్నువదలి యింకేగురుగృహమునకైనఁ బోయియుంటినా? విద్యాలయములోఁ జదివి శిక్షసమాప్తి చేయుట కెన్నఁడైనఁ గోరితినా? వేదపాఠశాలలో-

జదువుకొని పండితుఁడనగుట కెన్నఁడైనఁ బ్రయాసపడితినా? నా యాశలన్నియు నీ చరణములందు; నా విద్యాబుద్ధు లా పాదధూళియందు. నేనన్యజ్ఞానములో జ్ఞానినిఁ గాలేదు; అందుచే, తల్లీ! నీవు నాకు వేదవేదాంతములను, సాహిత్యేతిహాసములను, శిక్షించుచున్నావు. జనని ఎవరికి సరస్వతియో వారిల్లు బ్రహ్మవిద్యాలయము. వారి తల్లి యెన్నఁడును శిక్షింపమనదు. నీవు మమ్ము చిరశిక్షార్థులను జేసియుంపుము. మేము కేవలము శిక్షింతుము. సామాన్యలోకుల కింత యభిమానమేల? అధ్యాపకుల సంఖ్య ఇంత వృద్ధియగుచున్న దేల? అందఱును శిక్షనీయఁ గోరువారే కాని ఎవరును శిక్షనొందఁ గోరరు. మనుష్యులకు సుమతినిమ్ము. శిక్షించిననే శిక్ష నిచ్చుటయగును. ఇఁకను బ్రచారము చేయుటకు వెళ్ళనిచ్చ లేదు; సత్యము వచ్చినంతనే యది తనంతనే బహిర్గతమగును. సత్యము లభ్యమగుట సమాప్తమయ్యెనేని, ఇచ్చుటయు సమాప్తమగును. అనంత వేదములోఁ బండితునిఁ జేసితివేని, శిక్షించుటయును సమాప్తము గాదు; శిక్షనిచ్చుటయును సమాప్తముగాదని యపుడు చెప్పఁగలను. ఈ జీవనములో సత్యము యొక్క యభావము నెన్నఁడు ననుభవింప వలసి రాలేదు. సత్యములు రాసులకొలఁది వచ్చుచున్నవి. అవశిష్ట జీవనమును నేర్చుచు నేర్చుచునే వెళ్ళఁబుత్తును. శిష్యుఁడనై యెల్లకాలమును నీ వేద విద్యాలయములోఁ జదువుదును. నూతననూతన శతసహస్ర వేదములను నీ యీ యుపాసక మండలికి శిక్షింపుము. దంభనాశముఁ జేసి యందఱ వినీతులఁ జేయుము; బ్రతికియున్నన్ని దినములు మేము శిష్యవ్రతమును సాధన చేయుదుము. ముక్తిప్రదమగు సకల సత్యములును లభింపఁగా జీవనమును సుశోభితముఁ జేసికొందుము; కృపఁ జేసి మాకీ యాశీర్వాదము నిమ్ము! నీ శ్రీచరణములయందు మా ప్రార్థన ఇదియ !!!

# షోడశాధ్యాయము.

---

## అనృతఖండనము.

నాజీవనవేదమును బఠింపక, పరిచ్ఛేదసముదాయముల నధ్యయనము చేయక కొందఱుకొందఱు అన్యాయపుమాటలనన్నియు వచించిరి. అందుచే వారీశ్వరునిముందును, మానవులముందును మిథ్యాకథనముచే నపరాధులైరి. అనేకులమిథ్యావచనములను స్పష్టముగా నిర్ధారణచేయుటావశ్యకము. అందుచే నెవరు జీవనవేదముయొక్క విశేషతత్త్వమునెఱుఁగక సిద్ధాంతముచేసిరో, మఱియుఁ దద్ద్వారముననేనమస్తానృతవచనములచే దోషులైరో, ఆ సిద్ధాంతములను, నాయనృతవచనములను నన్నిటిని ఖండించుట యావశ్యకము. మిథ్యాకథనదోషములో నెవరెవరుదోషులు? ఎవరెవరపరాధులు? ఈ పృథివియందు శ్రద్ధేయులును, భక్తిభాజనులు, నగునీశ్వరప్రేరితులైన మహాపురుషులతోడను, బుణ్యప్రవర్తకుఁడగు క్రీస్తుతోడను, ముక్తికిసహాయుఁడగు గౌరాంగునితోడను, నీనరకకీటకము నెవరు సమానునిఁ జేసిరో, ఈవేద వారిని మిథ్యావాదులనుటకు వెనుదీయదు. నేను వారితో సమానుఁడనా? ఈమాట కేవలమసారము. ఎవరిచరణరేణువులను మస్తకమందు ధరించుటకు నేనుదగనో, వారితో నేనుసమానుఁడనని యెంచుకొందునా? ఎవరిదగ్గఱఁగూర్చుండ నర్హత లేదో, సమస్తపృథివియు నెవరికిభక్తిఁజూపునో, ఎవరియొద్దనుండి యది పరిత్రాణోపాయము నందుకొననిదో, ఆయందఱుసాధువులవద్దకుఁ బాపునివలెఁ బరిత్రాణప్రార్థినై పోదును. కాని జీవులకుసహాయుఁడనై వారితోఁ గలసికూర్చుండుటకుమాత్రము యత్నింపను; ఏకాసనముమీఁద

గూర్చుండెను. ఎవరుక్రిందనుగూర్చుండియున్నారో, ఎవరు వారిని దృష్టాంతముగ గ్రహించుచున్నారో, ఎవరు వారియుపదేశములను వినుచున్నారో, నేనిట్టివారిలో నంతర్భాగుఁడను. దీనిలోనే నా గౌరవము; నేను వారినామమునుచ్చరించి పవిత్రుఁడనై నృత్యము చేయఁగల్గిన నదియే నాకుసుఖమును శాంతియు. ఈవ్యక్తియొక్క చరిత్రము నిర్మలమనియు, పాపముకనఁబడదనియు, సాధువులలో నీవ్యక్తి శ్రేష్ఠుఁడనియు, నెవరువచించిరో వారి నీవేద మిథ్యాకథనమున నపరాధులని తేల్చివేసినది. చాలపాపములుండినవనియు, భయానకములగుదోషకళంకము లాపాపమూలముతోఁగూడ నీజీవనము నాశ్రయించుకొనియుండిననియు, నింకనుఁబోలేదనియు నీజీవన వేదములో స్పష్టముగఁజెప్పఁబడియున్నది. ఎవరుసాధువులో, ఎవరి నామముస్మరించిన జీవనము పవిత్రముగునో, నన్నెవరు నందులో వాఁడననుకొనకుందురుగాక! నలుగురును ఏప్రకారముగ గుప్త పాపముతో సంగ్రామముఁజేయుదురో నేను నట్లేయని యందఱును దెలిసికొందురుగాక! వారు తాముబాగుపడుటకై యెట్లు ప్రార్థింతురో నేనును దోషముచేతను, గుణముచేతను మిశ్రితుఁడనై అట్లే ప్రార్థింతును. దోషములున్నను నితరులెట్లీశ్వరునివద్దనుండి సత్యమును గ్రహింతురో, లోకుల కుపదేశమునిచ్చుటకు సాహసులగుదురో, నేనును అట్లే సత్యమునులభ్యముచేసికొందును; ఉపదేశమిత్తును. ఆచార్యుఁడనైతినను దానికర్థము పాపవిముక్తుఁడనై యాచార్యుఁడనైతిననిగాదు; ఆచార్యుఁడనైతినను దానికి నర్థము నేను నిర్మలుఁడనైతిననియు, నిపుడితరులను నిర్మలులనుఁ జేయుటకై బ్రవృత్తుఁడనైతిననియుఁగాదు. నేనాచార్యుఁడనేలనైతిని? కొన్నిరత్నములుదొరికినందుచే వానినితరులకునిచ్చునిమిత్తమై.

కొన్ని భావములు లభ్యమైనతోడనే తక్కిననలుగురకుఁ
దత్సముదయము నర్పింతును. పాపాత్ముఁడనైయుండఁగాఁ,
బరహితసాధనార్థమై ఆచార్యాసనముపైఁ గూర్చుండుట నాకులజ్జగా
నుండును. నేను ఏకొంచెము నల్పాల్పముగా స్వర్గమునుండి పొందితినో,
ఆకొంచెము నిచ్చుటకుఁ గృతసంకల్పుఁడనైతిని. కాని సాధు
మహాపురుషులతో సమానుఁడనగుటకుఁ దగినవాఁడను గాకున్నను,
వారిచరణతలమందుఁ గూర్చుండుటకు యోగ్యుఁడను గాకున్నను,
నిర్మలచరిత్రులగు సాధకులతోడను, పవిత్రచరిత్రులగు
మహర్షులతోడను సమముగా నుండుటకు నర్హుఁడను గాకున్నను
నేను వారియొక్క నామస్మరణముచే రిపుదమనవ్రతములో వ్రతి
నైతిననియును, జ్ఞానమును, పుణ్యమును, శాంతియుఁ, బ్రేమయు యీ
శ్వరునియొద్దనుండి నాయొద్దకు వచ్చుచున్నవనియును, దప్పక
స్వీకరింపవలయును. ఈజీవనము ఆదేశమయము కాదని, ఈవ్యక్తి
యీశ్వరదర్శనము చేయలేదని ఎవరువక్కాణించిరో వారును మిథ్యా
వచనములను బలికిరి. అడుగడుగునకు నీశ్వరదర్శనముఁ
జేయుచున్నాను ; ఆయనవాణిని వినుచున్నాను. ఇదిసత్యము. ఇదియే
వేదవాక్కు. ఈప్రకారమగుటచేతనే నేను బ్రతికియున్నాను.
ఈవ్యక్తి యయోగ్యుఁడైనను, ఒకమాఱుగాక, రెండుమాఱులుగాక,
శతసహస్రపుమాఱులు స్వర్గసుభాషిత వాణిని విని, జీవనమును
బవిత్రముగను సౌఖ్యవంతముగను జేసికొనును. శతసహస్రపర్యాయ
ములు దర్శనమును లభింపఁజేసికొనఁగా, జీవనము పవిత్రమును,
దర్శనప్రత్యూషమును నగును. ఎవరీవచనమును స్వీకరించిరో వారు
సత్యమును బలికిరి. ఈవ్యక్తియొక్క యీశ్వరదర్శనము భ్రాంతి
యనియుఁ, గల్పనమనియు, వాస్తవముగా నీవ్యక్తి యీశ్వరుని

